# కొంత కాలం ఎదురు చూసైనా ఆల్విన్ కొనడం ఎందుకు సమంజసం

**ఆల్విన్ తన శ్రేణిలో సాటిలేనిది.**
ఎప్పుడైనా ఆల్విన్‌కి వెయిటింగ్ లిస్ట్ ఉంటుంది. కొనుగోలు దారులు ఆనందంగా ఆల్విన్ కోసం ఎదురు చూస్తారు. ఎందుకంటే ఆల్విన్ తన శ్రేణిలో సాటిలేనిది.

చడీ చప్పుడు లేని పనితనం, ఏళ్ళ తరబడి మీకు చీకు చింతలేని సేవ అందిస్తుంది. సాటిలేని లక్షణాలని సంతరించుకుని నిరాటంకమైన సేవనందించేలా నిర్మించబడినది. మీరే అనుభవించండి.

**హిటాచి రూపకల్పన చేసిన కంప్రెసర్**
చప్పుడు చేయని, సాఫీగా, చీకు, చింతలేని పనితనం.

**వోల్టేజి స్టెబిలైజర్ అవసరం లేదు**
ఎందుకంటే, 170 నుంచి 250 'వోల్ట్స్' దాకా 'వోల్టేజి' హెచ్చు తగ్గుల్ని సునాయాసంగా భరిస్తుంది.

**రోల్ బాండ్ ఫ్రీజర్**
త్వరగా 'అయిస్' అవుతుంది. పళ్ళు, కూరగాయలు ఎల్లప్పుడూ తాజాగా ఉంటాయి.

**సెల్ఫ్ డ్రైనింగ్ పద్ధతి**
బాదరబందీ లేకుండా మీట నొక్కగానే దానంతట అదే జమకూడిన 'అయిస్' కరిగించేస్తుంది.

**ఎక్కువ చోటు**
ఆల్విన్ అన్ని రిఫ్రిజిరేటర్ల కంటే ఎక్కువ 'చిల్ ట్రే' మరియు 'క్రిస్పేటర్' స్థలం ఉంది.

**తక్కువ చోటు**
మిగతా వాటి కంటే ఆల్విన్ రిఫ్రిజిరేటర్ పెట్టుకొనుటకు తక్కువ స్థలం ఆక్రమిస్తుంది.

**ఎన్నో రకాలు**
ఆల్విన్ 165 ఇంకా 300 లీటర్ల సింగిల్ డోర్, డబుల్ డోర్ మోడల్స్‌లో ఎన్నో రంగుల్లో లభిస్తాయి.

**7 సంవత్సరాల గ్యారంటీ**
సంవత్సరాల తరబడి చీకు చింతలేని సేవ

**దేశవ్యాప్తమైన సేవాసౌకర్యం**
ఒక్క ఫోన్ పిలుపుకే మీ సేవకై సిద్ధం.

**ఆల్విన్ మీకోసం విమాత్నమైన 'రక్షణ ఒప్పందాన్ని' అందిస్తుంది.***



IS 1476 ISI
అన్ని సింగిల్ డోర్ ఆల్విన్ రిఫ్రిజిరేటర్లు ఐ ఎస్ ఐ చిహ్నం కలిగి వుంటాయి

**ALLWYN**




**అన్ని వేళలందు ఆల్విన్**

* మిగతా వివరాలకోసం మీ దగ్గర్లోని ఆల్విన్ ఏరియా ఆఫీసును సంప్రదించండి.

**హైదరాబాద్ ఆల్విన్ ఏరియా ఆఫీసులు:** అహ్మదాబాదు, ఫోను: 463181, బెంగుళూరు, ఫోను: 238885, భోపాల్, ఫోను: 64122, భువనేశ్వర్, ఫోను: 52271, బొంబాయి, ఫోను: 4927575, 4927586, 4934178, 4921051, కలకత్తా, ఫోను: 440437, 446853, 433576, చండీఘడ్, ఫోను: 41941, కడప, ఫోను: 2230, ఎర్నాకులం, ఫోను: 368002, గౌహతి, ఫోను: 32691, ఘజియాబాదు, ఫోను: 843204, హైదరాబాదు, ఫోను: 43407, జబల్‌పూర్, ఫోను: 22665, జైపూర్, ఫోను: 65729, కాన్పూర్, ఫోను: 245249, కర్నూల్, ఫోను: 2480, మద్రాసు, ఫోను: 861401, నాగపూర్, ఫోను: 45125. న్యూఢిల్లీ, ఫోను: 734740, 730715, పాట్నా, ఫోను: 32745, పూన, ఫోను: 39029, విజయవాడ, ఫోను: 62544, విశాఖపట్నం, ఫోను: 61652.

MAA COMMUNICATIONS/HAL/A/TEL/88




## అరవై వేలకు ఓ ఆటోగ్రాఫ్

సినిమాతారలు కనబడినా, క్రీడాకారులెదురైనా, ప్రముఖ నాయకుడు ఉపన్యసించి వేదిక దిగినా యువత వారి దగ్గరకు పరుగులు పెట్టి ఆటోగ్రాఫ్‌బుక్కులో సంతకాలు పెట్టించుకోవడం మనం చూస్తుంటాం. వారి గుర్తుగా ఆ ఆటోగ్రాఫ్‌ను దాచుకుంటారు. మహాత్మాగాంధీ, జవహర్లాల్‌నెహ్రూ, యం.జి.ఆర్. మున్నగు నాయకులు ఆటోగ్రాఫ్‌తోపాటు ఓ సందేశాత్మకమైన వ్యాఖ్య కూడా రాసేవారు. అది చూసినపుడల్లా ఆ వ్యక్తికి ఓ సరికొత్త ప్రేరణనూ, స్ఫూర్తినీ, ఉత్సాహాన్ని కలిగిస్తాయా పంక్తులు.

'ఆటో' అంటే గ్రీకు భాషలో 'అతని స్వంతం' కాగా 'గ్రాఫియన్' అంటే రాయటం అని అర్థం.

డాక్యుమెంట్ల మీదా, ముఖ్యమైన కాగితాలమీద సంతకాలు చేయటం, వివాదాస్పద పరిస్థితులలో వాటిని సరిపోల్చటం ఆనవాయితీ. అలా సంతకాలు తీసుకోవటం కాలక్రమేణా ప్రముఖుల ఆటోగ్రాఫులు సేకరించటంగా రూపుదిద్దుకుంది.

విద్యాసంస్థలు, సాంస్కృతిక విభాగాలు, గ్రంథాలయాలు సుప్రసిద్ధుల ఆటోగ్రాఫులు సేకరించి భద్రపరచటం మామూలయింది. కొన్ని సంస్థలు ఈ ఆటోగ్రాఫ్‌లను సంకలనంగా రూపొందించి ముద్రించారు కూడా. అమెరికాలోని కాంగ్రెస్ లైబ్రరీ ఎందరో ప్రముఖుల ఆటోగ్రాఫుల్ని సేకరించింది. స్వాతంత్ర్య సందర్భంగా సంతకాలు చేసిన ఒప్పంద పత్రాల్ని కూడా ఈ లైబ్రరీలో భద్రపరిచారు. రోంలో, పారిస్‌లోని ఫ్రెంచ్ నేషనల్ లైబ్రరీల్లో కూడా ప్రముఖుల ఆటోగ్రాఫులు లభిస్తాయి.

చారిత్రాత్మక వ్యక్తుల ఆటోగ్రాఫుల వెల అత్యధికంగా వుంటుంది. **1949**లో అబ్రహంలింకన్ చేసిన ఓ సంతకం అరవైవేల డాలర్ల నగదును సంపాదించి రికార్డు సృష్టించింది. ఆటోగ్రాఫులే కాదు ప్రముఖుల రాతప్రతులూ, ఉత్తరాలూ కూడా రికార్డు

స్థాయిలోనే రాబడిని తెచ్చిపెట్టాయి.

బెంజిమన్ ఫ్రాంక్లిన్ స్వయంగా రాసిన ఓ ఉత్తరం **1955**లో **32** వేల రూపాయలకి అమ్ముడై రికార్డు నెలకొల్పింది. అదే ఉత్తరం వెల ప్రస్తుతం **34** లక్షల రూపాయలు.

**1956**లో నెపోలియన్ రాసిన ఓ ఉత్తరాన్ని వేలం పాడగా రెండు లక్షలకు అమ్ముడయ్యింది. అలాగే కింగ్‌జార్జ్, క్వీన్ విక్టోరియాల ఆటోగ్రాఫులు కూడా మంచి ధరనే పలికాయి.

**1946**లో ఎడ్గార్ ఆలెన్‌పో లూయిస్కా ర్లీస్‌ల ఆటోగ్రాఫులు ఓ వేలంలో **6** లక్షలకీ, **5** లక్షలకీ అమ్ముడయ్యాయి. ఈ రచయితలే ఎంత కష్టపడినా తమ జీవితకాలంలో ఇంతమొత్తం సంపాదించలేకపోవటం గమనార్హం.

ఈ ఆటోగ్రాఫ్‌ల వ్యాపారంలో కొన్నిసార్లు మోసాలూ జరగడం పరిపాటి. అసలైన ఆటోగ్రాఫులని నమ్మించి నకిలీవి అమ్ముతున్న మహానుభావులూ ఉన్నారు.



# ఫ్లోటింగ్ హాస్పిటల్

నీళ్లలో తేలే ఆసుపత్రి అంటే తెల్లమొహాలు వేసినవారే ఫ్లోటింగ్ హాస్పిటల్ అంటే ఓహో అదా అనుకుంటారు. రెండవప్రపంచయుద్ధంలో గాయపడిన సైనికులకు ఇతోధికంగా సేవలందిస్తూ ప్రారంభమైన ఫ్లోటింగ్ హాస్పిటళ్లు ఇప్పటికే అవసరమైనచోట తమ ఉనికిని నిలబెట్టుకుంటూనే వున్నాయి.

రెండవ ప్రపంచయుద్ధంసమయంలో క్షతగాత్రులకు సాయపడిన ఫ్లోటింగ్ హాస్పిటల్ నౌకపేరు హోప్. ఈ నౌకలోనే ఆసుపత్రిని ఏర్పరచి వైద్యసాయం అందించారు.

వియత్నాం యుద్ధంలో గాయపడిన అమెరికన్ సైనికులకు వైద్యసాయం అందించేందుకు పశ్చిమజర్మనీలోని హాంబర్గ్‌లో మోన్‌స్లాయ్ అనే ప్రఖ్యాత నౌకానిర్మాణ సంస్థవారు పదివేల టన్నుల బరువున్న హార్గోలాండ్ నౌకను తయారుచేశారు. ఈ నౌక నిర్మాణానికి ఒకకోటి, అరవైలక్షల రూపాయలు ఖర్చయ్యాయి. ఈ నౌక ప్రస్తుతం యాత్రికులకు ఉపయోగపడుతోంది.

ఇరాన్‌రాజు షా మరో నాలుగేళ్ళకు పదవీభ్రష్టుడవుతాడనగా 16 కోట్ల రూపాయలు వెచ్చించి ఒక ఫ్లోటింగ్ హాస్పిటల్ తయారుచేయించాడు.

పర్షియన్ ద్వీపాలపరిసర ప్రాంతాల్లో 50కి పైగా ద్వీపాలను 1971లో యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ నుండి ఇరాన్ ప్రభుత్వం కొనుగోలు చేసింది. ఈ ద్వీపనివాసులు చాలా వెనుకబడి వున్నారు. వారికి సరైన వైద్య సదుపాయం కూడా లేదు. రోగులూ, వ్యాధిగ్రస్తులూ అధికంగా వుండటంతో వారికి ఈ ఫ్లోటింగ్ హాస్పిటల్ అత్యవసరమైంది. అందుకే షా కొత్తనౌకను నిర్మించి అందులో ఆసుపత్రిని పెట్టించాడు.

'గులేనుర్ఖ్' అని పిలిచే ఈ ఫ్లోటింగ్ హాస్పిటల్లో అధునాతన వైద్యపరికరాలూ, మందులూ, ఆపరేషన్ థియేటర్లూ అమర్చారు. 65 పడకలను రెండు వార్డులుగా విభజించారు




మరో 5 పడకలు పిల్లలకోసం ప్రత్యేకించారు. ఎక్స్‌రే, ఇ.సి.జి. మొదలైన విభాగాలలో ప్రతి భావంతులైన డాక్టర్లు పనిచేస్తున్నారు. మనదేశంనుండేగాక పాకిస్తాన్, జర్మనీ, స్వీడన్, ఫిలిప్పైన్స్‌ల నుండి వలసవెళ్లిన నిపుణులెందరో ఇందులో ఉన్నారు. ఈ డాక్టర్లకు ఒక్కొక్కరికి నెలకు ఇరవైవేల రూపాయలు జీతంగా అందుతాయి. చెవి, కన్ను ముక్కు, గొంతు, దంతవ్యాధుల స్పెషలిస్టులు కూడా చాలా మందే ఉన్నారు. ఇరాన్‌కు చెందిన 30 మంది నర్సులు ఈ హాస్పిటల్లో తమ సేవలందిస్తున్నారు. 16 గురు జర్మన్ నావికులు, ఇంజినీర్లు పని చేస్తున్నారు.

అక్కడి ప్రభుత్వం ఈ హాస్పిటల్‌కోసం ఏటా 5 కోట్ల రూపాయలు కేటాయిస్తుంది. డాక్టర్లు ఖచ్చితంగా పనిచేయవలసిన వేళలంటూ ఏమీ లేవు. వీరికి మనోల్లాసం కలిగించేందుకు టి.వి, వీడియో, మ్యూజిక్‌లు ఏర్పాటై వుంటాయి.షా పాలనలో ఈ డాక్టర్లకు హాస్పిటల్లో ఒక బార్ కూడా వుండేది. ఖరీదైన మద్యం ఉచితంగా డాక్టర్లకు లభించేది. షా పాలన అంతరించి, ఖుమేనీ ప్రభుత్వం అవతరించాక ఈ బార్‌ను మూసేయించాడు.

ఇరాన్ పల్లీయులు మొదట్లో ఈ హాస్పిటల్లో వైద్య చికిత్స చేయించుకునేవారు కాదు. అర్థంలేని భయాలు వారిలో వుండేవి. క్రమేణా అవి అంతర్థానమై హాస్పిటల్లో రద్దీ ఎక్కువైంది. ఆస్పత్రిలో మందులు ఉచితంగా దొరుకుతున్నాయని లేని రోగాలు చెప్పుకుని మందులు సంపాదించి బయటకొచ్చి మార్కెట్టులో అమ్ముకునే ప్రబుద్ధులు కూడా ఉన్నారట.

హాస్పిటల్ సిబ్బందికి ఆకర్షణీయమైన ప్రతిఫలం లభించినా వారి ఉద్యోగం ఎంతో బాధ్యతాయుతంగా నిర్వహించవలసినది. సముద్రపు పరిస్థితులు మారుతుంటాయి. ఏరోజు అది ఎలా వుంటుందో అంతుపట్టదు. అలాంటి వాతావరణంలో జయప్రదంగా శస్త్ర చికిత్సలు నిర్వహించటం ఆషామాషీకాదు. ఈ హాస్పిటల్ పేరును ఖుమేనీ "పులేసుర్ఖ్"గా మార్పించాడు. ★

---




'చతుర' జూన్ నెల సంచికలో ప్రచురితమైన రాపేటి రామకృష్ణారావుగారి 'రేపటి మనుమలు' నవలపై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## యుగపురుషులు

(ప్రథమ బహుమతి రూ100/-పొందిన సమీక్ష)

ఒక నవలవల్ల ఎంతో కొంత సాంఘిక ప్రయోజనం ఉండి తీరాలనుకుంటే "రేపటి మనుమలు" నవలా రచయిత కొంతవరకు సఫలీకృతులైనట్లే. ఈ నవలలో కులాంతర వివాహాలను ప్రోత్సహించడం, వరకట్న దురాచారాన్ని ఖండించడం వరకు రచయిత అభినందనీయులు. అయితే ఏకులమో తెలియని పురుషుని వీర్యంవల్ల గర్భం ధరించిన నిర్మలాదేవి, ఆగర్భంవల్ల పుట్టిన జగదీష్ కులాంతర వివాహం చేసుకుంటాననంటే వ్యతిరేకించడం కొంచెం అస్వాభావికంగా ఉంది. పిల్లలులేని దంపతులకు కేవలం "ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్" ఒక్కటే ఉత్తమ మార్గం అన్నట్లు డాక్టర్ మదన్‌ద్వారా సూచించారు రచయిత. అసలే కోట్లాది జనాభాతో కిక్కిరిసిపోతున్న మన భరత ఖండంలో ఈ కృత్రిమ గర్భధారణలు ఎంతవరకు సమంజసం? ఒక అనాథను పెంచుకుంటే పిల్లలులేని కొరత తీరడమేకాక మానవతావాదం దృష్ట్యా ఒక అనాథకు జీవితాన్నిచ్చినట్లుంటుంది కదా! అనాథలకు పెంచుకున్నవారిమీద ప్రేమ ఉండదా? "ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్" ద్వారా పుట్టిన పిల్లలు తల్లిదండ్రులను ఖచ్చితంగా ప్రేమించితీరతారని గ్యారంటీ ఏమిటి? అలాగే జగదీష్, అతనితల్లిదండ్రులూకూడా వరకట్నాన్ని వ్యతిరేకించడం, స్త్రీ ధనాన్ని ఆశించకపోవడం వరకూ చాలా ఆదర్శప్రాయంగా ఉంది. అయితే కృష్ణమూర్తి దంపతులకు పిల్లలులేకపోవడంవల్ల ఆస్తికోసం సమతను చేసుకున్నారని లోకులు ఎక్కడభావిస్తారోనని, కృష్ణమూర్తి దంపతుల్ని బొంబాయి లాక్కుపోయి ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ ద్వారా వాళ్ళను సంతానవంతులను చేయడం కాస్తవిడ్డూరంగా ఉంది. నిజజీవితంలో ఇంతింత గొప్పవాళ్లు నిజంగా ఉంటే వాళ్లని "రేపటిమనుమలేం" కర్మ, ఏకంగా "యుగపురుషుల"నే వేనోళ్లకొనియాడవచ్చు. ఈ సంఘం అంతా ఒక్కసారిగా మారిపోయి అందరూ సహృదయులైపోతే ఎలా ఉంటుందో ఊహించి, ఆ ఊహకు నవలా రూపం కల్పిస్తే అది "రేపటి మనుమలు" అవుతుంది.

—సి.జె.రావ్, కాకినాడ.

## మొన్నటి తెలుగు నవల

(ద్వితీయబహుమతి రూ 75/- పొందిన సమీక్ష)

రేపటి మనుమలు ఎవరు? చలపతిరావు,

# రేపటి మనుషులు పై సమీక్షలు

కృష్ణమూర్తి, అన్నపూర్ణలా? లేక సమత, జగదీష్‌లా? ఎవరు నిజంగా రేపటి మనుషులు?

నేటితరం ప్రతినిధులైన సమతా, జగదీష్‌లు మొన్నటితరం నవలా నాయకానాయికలుగానే నిలిచిపోయారు. నిన్నటితరంవారికే రేపటితరం ఆలోచనా ధోరణి వుంటే నేటి తరంవారికి రేపటి ఆలోచనావిధానం కొరవడటం శోచనీయమైన విషయం. సంవత్సరంపాటు పార్కులో సాగిన నత్తనడకలాంటివారి ప్రేమాయణం రేపటితరాన్ని ఆలోచింపచేస్తుందా? నేటితరాన్ని నెమరు వేయిస్తుందా? మొన్నటితరాన్ని గుర్తుచేస్తోందా? సంవత్సరంపాటు ఎదురుచూసి జగదీష్ నుండి "ఐ లవ్‌యు" అన్న మాట విన్న మరుక్షణం తన ప్రేమకు ఫుల్‌స్టాప్ పెట్టేస్తానన్న కఠోరదీక్ష సమతదైతే, "టెలీపతి" తెలిసినట్లు కరెక్టుగా 366వ రోజు జగదీష్ నుండి ఈ ముచ్చటైన మూడు పదాల ప్రేమ మంత్రం వెలువడ్డం కాకతాళీయమా?

రేపటితరానికి వారధిగా నిలబడాల్సిన జగదీష్ తన జన్మరహస్యం పూర్తిగా తెలుసుకోకుండానే ప్రాణాతిప్రాణంగా అభిమానించే తల్లిదండ్రుల్ని వదలిపారిపోవడంతో అతని ధైర్యస్థైర్యాలు తేటతెల్లమవుతున్నాయ్. మరి ఇతను రేపటి మనిషి ఎలా అవుతాడు? వర్ణాంతర వివాహానికి తల్లిని ఒప్పించే విషయంలో మార్గాంతరం తెలియని జగదీష్ రేపటి మనిషి కాలేడన్నది పచ్చి నిజం.

"ఆడపిల్ల ఆస్తి భాగస్వామ్యవిషయం" అనవసర హంగామా తప్ప మరేమీకాదు. మన ఆదర్శం మాటల్లో కాదు చేతల్లో వుండాలి. అది బహిరంగం కానక్కర్లేదు.

ఈ నవల మొత్తానికి ఒక చలపతిరావే నిఖార్సయిన రేపటి మనిషి. ఆయన ఆలోచనా ధోరణి నేటి, రేపటి తరాలకు కూడా ఆదర్శప్రాయమే.

"జెనెటిక్స్"ను గురించి రేఖామాత్రంగా సూచించిన రచయిత అభినందనీయుడే. "సామాజిక స్పృహ" అనే లక్షణం ఈ నవల్లో వుందనడంలో సందేహం అక్కర్లేదు. మొత్తానికి ఈ నవల "మొన్నటి తెలుగు నవల" అనవచ్చు.

ఈ రచయిత నేటి మరికొన్ని సామాజిక సమస్యల్ని కూడా సరిక్రొత్త పంథాలో తన రచనల్లో చూపించి పరిష్కారమార్గాల్ని పాఠకప్రపంచానికి సూచించే ప్రయత్నంలో సఫలీకృతుడు కావాలని కాంక్షిస్తున్నా.

—విద్వాన్ యం. రాముడు, కలుగొట్ల.

## అందరికీ తెలిసిందే

*[తృతీయ బహుమతి రూ.50/-పొందిన సమీక్ష]*

రచయిత దృష్టిలో వీళ్ళు "రేపటి మనుషులే"మో గాని నాదృష్టిలో కాదు. వీళ్ళు అంటే చలపతిరావు, నిర్మల, జగదీష్, సమత దాదాపు అన్ని పాత్రలు ఇప్పుడు నడుస్తున్న సమాజంలోనివే. శాస్త్రవిజ్ఞానం అభివృద్ధిచెంది పల్లెటూరి వ్యవసాయదారులకు కూడా అందుబాటులోకొచ్చింది. ఇప్పటిరోజుల్లో ప్రతి మనిషి శాస్త్రీయంగా ఆలోచించి విచక్షణతోకూడిన నిర్ణయాలు తీసుకొంటున్నాడు. చాలా

మందిని కాకపోయినా కొద్దిమందినయినా ఇలాంటివారిని చూస్తుంటాం. చలపతిరావుగా రిలాగా పిల్లల్ని క్రమశిక్షణలోపెంచి శాస్త్రీయంగా ఆలోచించటం నేర్పి తమ భావాలకు అనుగుణంగా పెంచటం ఈ రోజుల్లో సర్వసాధారణం. నవలలో విజ్ఞాన విశేషాలు ఏమున్నాయి? మొదటి టెస్ట్‌ట్యూబ్ బేబి గురించి, 'ఇన్-వైట్రో ఫెర్టిలైజేషన్ ఎంబ్రియా ట్రాన్స్‌ఫర్' గురించి, బొంబాయిలోని కె.ఇ.ఎమ్. హాస్పిటల్ గురించి రాయగానే ఇది విజ్ఞానానికి సంబంధించిందవుతుందా? ఈ విషయాలు కామన్‌గా అందరికీ తెలిసినవే. రచయిత ఇంకా లోతుగా ఆలోచించి పూర్తి వివరాలు అందిస్తే బాగుండేది.

ఇతివృత్తం మాత్రం మంచిది. కాని అది చెప్పేవిధానమే దెబ్బతిన్నది. రచయిత 'చతుర' కొరకు ప్రత్యేక శ్రద్ధ కనబరిచినట్టు కనిపించదు. 'చతుర' మంచి నవలలకు పెట్టింది పేరని గత కొన్ని సంవత్సరాలుగా చదువుతున్న నాలాంటి వారెందరికో తెలుసు. ఇకపోతే నవలలోని సంభాషణలు చాలా ఎబ్బెట్టుగా ఉన్నాయి. కథ చెప్పేవిధానం కూడా బాగాలేదు. కథని ఎక్కడికక్కడ వదిలేసి, విశాఖపట్నం బజారు గురించి, సింహాచలం రోడ్ల గురించి రాయటం బాగాలేదు. జగదీష్‌ని ఒక్కొక్కచోట ముద్దపప్పులాగా, ఒక్కోచోట (గుడిదగ్గర) విజ్ఞాన ఖనిలాగా చిత్రించారు. 'చతుర' నుంచి మంచి నవలలు కోరుకునే నాలాంటివారికి ఇది సంతృప్తినివ్వలేదు.

—గంటా నాగేశ్వరరావు, కూకట్‌పల్లి.

## మనసున్న మనుషులు

**(రూ: 25/- బహుమతి పొందిన సమీక్ష)**

**'రేవటి మనుషులు'** నవలలో ప్రస్తుత సమాజంలో వున్న ఎన్నో సమస్యలను సమీక్షిస్తూ మంచి రచనచేశారు రాపేటి. తల్లికా లేని స్త్రీ గొడ్రాలిగా జీవితమంతా అసంతృప్తిగా గడపకుండా సైన్సు ఎంత వృద్ధిచెందిందో వివరించారు.

ఎంతోమంది పిల్లలు లేకుండా వుంటారు కాని వెయ్యికి ఒక్కరు కూడా ఈ ఆర్టిఫిషియల్ ఫెర్టిలైజేషను ద్వారా సంతానంపొందటానికి ఎందుకు ప్రయత్నించరో తెలియదు. ఈ నవల చదివి కనీసం ఏ కొద్దిమందైనా సంతానాన్ని పొందితే రచన సార్థకతను పొందినట్లే.

ప్రతి పాత్రలోనూ పెల్లుబికే ప్రేమ, ఆత్మీయత, స్నేహం, ఆర్ద్రతలను చూస్తూ వుంటే నవల చదువుతున్నట్టుగా లేదు. ఒక సినిమాలో చూస్తున్నట్టుగా వుంది. ఈ నవలలోని పాత్రలన్నీ మనసున్న మనుషులుగా రచయిత చిత్రీకరించారు. నిర్మల తల్లికా లేనన్న బాధ, తర్వాత ఆర్టిఫిషియల్ ఫెర్టిలైజేషన్ ద్వారా సంతానాన్ని పొంది కొడుకు దగ్గర తప్పుచేసినట్లుగా బాధపడటం- ఇవన్నీ మనసుకు సంబంధించిన సున్నితమైన విషయాలే. పిచ్చి నవలలు, సెక్సు, సస్పెన్సు, దెయ్యాలు భూతాలులాంటివి చదివి ఈ నవల చదివితే హాయిగా అనిపించింది. ఇలాంటివే సమాజానికి ఉపయోగపడేవి. ఇలాంటి రచనలను సమాజానికి అందిస్తే మానవత్వం అడుగంటుతున్న ఈ సమాజం కాస్త మారుతుందేమోనని అనిపించింది. ప్రచురించే ప్రతి నవలలో ఏదో ఒక సందేశం లేకుండా 'చతుర' ప్రచురించదు. సమాజానికి ఉపయోగపడే నవలను మాత్రమే ప్రచురించే 'చతుర'కు నా హృదయపూర్వకాభినందనలు.

—సీత. విజయవాడ.

## మంచినవల

*[రూ.25/- బహుమతిపొందిన సమీక్ష]*

**'రేపటి మనుషులు'** రచనతో రచయిత రాపేటిగారు రేపటి రచయితగా నిలబడ్డారు. "విజ్ఞాన విషయాలను కుటుంబగాథగా మలిచిన రచన" అన్న 'చతుర' పరిచయ వాక్యాల్ని పూర్తిగా నిజంచేసింది నవల.

వస్తువులోను, ఎత్తుగడలోను కన్పించిన వైవిధ్యం ప్రారంభంలోనే పఠితను ఆకట్టి, వేగంగా చదివించింది. పేరుకి తగినట్టుగానే




ఇందులోని పాత్రలు, సంఘటనలు 'రేపు' పట్ల ఆశనుపుట్టిస్తాయి. నవల ప్రారంభంలో నాయిక నాయకుల పరిచయ విషయంలోనే ఆకొత్త దనం ప్రస్ఫుటమైంది. తల్లి-తండ్రి-పిల్లల బాంధవ్యానికి, ఆడ-మగ సంబంధానికి నూతన భాష్యం చెప్పిందీ కథ. ఇందులో అసలు హీరో చలపతిరావుగారు. ఎంతో నిండైన, ఉదాత్తమైన వ్యక్తిత్వ చిత్రణ కనబరిచారు ఈ పాత్రలో రచయిత.

అనాదిగా పాతుకుపోయిన పాత భావాలను, ఆచారాలను ఎంతో సహజంగా ధిక్కరించిన ఆధునిక యువకుడు జగదీశ్. 'ఆడపిల్ల ఆస్తి' అంటూ వేరుగా మాట్లాడటం, ఎవరో అన్నమాటలకి అంత విలువనివ్వటం బాగులేదు. అవసరమైతే ఆర్థికంగా భార్య ఆస్తిని ఉపయోగించుకోవటం నేరమా? జగదీశ్‌కి లోకాపవాదం పోవాలంటే కృష్ణమూర్తి దంపతులకు సంతానంకలగడంతప్ప మరేవిధమైన మలుపు రచయిత చూపలేకపోయారా? ఎంతో ఉపయోగకరమైన వైద్యసమాచారం అందించడంలో సఫలీకృతులయ్యారు రచయిత. కాని ఆ ఆలోచనకి దారితీసిన పరిస్థితులను కూడా కాస్త బలీయంగా సృష్టించి ఉంటే రచనా ప్రయోజనం పూర్తిగా నెరవేరేది. 'తొలి చూపులోనే ప్రేమ' లాంటి పడికట్టు పద్ధతికి స్వస్తిచెప్పడం ఈ కథలో ఒక మంచి అంశం. ఒక మంచి నవలని చదివిన అనుభూతి కల్గుతుంది. సమాజంలోని ఆడ-మగ తేడాలపట్ల కుటుంబపరంగా, సాంఘికంగా కూడా రచయితకి మంచి అవగాహనున్నట్లు తెలుస్తోంది. వైజ్ఞానిక భ్రమలు జీవితానికి దూరమన్న భావన కలగనివ్వకుండా శాస్త్రవిషయాల్ని బోధించిన తీరు బాగుంది. ఈ శతాబ్దానికి అవసరమైనవి ఇలాంటి రచనలే.

—శ్రీమతి పదాల లక్ష్మి, భాకరాపేట.

## సమాజానికి సందేశం

*(రూ 25/-బహుమతి పొందిన సమీక్ష)*

చిన్న నవల ద్వారా "పెద్ద సందేశమే అందించారు రచయిత. రచయిత సూక్ష్మగ్రాహి. ప్రతీ చిన్న విషయాన్ని చక్కగా అబ్జర్వ్ చెయ్యటం, సూచనలివ్వటం, చాలా సామాన్యమైన విషయాన్ని చక్కగా వివరంగా వర్ణించి చెప్పటం (ఉదా: విశాఖలో కాళికాలయం వివరాలు) బాగుంది. వైద్య విజ్ఞానం ఎంత అభివృద్ధిచెందినా చాలా జబ్బుల గురించి చాలా మందికి తెలియదు. ఉదాహరణకు "వెంట్రిక్యులర్ డీజనరేషన్". ఈ భయంకర జబ్బు ఎందరో తల్లిదండ్రుల మనోవ్యాధికి కారణమయింది. పిల్లలు పుట్టి పోవటం, వాళ్ల గురించి ఏడవటం తప్ప సామాన్యులకి అది "విల్సన్స్ డిసీజ్" అనీ, దానివల్ల పిల్లలు చనిపోతున్నారని తెలియదు. ఈ వ్యాధితో ఇద్దరు పిల్లల్ని పోగొట్టుకొన్న ఓ అభాగ్యపు తల్లికి ఈ నవల చదివి వినిపించాను. తన సమస్యను ఓ మంచి డాక్టర్‌తో సంప్రదించాలనే విషయం కూడా తెలియని ఆమె ఈ సంగతి విని తెల్లబోయింది.

ఇకపోతే తెలుగు జాతిమీద రచయిత విమర్శ కాస్త కఠినంగా వుంది. మంచి సినిమా తీయటానికి మన నిర్మాతలు వెనుకబడుతున్నారనటం న్యాయంకాదు. టెక్నాలజీ ఎక్కువ డెవలప్ అవ్వకముందే, సంఘం ఈ స్థాయికి రాకముందే విప్లవాత్మక సినిమాలు మన తెలుగులో నిర్మించబడ్డాయి. ఈ నవలలో టిఫిన్లు తినడాలు, భోజనాలు చెయ్యడాలు కాస్త ఎక్కువగానే ఉన్నాయి. ఈ రేపటి మనుమలు నిన్నటి కథలకి మార్గదర్శికాలని రచయితే ఒప్పుకున్నారు- భారతాన్ని ఉదాహరణగా ఇస్తూ ఏదియేమైనా ఆదర్శాలు కలిగి వుండాలనీ, అవి ప్రస్తుత సమాజానికి అవసరమని నిరూపించారు నవలలో. ఈనాటి (చాలా) కథల్లోనూ, నవలల్లోనూ, ఎక్కువగా కన్పించే హింస, సెక్సు గుప్పించి రాసి, కాలక్షేపానికి చదివి పారేసే క్రైం, సెక్స్ నవలల్లా కాకుండా నేటి సినిమాల్లో "శంకరాభరణం"లా నేటి నవలలో "రేపటి మనుమలు" వచ్చింది. రచయిత రాపేటి రామకృష్ణారావుగారు, ప్రచురించిన 'చతుర' అభినందనీయులు.

—పెద్దాడ సీతాలత, తణుకు.

కవరు పేజీ ఫొటోగ్రాఫరు : అరుణ్ బేసేకర్

# చతుర

సంపుటి: 11 సంచిక : 7 ఆగస్టు 1988


"పాపా ... ఇది చివరిపాఠం. భవిష్యత్తును భయంకరంగా ఊహించుకోకు. పరిస్థితి
మన ఊహల్లో ఉండేంత ఘోరంగా వాస్తవానికి వుండదు. జీవితంలో రాజీపడవద్దని
చెప్పడంలేదుగానీ స్వాతంత్ర్యానికి, ఆత్మగౌరవానికి భంగంకలిగించే రాజీపడకు. తనను
తాను గౌరవించుకోలేని మానవుడు ఇతరులను గౌరవించలేడు. ఆ పతనం వద్దు. ఏ
బంధనాలైనా మనం కల్పించుకునేవే. ఇవేమీ సహజంకావు. అందువల్ల స్వేచ్ఛగా,
సహజంగా మనసుకు ఆనందంకలిగే విధంగా బతకాలి. మనిషి మనిషిగా బతకాలి.
పరిస్థితులను ఎదిరించైనా బతకాలి. ఆ ప్రయత్నం చేయి. నీ బతుకు నీవు బతకబోతు
న్నావు" అంటూ వెన్నుతట్టి సరికొత్త స్ఫూర్తినిచ్చాడు ఆమె బావ కేశవమూర్తి.

సహనానికి కూడా ఓ హద్దుంటుంది. ఓపిక నశించిపోతే మనిషి ఎంతకైనా తెగిస్తాడు.
శారీరకంగా, మానసికంగా భర్తవల్ల హింసలనుభవించిన ఆ యువతి ఈ సందేశాన్ని ఎలా
అన్వయించుకుని, ఆచరించి తన చీకటి జీవితాన్ని కాంతివంతంగా మలచుకొంది?

కాకాని చక్రపాణి, వి. నాగరత్నకుమారిల లేఖిని నుండి
వెలువడి మనసుల్ని స్పందింపచేసే 'వేగుచుక్క' ఈనెల
'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

# వేగుచుక్క

కాకాని చక్రపాణి,
వి.నాగరత్నకుమారి



"ఏమండీ... రాధగారూ!!" అంటూ లోనికి తొంగిచూస్తూ పిలిచింది సుమారు ముప్పైఅ యిదేళ్ళున్న ఒకామె.

"అక్క లేదండీ... కూరగాయలకెళ్ళింది" లంగా జాకెట్ వేసుకున్న పదమూడేళ్ళ పాప చెప్పింది.

ఆమె ఆ పాపని ఓసారి నిర్లక్ష్యంగాచూసి, మెదలకుండా తల తిప్పేసుకుని రెండడుగు లు వెనక్కివేసి వాకిట్లో కుడివైపునున్న దానిమ్మ చెట్టు కాయల్ని చూస్తూ నిలబడింది.

రెండునిమిషాల్లో కూరగాయల బుట్టతో రాధ వచ్చింది. "అరె... మీరా? ఎంతసే పైందండీ పార్వతిగారూ?!" అంది.

"ఆఁ... ఇప్పుడేనండీ" అంది కాస్త కంగా రుగా దృష్టిని మార్చేస్తూ.

రాధకి తన చెట్లని ఎవరూ పరికించి చూ డటం ఇష్టముండదు. ఎవరైనా పొరపాటున చూసినట్లయితే, వాళ్ళు గోడదాటి వెళ్ళగానే దిష్టితీసి అవతలపడేస్తుంది.

"అప్పట్నుంచీ ఆ రెండు కాయలే... ఏంటో నండీ- వచ్చేపోయేవాళ్ళ కళ్ళన్నీ దానిమీదే, ఇంకది కాయలేం కాస్తుంది? నరికించేస్తే పోతుందనుకుంటున్నా" అన్నది రాధ చేతిలో వున్నబుట్ట కిందపెట్టేసి- ఎత్తివున్న మంచాన్ని వాలుస్తూ.

పార్వతికి కాస్త చిన్నతనంగా అన్పించింది. కానీ రాధతరహా అంతేనని తెలిసి అంతలోనే సరిపెట్టేసుకుని "అదే చూస్తున్నా- బొత్తిగా కాయలు లేవేమని" అంది.

"అబ్బబ్బా... ఏం ధరలండీ బాబూ?! పనికి మాలిన పుచ్చొంకాయల్ని కూడా కొనుక్కునే పరిస్థితి కాకుండా ఉంది. కూరగాయలు తీస్తూ అంది రాధ.

"నిజమేనండీ... బ్రహ్మంగారు చెప్పినట్లు సంచుల్తో డబ్బులూ, చేతుల్తో సరుకులూ తెచ్చుకునేరోజులు త్వరలోనే వున్నాయి! ఔనూ... మార్కెట్‌కి కూడా మీరే వెళ్ళాలా? పిల్లని పంపకూడదూ?"

"ఆఁ... నాకంత అదృష్టం ఏడ్చిందా? ఇన్ని పనులతో అష్టావధానాలు చేస్తున్నా ఇంకా చూసే మీబోటివాళ్ళకి దాన్ని నేనేదో రాచి రంపాన పెడుతున్నట్లుంటుంది..."

"ఎంతమాటెంతమాట? అంతా మీ అను మానమేతప్ప ఎవర నుకుంటారట్లా?"

"మీరో పిచ్చివాళ్ళు- అంతా మీకుమల్లే అయితే బాగుణ్ణు... అప్పుడే పన్నెండా? పొద్దు న్నే ఇట్లా వచ్చారు? కూర్చోండి... నిలబెట్టి మాట్లాడ్తున్నా"

"కూర్చునేపాటి తీరికా? ఎక్కడి పనక్కడే వుంది. మీదగ్గర కాస్త అల్లముందేమోనని కాలీ ఫ్లవర్ కడిగిపెట్టి ఇటొచ్చా..." అంది పార్వతి.

"అయ్యో... అల్లమా లేదండీ! నేపెద్దగా వాడనుకదా అందుకే..."

ఇంతలో తడిగుడ్డతో ఇల్లు తుడుస్తున్న పాప మధ్యలో అందుకుని "ఆ కుంపట్లో ఇసకలో వుందక్కా అల్లం" అన్నది.

"తెల్సీ తెలీకుండా వాగకు. అల్లమెక్క డుంది? ఆవిడేమనుకుంటారు? ఉంటే ఇవ్వనా? అదేం భాగ్యమా, బంగారమా?"

"నిజంగా అక్కా... నువ్వు చూళ్ళేదేమో. మొక్కలు కూడా వచ్చాయి- చూపించనా?" అన్నది పాప దృఢంగా.

రాధకి ఒళ్ళు మండిపోయింది. కోపాన్నంతా పళ్ళబిగువున అదిమిపట్టి "ఏమనుకోకండి... నాకైతే తెలీదు-ఆయనేమన్నా పెట్టారేమో చూ సొస్తా" అంటూ లోపలికెళ్ళి అల్లం ముక్కతో తిరిగి వచ్చింది- "నిజంగానే వుందండీ" అంది ఇస్తూ.

"ఉంటానండీ... ఇప్పుడు కొట్టుకెళ్ళే వాళ్ళు ఎవరూలేరు- అందుకే మీ ఇంటికొచ్చా" అంటూ ఆవిడ వెళ్ళిపోయింది.

"ఏయ్... ఇట్రా!! ఒళ్ళు కొవ్వెక్కి కొట్టు కుంటున్నావు కదూ" అంటూ దగ్గరికి పిలిచి మొట్టింది రాధ.

"ఏం చేశానిప్పుడు?" పాప ఏడ్పుముఖం పెట్టింది.

"నీకెన్నిసార్లు చెప్పాను- అక్కడుంది ఇక్క డుంది అని వాగద్దని?"

"నీకు తెలీదేమోనని చెప్పా"

"అబ్బే... నాకేం తెలీదు. అరిందా గోవింద మ్మవి కదూ- అంతా నీకే తెలుసు. ఇంకోసారి





నోరు తెరిచావంటే అట్లకాడ కాల్చి వాతలుపె
డ్తా- జాగ్రత్త'' అంటూ చెంపమీద ఒక దెబ్బేసి
''ఫో అవతలికి... దరిద్రపు మొహమా'' అంది
విదిలింపుగా ముందుకునెట్టి.

పక్కగదిలో గడ్డం చేసుకుంటున్న కేశవమూ
ర్తి ''ఏమైంది... ఎందుక్కొడుతున్నావు?''
అన్నాడు అక్కడికొచ్చి.

''ఏమౌతుంది? నా పరువుతీయడానికి శని
లాగా దాపురించింది'' అంది కసిగా పళ్ళు
కొరుకుతూ, ముఖంమీదికి వచ్చి పడుతున్న
జుట్టుని ఎగదోసుకుంటూ.

ఆ పాప ఇల్లు తుడవడం ముగించి అంట్లు
తోమేందుకు వెళ్ళింది. కళ్ళనీళ్ళు కార్చు
కుంటూ బిక్కముఖంపెట్టుకుని మెల్లగా తోము
తోంది.

కొంతసేపయ్యాక ''అంతోటి అంట్లు ఎంత
సేపు తోమితగలడ్తావు? ముందా చట్టి ఇటివ్వు''
అంటూ మరోసారి కయ్యిమని అరిచి రాధ
వంటింట్లోకి వెళ్ళిపోయింది.

ఆ చిన్నారి పాపకి రాధ ఆ క్షణంలో అక్కగా
కాక రాక్షసిలాగా కన్పించింది. ఆమె మిగిలిన
వాటిని పక్కకినెట్టి రాధ అడిగిన చట్టిని గబ
గబా తోమి అది ఇచ్చేందుకు కంగారుగా
లేచింది. ఆ తొందరపాటులో కాలుజారి కింద
పడింది. ఆ పడటంలో పక్కన కడిగిపెట్టిన
కప్పుకి తగిలి అది కాస్తా పగిలిపోయింది.

ఆ చప్పుడుకి బయటికొచ్చిన రాధ- ''అ
య్యిందా... అప్పుడే కప్పుని పొట్టనపెట్టుకు
న్నావా? నా ఇల్లు గుల్లచేయమని నిన్నుకని
నాకంటగట్టిపోయారు. ఈ తద్దినాన్ని ఎట్లా
వదుల్చుకోవాలో అర్థంకావడంలేదు. ఇంకా
ఏంటలా దేభ్యం మొహం వేసుకుని నిలబ
డ్తావు? ఆ పెంకులెత్తి పారబోసి చావు'' అంది.

ఆ పాప గుడ్లప్పగించి చూస్తూ ఏడుస్తోంది.

''పగలగొట్టిందిచాలక మళ్ళీ ఇదో నాట
కమా? నిన్ను... నిన్ను... ఏంచేసినా పాపం లేదే-
శనిమొహమా! ఎందుకలా నెత్తిన నీళ్ళకుండ
పెట్టుకుని ఎప్పుడూ ఏడుస్తావు? నువ్వున్నంత
కాలం మాకు దరిద్రం వదల్దు'' అంటూ వెళ్ళి
రెండు దెబ్బలేసింది.

పాప పనిచేస్తున్నంతసేపూ ఏడుస్తూనే
వుంది. పనయ్యాక స్నానంచేసి తయారై పుస్తకా
లు సర్దుకుంది. ఆమెకాపూట అన్నం మింగు
డుపళ్ళేదు. కానీ తినకపోతే మళ్ళీ కొడు
తుందనే భయంతో బలవంతంగా తిని అలాగే
వెక్కి వెక్కి ఏడ్చుకుంటూ అడుగులో అడుగు
వేసుకుంటూ స్కూలుకి బయల్దేరింది.

''ఏడవకమ్మా పాపా! తప్పు... రోడ్డుమీద
ఇట్లా ఏడవచ్చా? ఊరుకో- అంతా నవ్వుతారు''
వేగంగా అడుగులేసుకుంటూ ఆమెని సమీ
పించాడు కేశవమూర్తి. అతని ఆప్యాయతకి
సీత ఏడుపు ఇంకా ఎక్కువైందేతప్ప తగ్గలేదు.

''చెప్తోంది నీకే! మంచిదానివిగా, ఏడ
వకు... రౌడీలు చూస్తే ఎత్తుకుపోతారు
తెలుసా? అమ్మో... ఇంకేమైనా వుందా?'' ఫుట్
పాత్‌మీద సీత ఎత్తుకి తను వంగి ఆమె
భుజంమీద ఒక చెయ్యేసి, మరో చేత్తో కన్నీరు
తుడుస్తూ బుజ్జగింపుగా అన్నాడు కేశవమూర్తి.

''నన్నెత్తుకుపోతే అక్కకి ఇష్టమేగా. పోనీ
వాళ్ళేనయం నన్నిలారోజూ తిట్టరూ, కొట్టరూ''
అంది సీత.

''సెవెంత్‌క్లాస్ చదువుతున్నావు. అయినా
నీకు రౌడీల గురించి తెలిసినట్లు లేదే? వాళ్ళు
పిల్లల్ని తీసుకెళ్ళి కళ్ళుపీకి, కాళ్ళు నరికి...''

''హుఁ... నాకవన్నీ చెప్పకు బావా- భయం''
అంటూ కేశవమూర్తి నోటిమీద చెయ్యి అడ్డంపె
ట్టింది సీత.

''మరైతే ఏడవకు'' అని రెండు చాక్లెట్లు
కొనిచ్చాడు.

సీత అవి తీసుకుంటూ ''బావా... అక్క
మంచిది కాదుగదూ!!'' అంది పుస్తకాల
సంచిని రెండోభుజంమీదికి మార్చుకుంటూ.

''తప్పు... అలా అనకూడదు- అక్క
మంచిది''

''ఏంకాదు... నువ్వే మంచివాడివి''

''పెద్దవాళ్ళని అలా అనచ్చా?''

''మరి చిన్నపిల్లల్నిలా కొట్టొచ్చా?''

''తప్పు చేస్తేనేగా కొట్టింది''

''ఈరోజేం తప్పుచేశాను? నిజం చెప్పడం
తప్పా? కాలుజారి కిందపడ్తే కప్పు పగిలింది,
నేనేం కావాలని పగలగొట్టానా? చెప్పు బావా...

# అతి పల్చని తొడుగు...
# సహజమైన సంతృప్తికి
# సూపర్ డీలక్స్ నిరోధ్




నిజానికి, ప్రపంచంలోనే అతిపల్చని, నాజూకైన తొడుగు. అయినా, అన్ని విధాలా సురక్షితమైనది.

సూపర్ డీలక్స్ నిరోధ్ అతి నాజూకైన లేటెక్స్‌తో ప్రపంచంలోని అత్యంత ఆధునికమైన కర్మాగారంలో తయారై, ఎలక్ట్రానిక్ పరికరాలతో పరీక్షించబడినది. నునుపైన, జారుడు గుణం కలది - సూపర్ డీలక్స్ నిరోధ్ మీ అభిరుచికి అనువుగా ఇప్పుడు సహజమైన చర్మం రంగులో లభిస్తున్నది.

ASP/HLL/8807 TEL

మీకే తేడా తెలుస్తుంది

## సూపర్ డీలక్స్ నిరోధ్

ప్రపంచంలోని తొడుగుల తయారీలో అతిపెద్ద సంస్థ అయిన హిందుస్థాన్ లేటెక్స్ లిమిటెడ్ వారి మేలైన ఉత్పత్తి.

ఇలాంటివన్నీ తప్పులని మా టీచరెప్పుడూ చెప్పలేదు''

అంత చిన్నపిల్ల అలా మాట్లాడుతుంటే కేశవమూర్తికి ఒక్కక్షణం నోరు పెగల్లేదు. ''మీ అక్క ఉద్దేశం కూడా కొంచెం జాగ్రత్తగా వుండమని. అంతేగా?'' అన్నాడు చివరికి.

స్కూలు దగ్గరికి వచ్చేశారిద్దరూ. మొదటి గంట మోగుతోంది.

''పద పద- టైమైంది. మొదటి బెల్లుకొట్టేశారు'' అంటూ ఆమెను తొందరచేసి తీసుకుపోయాడతను.

స్కూలు ఆవరణలో పిల్లలందరూ ప్రార్థనకు బారులుతీరుతున్నారు. సీత తన క్లాస్‌మేట్స్ వున్నవైపు దారితీసింది. కేశవమూర్తి స్టాఫ్ రూంవైపు వెళ్ళిపోయాడు. సీతకు స్కూల్లో వున్నంతసేపూ ఆటవిడుపు. మళ్ళీ స్కూలు వదులుతారంటే భయం. సెలవలు కావాలని అందరూ కోరుకుంటే ఆమె వద్దని దేవుళ్ళకు మొక్కుకునేది. దేవుళ్ళు కూడా అక్క నోటిగద్దరతనానికి భయపడ్తారులా వుంది- శనివారం ఒకపూట. ఆదివారాలు. మధ్య మధ్యలో పండుగలు. అవీ చాలనట్టు దసరా సెలవలు. సంక్రాంతి సెలవలూ. ఇంకా ఎండాకాలం సెలవులూ- అన్నీ సెలవలే ఇచ్చేవారు.

మీనాక్షీ. రామేశ్వరీ. మంగతాయారుల ఇళ్ళు కూడా సీత ఇంటిదగ్గరే. అయితే వాళ్ళెవరూ ఆమెతో కలవరు. వాళ్ళ తల్లులకి వున్నట్టే వాళ్ళకీ ఆమె అంటే చిన్నచూపు. అప్పుడప్పుడూ ఆమెమీద నేరాలు రాధకు అంటగడ్తారు. ఆవిడ చెల్లెల్ని దండిస్తూంటే చూసి సంతోషించేవాళ్ళు.

''రావే సీతా... ప్రార్థన మొదలౌతోంది'' అని పిల్చారు సీత స్నేహితురాళ్ళు రత్నమాల. వసంత.

ప్రార్థన సమావేశం అయిపోయింది. విద్యార్థులు. విద్యార్థినులూ అందరూ ఎవరి తరగతి గదుల్లోకి వారు వెళ్తున్నారు. సీతకు సామాన్యంగా స్కూలుకు వచ్చేటప్పటికి మనసు బావుండదు! మొదటి పీరియడు సగంవరకూ ఇంట్లో తిన్న తిట్లూ. తన్నులూ గుర్తుకొస్తుంటాయి. అక్క తనపట్ల అలా ఎందుకు ప్రవర్తిస్తోందో అర్థంకాదు. బావకూడా అక్కలాంటివాడే అయినట్లయితే తనకి ఆ ఇంట్లో జీవితం దుర్భరం.

క్లాసులో సీతస్థానం మూడోబెంచి. తను మొదటిబెంచిలో కూర్చోవాలన్నా వీలవదు. మంగతాయారు. మీనాక్షి. వాళ్ళ ఫ్రెండ్సూ మొదటి రెండు బెంచీలూ ఆక్రమించేస్తారు. మెత్తగావున్న సీతను మూడో బెంచీకి తరిమేస్తారు. సీతతో ఆమె స్నేహితురాళ్ళు అదే బెంచీలో కూర్చుంటారు. మొదటి పీరియడ్ ఇంగ్లీషు. మాస్టారు వట్టి కరోడా మనిషి. ''స్టి...స్టి...స్ట్రిక్ట్''. ''డ్సి...డ్సి...డ్సిసిప్లిన్'' ఆయన సత్తిలాగానే ధాటిగా సాగిపోయేది. చేతిలో పేముబెత్తం వీలైనప్పుడల్లా పిల్లల వీపులమీద అటుబాటికి ఊగిపోతుంటుంది. ఆయనపేరు నరసింహమూర్తి. ఈ పిల్లరాక్షసుల్నెలా దారికి తీసుకురావాలా అనే ఆయన తపన. మొదట్లో పిల్లలందర్నీ అలా. మొగా తేడాలేకుండా పేముబెత్తంతో శిష్యవాత్సల్యాన్ని నెరపేవాడుగానీ ఒకసారి ఓ అమ్మాయి ఆయన వాత్సల్యాన్ని భరించలేక స్పృహతప్పి పడిపోవడంతో నాలుగు దెబ్బలన్నా సరిగా తినలేని ఆడసన్నాసి పీనుగులను వదిలేసి మగపిల్లలపైనే తన ప్రేమవృష్టిని కురిపించసాగాడు. అలాని ఆడపిల్లల్ని గాలికి వదిలేయడం ఆయనకిష్టంలేదు. తప్పు చేసినప్పుడు బెంచీ ఎక్కించేవాడు.

పిల్లలు పుస్తకాలు తెరిచారు. పాఠం జోరుగా సాగిపోతోంది. సీత తన టెక్స్ట్‌బుక్‌కోసం సంచీ అంతా గాలించి వదిలేసింది. తను పుస్తకం తెచ్చినట్టే గుర్తు. మరైతే పుస్తకంలేదు. క్లాసులో కొచ్చి సీత పరధ్యానంగా వుండగా రామేశ్వరి ఆమె పుస్తకాన్ని సంచిలోంచి లాగేసింది. అదప్పుడే చేతులుమారి మొదటిబెంచీలోకి వెళ్ళిపోయింది. సీతకు గుండెదడ పట్టుకుంది. ఇక్కడ నరసింహమూర్తి మేస్టారు. అక్కడ అక్క! ముందిక్కడ జతికి బైటపడ్డప్పుడుకదా అక్కమాట.

మొహం వేలాడేసుకుని పక్కచూపులు చూస్తున్న సీతను పట్టేశాయి- చేతిలో పుస్తకంమీద కంటే పిల్లలపైనే ఎక్కువగా కేంద్రీకరించే ఆయన కళ్ళు.

"ఏ...పి...ప్పిల్లా...ట్టె...ట్టెక్స్టుబుక్కేది?"

బాంబు పేలింది. సీత లేచి నిలబడింది. ఎప్పట్నుంచో వాళ్ళక్క ఇచ్చిన ట్రైనింగ్‌వల్ల గానీ లేకపోతే మరో ఆడపిల్ల అయితే ఈపాటికి స్పృహతప్పి పడిపోయేది.

సీతకు ఏం జవాబుచెప్పాలో తోచలేదు. గుడ్లు అప్పగించి చూస్తూ నిలబడింది.

"చ్చె...చ్చెప్పు...ప్పు పుస్తకమెందుకు తేలేదు?"

సీతకు కాళ్ళలో వణుకు మొదలైంది. మాట రావడంలేదు.

"త్తె...త్తె...త్తెచ్చా... మాస్టారూ.. క్క...క్క...కనప్పట్టంలేదు" అంది బెక్కుతూ.

"ఆఁ...ఆఁ...న్న...న్నన్నే ఎక్కిరిస్తావ్?" అంటూ నరసింహావతారమే ఎత్తాడాయన. సీత నోటమాటరాక తొట్రుబాటుతో జవాబు చెప్పడం తన నత్తిని అనుకరించడమేనని భావించాడాయన. దాంతో ఆడపిల్లల్ని శిక్షించవద్దనుకున్న నియమం ఆక్షణంలో సడలిపోయింది.

"ఊఁ... చ్చా...చ్చాపు... చెయ్యి" అని ఆ చేతిమీదో నాలుగు, ఈ చేతిమీదో నాలుగూ వడ్డించి రొప్పుతూ "స్టా...స్టాండపాన్ది బ్బె... బ్బెన్చ్" అని మళ్ళీ తన టేబుల్ దగ్గరికెళ్ళిపోయాడు. మంగతాయారు, మీనాక్షి, రామేశ్వరి కళ్ళతో ఒకళ్ళనొకళ్ళు పలకరించుకుని పళ్ళు బిగపట్టిలోలోపలే నవ్వుకున్నారు.

ఆ పిరియడంతా అలాగే బెంచీమీద నిలబడింది సీత. ఆమె మనసు ఆరోజు జరిగిందంతా నెమరువేసుకుంటోంది. ఇప్పుడు పాఠం మీద దృష్టి లేదు ఆమెకు. అక్క ప్రతిదానికీ తనని ఎందుకలా కసురుకుంటుందో, కొడుతుందో అర్థంకాదు. బావకు చేతనైతే ఆమెని ఆపేవాడేగానీ ఆయనవల్లకాదు. బావకన్నీ తెలుసు. అందుకే రాత్రులు తనని చదివించేటప్పుడు అప్పుడప్పుడూ అక్క లేకుండా చూసి తనతో అంటూ వుంటాడు- "చూడమ్మాపాపా! ఇప్పుడు ఇంత చీకటిగా వుందికదా, అయినా ఎప్పటికీ అలాగే వుండిపోతుందా, చెప్పు? మళ్ళీ సూర్యుడు ఉదయిస్తాడు, పగలౌతుంది. అలాగే ఇప్పుడు మీ అక్క కొట్టిందనుకో, తిట్టిందనుకో అది చీకటి. చీకటిగా వున్నప్పుడేం చేస్తాం? దీపం వెలిగించుకుంటాం. దీపం ముందు కూర్చుని పుస్తకం తెరిచి పాఠం చదువుకుంటాం. కాబట్టి చీకట్లోంచి వెలుగులోకి పోవాలని మన ప్రయత్నం చేయాలి. చదువే వెలుగు. బాగా చదువు. ఇదే నువ్వు చేయాల్సిన పని."

మళ్ళీ ఇంకోసారి అనేవాడు- "మనం రోజూ వెళ్తాం చూశావా-స్కూలు-అదో చిన్నబడి. మరి ఈ ప్రపంచం వుంది చూశావూ ఇదింకా పెద్దబడి. చిన్నబళ్ళో చదువుకోవడం కాదు, పెద్దబళ్లోనూ చదువుకోవాలి. అన్ని చోట్లా మనని కష్టపెట్టేవాళ్ళుంటారు, బాధించే వాళ్ళుంటారు, అలాగే ఆదరించేవారూ, గౌరవించేవారు కూడా వుంటారు. చిన్నబడిలో పుస్తకాలు చదివినట్లే, పెద్దబడిలో మనుషుల్ని సమాజాన్ని చదవాలి. నువ్వింకా చిన్నపిల్లవేగా, బాగా ఎదిగిపోతే నీకింకా అర్థమౌతాయి నా మాటలు."

తనకూ ఎదిగిపోవాలనే వుంది. పారిపోవాలనే వుంది. రెక్కలు కట్టుకుని ఎగిరిపోవాలనే వుంది. తను పెరిగిపోవాలి పెద్దదైపోవాలి. పెద్దవాళ్లని ఎవరు బాధ పెడ్తారు? కాబట్టి అప్పుడు తను ఈ బాధల నుంచి విముక్తురాలౌతుంది.

ఎప్పుడు మొదటి పీరియడైపోయిందో ఆమెకి తెలీదు. మొదటి పీరియడ్‌లో శరీరం బెంచిమీద నుంచుంది. రెండూ, మూడూ పీరియళ్లలో కూర్చుందిగానీ మనసు తన ఆలోచనల్లో తానుండిపోయింది. "ఇదిగోనే నీ ఇంగ్లీషు టెక్స్టుబుక్, క్లాసు రూంలో మూలపడేసుంది" అని ఇంటర్వెల్లో రత్నమాల పుస్తకం తెచ్చిచ్చినా ఆమె ఏంమాట్లాళ్ళేదు.

లంచవర్లో డబ్బాలో వున్న పచ్చడి అన్నం తిని లేచి చెయ్యి కడుక్కుంటుంటే వెనకనుంచి మంగతాయారు పకపకా నవ్వడం కన్పించింది. ఏమిటో ఎందుకట్లా నవ్వుతోందో, ఆమెకేసి చూపించి మీనాక్షి, సరోజా, రామేశ్వరి-లకి ఏం చెప్తుందో సీతకి అర్థం కాలేదు. వసంత సీత పరికిణీ చూసి సీతకూ చూపించింది, ఎర్రటి మరకలు. తనకేదో అయ్యింది. సీతకు కళ్ళమ్మట నీళ్ళు తిరి

గాయి.

"నీమొహం... ఏమిటిది? మీ ఇంటికెళ్ళి మీ అక్కకు చెప్పు పో" అన్నది రత్నమాల.

"మరి క్లాసు?"

"క్లాసుల్లేవు, గ్లాసుల్లేవుగానీ పద, మేం కూడా నీతో వస్తాం" అన్నది వసంత.

వాళ్ళు తనకేమైయిందో చెప్పారు.

తను నిజంగా ఎదిగిపోయిందా? పెద్దమనిషయిపోయిందా? తనకట్లా ఏమీ అన్పించడం లేదే? తను అలాగే వుందేం? ఇంతకీ అక్కేమంటుందోననే భయం ఆ విన్నారి నరనరాలనీ కదిలిస్తోంది. పాదాలు భూమి మీద ఆననట్లు, గాలిలో తేలుతున్నట్టు నడుస్తున్న సీతని తెలియని సిగ్గు ఏదో ఆవరించింది. నెమ్మదిగా ఇల్లు చేరింది స్నేహితురాళ్ళతో.

వాళ్ళు వెళ్ళేప్పటికి రాధ ఓ కునుకు తీసి లేచికూర్చుంది.

"ఏమే... అప్పుడే వచ్చి చచ్చావు? ఆ దిక్కుమాలిన స్కూల్లో క్లాసులు కూడా సరిగ్గా అయ్యి చావవు" అన్నది చెల్లెల్ని చూసి.

"అక్కా...అక్కా...మరే...మరే..." సీతకు ఏం చెప్పాలో తోచక ఏడవసాగింది.

"ఏమైందే? నీమొహం మండ... చెప్పి చావు"

సమాధానంగా పరికిణీ చూపించింది సీత.

"ఓసి... నీ దుంపతెగ, ఓసికేనా ఇంత హంగామా?" అని పెద్దగా నవ్వింది అక్క. మొదటిసారిగా అక్క తనతో నవ్వుతూ మాట్లాడటం చూసి ఆశ్చర్యపోయింది సీత.

"సరేలే పద... నిర్వాకం చేశావుగానీ. ఇప్పుడెంత ఖర్చవుతుందో ఏమో" అని సణుక్కుంటూ పక్కగదిలోకి దారితీసింది సీతకు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసేందుకు. రాధంటే భయం వున్న వసంతా, రత్నమాలా ఏమీ చెప్పకుండానే జారుకున్నారు.

★ ★ ★

దశరథరామయ్య, మహాలక్ష్మమ్మ దంపతులకు చాలాకాలం రాధ ఒక్కతే కూతురు. ఆయనకు పెద్దగా ఆస్తి లేకపోయినా వున్న అయిదెకరాల పొలాన్ని తనే సాగు చేసుకుంటూ, మితంగా ఖర్చు పెట్టుకుంటూ తన జీవితాన్ని సాగించాడు. జారెడుపోయి మూరెడు కుంగే మనస్తత్వం కాదాయనది. వున్నంతలో రాధకు ఏ లోపం చేయలేదు. తనున్న పల్లెటూరులో స్కూలు లేదు. ఎదిగిన ఆడపిల్లను నాలుగుమైళ్ళ దూరం బస్సెక్కి పంపి చదివించే అవకాశమూ ఆయనకు లేకపోయింది. పైగా ఆ కాలంలో ఆడపిల్లలకూ చదువు అవసరం అన్న భావన లేదు. ఆడపిల్లల చదువు కుటుంబ వినాశనానికే అనే మూర్ఖత్వం పోయి, వీలైతే తమ కూతుళ్ళను చదివించేరోజులే. అలాగని ఆమెని పూర్తిగా చదువురాని మొద్దుని చేయలేదాయన. చదవనూ, రాయనూ అర్థం చేసుకునేంతవరకూ తనే చదువు చెప్పాడు. ఊళ్ళో సంగీతం తెలిసిన మాస్టారుగారుంటే ఆయన వద్ద సంగీతం చెప్పించే ప్రయత్నం చేశాడు కానీ అది పెళ్ళి సంగీతమే అయింది. కూనిరాగాలు తప్ప అంతకు పైన సాగలేదు.

కూతురుకు పదహారేళ్ళొచ్చేసరికి వివాహ ప్రయత్నాలు ప్రారంభించాడాయన. ఏవీ కలిసి రాలేదు. పెద్దపెద్ద కట్నాలు పోసి అల్లుళ్ళను కొనుక్కునే స్థోమత లేదాయనకు. రెండేళ్ళ ప్రయత్నం మీద ఓ సంబంధం కుదిరింది. అబ్బాయి ఎస్.ఎస్.ఎల్.సి. పాసయ్యి, టీచరు ట్రెయినింగ్ అయ్యాడు. ఇంకా ఏ ఉద్యోగంలోనూ కుదురుకోలేదు. అయితే కేశవమూర్తి తల్లి రంగనాయకమ్మ గట్టి మనిషి. తన కొడుక్కు ఉద్యోగం ఇప్పించే బాధ్యత మామగారిదేననీ, అయినా కట్నం ఇవ్వలేకపోవడం ఆయన మర్యాదకే తక్కువనీ ఆరోజుల్లోనే ఆమధ్య తరగతి గృహస్థును అనుగ్రహించి అయిదువేల రూపాయలు మాత్రమే కట్నంగా స్వీకరించింది. పెళ్ళిలో మర్యాదకు లోపం రాకూడదనీ, కట్నం తక్కువ కాబట్టి సలక్షణంగా వివాహం చేయాల్సిందనీ ఆదేశించింది. దూరపు బంధువే అయినా పెళ్ళిలో ఏనలుసంత లోపం కన్పించినా అలిగి కూర్చునేది. అల్లుడి అలక తీర్చడం, ఆడబిడ్డలను సాగతీయడం పోయి అత్తగార్ని బతిమాలి బామాలి చచ్చిన చావైంది దశరథరామయ్య, మహాలక్ష్మమ్మ దంపతులకు. కేశవమూర్తి

తండ్రి అతని చిన్నతనంలోనే పోయాడు. రంగనాయకమ్మకు అతనికి ముందు ఇంకా ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టినా బతికి బట్ట కట్టలేదు. భర్తపోయిన తరువాత కొడుక్కి ఆ మాత్రం చదువు చెప్పించడమే కష్టమయ్యింది ఆమెకి. ఇంత కష్టపడి పెంచిన కొడుకును ఊరికే దశరథరామయ్యకు, ఆయన కూతురు రాధకూ ధారపోయడం ఆమెకు ఇష్టం లేదు. "అసలేఅభిమానంలేనివెధవలండీ, ఈకాలం మొగసన్నాసులు. పెళ్ళి కాగానే పెళ్ళాం కొంగు పట్టుకు తిరిగే రకం. అసలైన మగవాడేడీ ఈ కాలంలో?!" అంటూండేది ఆమె. తప్పు చేసినా, చేయకపోయినా రోజుకోసారైనా కొట్టని భర్తని ఏభార్యా గౌరవించదని ఆమె అభిప్రాయం.

పక్క బస్తీ హైస్కూల్లో నానా తిప్పలూ పడీ అల్లుడికి ఉద్యోగం ఇప్పించి, కుటుంబానికి కావాల్సిన సామానులూ అవీ కొని, అద్దె ఇల్లు మాట్లాడి కూతురి చేత కాపురం పెట్టించాడు దశరథరామయ్య. మొదట్లో కొన్నాళ్ళు అత్త



గారి పోరు సహించింది రాధ. రాను రాను ఆమెకు ఎదురు సమాధానం చెప్పడం అలవాటయింది. అత్తగారు కొడుకుతో నేరారోపణలు చేస్తూ రాసాగింది. భార్యను అదుపులో వుంచలేని శేకవమూర్తి తల్లికిగానీ, భార్యకుగానీ ఏమీ చెప్పలేకపోవడంతో గృహాధికారానికై అత్తాకోడళ్ళు ప్రత్యర్థులై ఒకర్ని మించిన రాజనీతిని ఒకరు ప్రయోగించసాగారు.

"ఒట్టి చవట సన్నాసనండీ మావాడు. పెళ్ళాన్ని అదుపులో పెట్టుకునే తెలివిలేదు. ఇది బరితెగించిన మనిషి. ఆరోజుల్లో నాపెళ్ళైన కొత్తల్లో మావారు ఒక్కసారి ఉరిమిచూస్తే చాలు నా కాళ్ళు గజగజలాడేవి. మా అత్త ముందుగ పిలోనే తప్ప ఏనాడూ వంట ఇంట్లోకి వచ్చిన పాపాన పోలేదు. తెల్లవారుజామున లేచిన మనిషిని రాత్రి పదిగంటలదాకా వంచిన నడుం ఎత్తకుండా పని చేసేదాన్ని. ఇంతచేసినా ఏదోవంక వెతికి తీసి సాయంత్రం ఆయన రాగానే బుడి బుడీ దీర్ఘాలు తీసుకుంటూ నన్ను కొట్టించి కాని తృప్తిపడేదికాదు. మరీ పాపపు కాలం వచ్చిపడిందిలెండి. నిన్నగాక మొన్న పెళ్ళి చేసుకుని వచ్చిందో లేదో అన్నీ అధికారాలూ దానికే. ఏమన్నా అంటే గంపంత నోరుచేసుకు మీదపడ్తుంది. ఇచ్చిన ఆస్తిపాస్తులేం లేవు గానీ- 'నోరు పెట్టుకు బతకవే నా కూతురా!' అని నేర్పి పంపాడు ఆ దశరథరామయ్య. దాని జాణతనం పాడుగానూ..." అని కోడలు ఇంట్లో పని చేసుకునేటప్పుడు పక్కింటి ముసలావిడతో వెళ్ళబోసుకునేది రంగనాయకమ్మ.

కోడలుగా వంశ ప్రతిష్టని నిలపాల్సిన బాధ్యత పెళ్ళవ్వగానే చక్కగా గ్రహించింది రాధ. తన కర్తవ్యాన్ని ఏమాత్రం ఏమరకుండా వుండేందుకు ప్రయత్నించింది.

"ఆయన బహుమెతక మనిషండీ బాబూ. నోట్లో నాలిక లేదు. తల్లి ఏదంటే అది గంగిరెద్దులా తలవూపడం తప్ప ఆవిడ చెప్పిందాంట్లో సబబు వుందో లేదో ఆలోచించడాయన. మానాన్న ఏంతక్కువ చేశాడట ఆమెకీ, ఆమె కొడుక్కీ?! అయిదువేలు కట్నం పోశాడా? సలక్షణంగా పెళ్ళి చేశాడా? ఆయనకు ఉద్యోగం ఇప్పించాడా? -ఇంకా అంతకంటే ఏ ఆడపిల్ల తండ్రి ఏం చేస్తాడు? నా పెళ్ళికే పుష్న అయిదెకరాల్లో రెండెకరాలు హారతి కర్పూరం అయిపోయాయి. కృతజ్ఞత వుండాలండీ మనుషులకు. ఎంత చేసినా ఇంకా ఏదో చేయలేదనే ఏడుపు. ఏమాటకామాటే చెప్పుకోవాలి మంగమ్మత్తా, ఆయన మాత్రం ఒక్కనాడూ మీ నాయన అది చేయలేదు, ఇది చేయలేదూ అన్లేదు. ఈ బతుక్కి అదొక్కటే సుఖమనుకోండి. స్కూలు మాస్టరు జీతంతో సాగే జీవితంతో అంతకంటే ఏం ఆశిస్తాం చెప్పండి?" అంటూ వాపోయేది రాధ.

ఇంట్లో గారాబంగా పెరిగిన రాధను ఎవరూ ఎదురు చెప్పేవారు కారు. తనే అధికురాలన్న స్వాతిశయంలో పెరిగింది ఆమె. పచ్చటి రంగుతో కొంచెం పొట్టిగా గుమ్మటంలా కనుముక్కుతీరుత్రో రాధ తన సౌందర్యానికేం అనుకునేది. తన తర్వాతే ప్రపంచమనే మనస్తత్వం ఆమెది. తండ్రి మొదట్లో ఈ సంబంధం తీసుకొచ్చినప్పుడు గత్యంతరం లేక వప్పుకుంది. కేశవమూర్తిలో చాలా అవలక్షణాలు కనపడ్డాయామెకి. మనిషి చామనఛాయ. పోనీ చదువా అంటే ఎస్.ఎస్.ఎల్.సీ.-ఈ కాలంలో అమ్మాయిలూ ఆమాత్రం చదువుతున్నారు. ఆపాటి చదువు, తనకి అవకాశం లేకపోబట్టి గాని, తనూ చదివేది బోడీ ఎస్సెసెల్సీ. ఆపైన బతకలేక బడి పంతులుద్యోగం. బడిపంతులుకీ గొడ్లను తోలుకెళ్ళే పశువుల కాపరికీ ఆమె దృష్టిలో తేడాలేదు. పిల్లకోతిమూకను కాయడమేగా బడి పంతులుద్యోగం. అదే తన తండ్రి ఇప్పించిన ఉద్యోగం అందుకే తల్లీ కొడుకులిద్దరూ తనకు కృతజ్ఞులుగా వుండాలనుకునేది రాధ. భర్తతో ఏం ఇబ్బందిలేదు. తనకు ఎదురు చెప్పడు. కాబట్టి కృతజ్ఞత అనేది లవలేశం కూడా లేని అత్తను సాధించవూనుకుంది రాధ. అందుకోసం రకరకాలుగా రాజకీయ తంత్రాలు ప్రయోగించసాగిందామె.

మొదటగా అత్తను సాధించడం నోటమాట లేకుండా సాగించింది రాధ. రంగనాయకమ్మ అత్తను కదా అన్న ధీమాతో వంట పనిలోగానీ ఇంటిపనిలోగానీ జోక్యం చేసుకోకుండా ఇరుగింటి అచ్చమ్మతోనో, బుచ్చమ్మతోనో కాలక్షేపం




సాగించేది. "ఈ ముండపని ఇలా వుందా?" అని తీరిగ్గా, నింపాదిగా పని చేసేది రాధ. కడిగిన గిన్నే కడుగుతూ, తుడిచిన గదే తుడుస్తూ మెల్లగా మధ్యాహ్నం పన్నెండు గంటలదాకా వంట ప్రయత్నమే చేసేది కాదామె. పది, పదకొండు గంటలకే ముసలి అత్త భోజనానికి నకనకలాడిపోయేది. భర్త ఒకటిన్నరకు కానీ భోజనానికి రాడు. కాబట్టి తొందరేంలేదు. ఉదయం తనూ, భర్తా ఏదయినా ఫలహారం చేసేవారు. రంగనాయకమ్మకు ముసలితనంలో అరిగేది కాదు కాబట్టి ఆమె తినేదికాదు. కోడలెప్పుడు వంటచేసి వడ్డిస్తుందాని ఎదురు చూసేదామె. కేశవమూర్తి వచ్చిన పావుగంటకు గానీ కంచంలో అన్నం పడేదికాదు. మధ్యాహ్నం ఒకటిన్నరకు భోజనం చేస్తే సాయంత్రమంతా బద్ధకంగా వుండి రాత్రికి ఆకలేసేది కాదు. అందువల్ల ఒకోసారి ముసలామె అభోజనంగా పడుకునేది. అత్తగారు రాత్రి భోంచేయలేదు కదానే దుగ్ధ ఆమెకేమీ వుండేదికాదు. తీరిగ్గా యథాలాపంగానే కానిచ్చేది రాధ.

ఇక పట్టలేక కొడుకు మధ్యాహ్నం భోజనానికి వచ్చిన సమయంలో ఓ రోజు కోడలితో అంది రంగనాయకమ్మ- "అమ్మాయి... ఇట్లా మధ్యాహ్నం రెండింటికీ, రాత్రి భోజనం పదింటికీ చేయడం మా ఇంటావంటా లేదు. నువ్వింత ఆలస్యంగా అన్నం పెడ్తే నేనెప్పుడో హరీమని చస్తాను" అని.

"అన్నీ ఇంటావంటా వుంటాయేమిటి? కాలాన్నిబట్టి సర్దుకుపోవాలి. మీ కాలంలో స్కూళ్ళు, ఆఫీసులూ వున్నాయా? పనుండదు కాబట్టి పొద్దున్నే భోంచేసి కూర్చునేవాళ్ళు. అయినా పొద్దున పదిగంటలకే వంట చేస్తే వంట చల్లారిపోదా? ఆయన తినేదే అంతంతమాత్రం. చద్దికూడు తిని పిల్లమూకతో వేగాలంటే ఎంత కష్టం?" అని తిన్నగా భర్తమీదకే తిప్పేది రాధ.

కొడుక్కి వేడివేడి భోజనం వడ్డించొద్దని అంటుందా ముసలావిడ? అందువల్ల మనుమల బలహీనతల్ని సులువుగా వాడుకోవడమనే విద్య రాధకు పుట్టుకతోనే అలవడింది.

"పోనీ అమ్మ ఇంతసేపు వుండలేదుకదా! పదిగంటలకే ఆమె భోజనం ఏర్పాటుచేయరాదూ?" అన్నాడు కేశవమూర్తి.

"ఆఁ... ఎందుకు చేయనూ చేస్తాను. నాకేం పది చేతులున్నాయా? ఇంట్లో అంతా తినడానికైతే సిద్ధమే కానీ, చీపురుపుల్ల అవతలపెట్టడానికి ఎవరూ ముందుకురారు. చేసీ చేసీ నా నడుం పడిపోయింది బాబూ! మా ఇంట్లో నాచేత ఒక్కపనీ చేయించేవాళ్ళు కాదు మా అమ్మా- నాన్నా" అని మండిపడింది రాధ.

దాంతో కేశవమూర్తి నోరుపడిపోయేది. ఇంటి పనంతా భార్యే చేయడం చూస్తూనే వున్నాడు. పుట్టింట్లో అసలు పనిలేకుండా గారాబంగా పెరిగి ఇప్పుడు ఇంటి చాకిరీ అంతా చేస్తున్న భార్యపట్ల అతనికి సానుభూతి! బడిపంతులు ఉద్యోగంతో తనామెకి పనిమనుషుల్ని పెట్టలేడు. వీలైతే ఉదయం, సాయంత్రం ఆమె పనిలో ఏమైనా సాయంచేయాలనుకున్నా తల్లి "చవట వెధవ" అని తిడ్తుందని భయపడేవాడు.

అయితే రంగనాయకమ్మకి ఇటువంటి పనికిమాలిన అభిప్రాయాల్లేవు. "ఏంటే నువ్వు చేసేది? ఎవరింటిపని వాళ్ళు చేసుకోవడం కూడా ఊరికి ఉపకారం చేసినట్లు మాట్లాడ్తున్నావు. వాడు నీ మొగుడేనాయె. ఇక అత్తముండని నేనొక్కదాన్నేగా- నువ్వు వండి వార్చిపోయడానికి. వెధవ్వంశం వెధవ్వంశమని మా మేనత్త చెప్పనే చెప్పింది- 'వద్దే, వద్దు. వాళ్ళ సంబంధం, వట్టి గయ్యాళిమూక'ని. నేనే పోనీలే పెద్దమనిషి నాలుగుసార్లు తిరిగాడు మనచుట్టూ అని రాజీపడి నా కొడుకుని నీకప్పగిస్తే, ఇవాళ ముసలిముండకు ఇంత కూడు పడెయ్యడమే కష్టమైపోయింది" అని గయ్యిమని లేచింది అత్త.

"ఇదిగో ఒకేమాట చెప్తున్నా! మా వంశంజోలి ఎత్తొద్దు. అంత కృతఘ్నుల వంశంకాదు మాది. మీదే ఏరుదాటి తెప్పతగలేసే వంశం. చేసిందంతా మర్చిపోయి ఇవాళ ఇన్ని మాటలంటున్నారా మమ్మల్ని" అని రాగాలాపన సాగించింది రాధ.

"ఏంటే- ఏం చేశాడే మీ నాయనా? ఆయన చేసిందేంటి? మేం మర్చిపోయిందేంటి?"

"ఇంకా ఏం చేయాలి? అయిదువేల కట్నం

ఇచ్చి పెళ్ళిచేశాడు. అన్ని లాంఛనాలూ జరిపాడు. ఇల్లు కుదిర్చి, సామాన్లు కొనిపెట్టి, ఆయనకు ఉద్యోగం ఇప్పించి, ఇంతాచేస్తే మాది వెధవ్వంశమైపోయింది''

''పెద్ద చేశాళ్ళే... ఆలికి అన్నం పెట్టడం కూడా ఊరికి ఉపకారం చేయడమేనా? అందరు తండ్రులూ చేసినట్లే మీ నాయనా చేశాడు. నాకోసం చేశాడా, నా కొడుక్కోసం చేశాడా? తన కూతురుకోసం, కూతురు సుఖపడటంకోసం చేసుకున్నాడు. ఇందులో మాకు ప్రత్యేకంగా చేసిందేముంది?''

''ఇంక చాలు, ఆపండి పాడుగోల'' అన్నాడు కేశవమూర్తి.

''అవునులేండి, నేను నోరు తెరిస్తే మీకంతా పాడుగోలగానే వుంటుంది మీ అమ్మగారు చెప్పే మాటల్లో సబబు వుందో లేదో చూసే ఓపిక లేదుమీకు'' అంది రాధ పమిట చెంగుతో ముక్కూ మొహం తుడుచుకుంటూ.

''ఒరి నాయనో కోడల్ని కాదు, కొరివిని తెచ్చుకున్నానురో దేవుడో! ఆ మహాత్ముడు పుణ్యాత్ముడు కాబట్టి అప్పుడే వెళ్ళిపోయారు. నాకు చావు రాకుండా వుందిరా నాయనా! నీ పెళ్ళాం ముసల్ని బతకనివ్వదురోయ్...'' అని రంగనాయకమ్మ శోకాలు సాగించింది.

''అబ్బ అబ్బ! క్షణం శాంతుండదు కొంపలో'' అంటూ తినేపళ్ళెంలో చెయ్యి కడుక్కుని లేచి వెళ్ళిపోయాడు కేశవమూర్తి.

రంగనాయకమ్మ కోడలిగా ఆ ఇంటికొచ్చినప్పుడు తను గృహ రాజ్యాధిపత్యం ఎలా హస్తగతం చేసుకుందో మర్చిపోయింది. ''దోజ్ హు ఫర్‌గెట్ హిస్టరీ ఆర్ కన్డెమ్డ్ టు రిపీట్ ఇట్'' అన్న పరిస్థితయింది ఆమెస్థితి. గృహ రాజ్యానికి వంటిల్లే పెట్టని కోట. తన అత్త ఆ విషయం మర్చిపోయి అత్తగా అధికారం చెలాయించాలని ప్రయత్నించడంతో, వంటింటిని తాను స్వాధీనం చేసుకుని అత్తగారిని సింహాసన భ్రష్టురాలిని చేసింది. ఆమె చేసిన పొరపాటే తనూ చేసింది. వంటింటిని కోడలికి తేలిగ్గానే వశంచేసింది కానీ ఆమెనక్కడ నుంచి తొలగించటం తనవల్ల కావడంలేదు.

అధికారంలో వున్నవాళ్ళు ఏ పద్ధతిలోనైనా- సక్రమంగానో, అక్రమంగానో తమ అధికారం నిలబెట్టుకోవడానికే ప్రయత్నం చేస్తారు. వంటింటిని మళ్ళీ తన హస్తగతం చేసుకోవాలనే రాజకీయపు మొదటెత్తుగా తన వంట తానే వండుకోవాలని ప్రయత్నించింది రంగనాయకమ్మ. పదవిలో వున్నవాళ్ళు తమ ప్రత్యర్థుల ఎత్తుల్ని తిప్పికొట్టేందుకు శతవిధాలా పాటుపడతారు. అదే పని చేసింది రాధ. అత్త తనవంట తాను వండుకోవాలనుకునేటప్పటికి కూరలుండేవి కావు. కూరలు కొంటానికి తీరిగ్గా పదకొండు గంటలకి బయల్దేరేది కోడలు. ఉప్పుంటే పప్పుండేదికాదు. నిన్న డబ్బాసిండుగా వున్న పదార్థాలు ఇవాళ మాయమయ్యేవి. ముసలమ్మకు కాస్త జిహ్వాచాపల్యం జాస్తి. ఏదయినా అనువుగా చేసుకుతిందామంటే ఒకసారి ఇల్లు అయ్యవారి నట్టిల్లులాగ వుండేది. కొడుకు ఇంటి విషయాలేం పట్టించుకోకుండా వచ్చిన జీతం కోడలు రాక్షసిచేతిలో పోయడం ఆమెకి భరించరానిదిగా తయారైంది. ఆవిడ అనుకున్నప్పుడు అనుకున్న వస్తువులు ఇంట్లో వుంటాయిగానీ, తనక్కావాలనుకున్నప్పుడు మాత్రం ఇంట్లో ఏమీ వుండవు.

''ఏవే... కందిపప్పు కూడా లేదా ఇంట్లో?'' అని అత్త అంటే-

''లేదు- ఆయనకొచ్చే జీతంలో అన్నీ సర్దలేక నా తలప్రాణం తోకకొస్తోంది. ఏది కొందామన్నా సరిపెట్టుకోవాల్సి వస్తోంది. వచ్చినప్పటి నుండీ అనుకుంటున్నాను, మెళ్ళో నల్లపూసల గొలుసైనా లేదు, మెడబోసిగా వుంది, ఓ చిన్నమెత్తు పెట్టయినా చేయించుకుందామంటే కుదిరిచావడంలేదు'' అని కందిపప్పుకూ, నల్లపూసల గొలుసుకూ లంకెపెట్టి పెద్ద రామాయణం చదివింది కోడలు.

సామ దాన భేద దండోపాయాల్లో మొదటి దండాన్ని ఉపయోగించడంవల్ల దెబ్బతింది రంగనాయకమ్మ. తను ఏ అస్త్రం సంధిస్తే ఆ అస్త్రాన్ని తిప్పికొట్టగలిగే శక్తి కోడలికుందని గ్రహించలేకపోయిందామె- సామంగా నయినా కోడల్ని దారికి తీసుకురావాలని అత్త మరో రాజకీయపు ఎత్తు ఎత్తింది.

''పోన్లే అమ్మా! ఇక వంట చేయడం నావల్ల




కాదు గానీ రేపట్నుండే మీరు ఫలహారం చేసుకునేటప్పుడు నాక్కూడా ఇంత తగలె య్యి. భోజనం అబ్బాయి వచ్చినప్పుడే చే ద్దాం'' అంది.

కోడలేం తక్కువ తినలేదు.

''నాకు మాత్రమేం ఆలశ్యంగా వంట చె య్యాలని వుంటుందా అత్తా! పొద్దున లేచిన ప్పటి నుండీ రాత్రిదాకా నడుం వంచకుండా పని చేస్తూనే వున్నాను. అలాగే లేండి- రేప ట్నుండి మీరు కూడా మాతోబాటు ఫలహారం చేయండి. నాకు మాత్రం ఈ వయసులో మిమ్మల్ని కష్టపెట్టాలని వుంటుందా ఏమిటి?'' అనేది.

అయితే మర్నాటినుండి ఫలహారం రుచి తప్పిపోయింది. ఉప్మా చేస్తే ఉప్పు కషాయమ వ్వడమో, అసలు ఉప్పు లేకపోవడమో జరి గేది. ఒక్కోసారి పని తొందరలో ఇడ్లీలాంటి ప్రమాదరహితమైన వస్తువులు కూడా ఉడ క్కుండా బాధపెట్టేవి. అట్లు మాడిపోయేవి. కేశవమూర్తి ఈ పదార్థం ఇట్లా వుందని ఎప్పు డూ వ్యాఖ్యానించేవాడు కాదు. పెట్టింది తిని తన పనిమీద తాను వెళ్ళిపోయేవాడు.

ఇలాకాదని భేద మంత్రాన్ని ప్రయోగింప చూసిందిగానీ కొడుకు వట్టి అప్రయోజకుడు అవడంతో రంగనాయకమ్మ తంత్రం పారలే దు.

ఒక దేశాన్ని సాధించాలనుకున్నప్పుడు మరో దేశం తన శత్రు దేశాన్ని పొరుగు రాజ్యా లలో అపకీర్తి పాలుచేయడం రాజకీయపుటెత్తు గడ. ''మేము ఏమీ చేయకుండానే ఆ దేశంవాళ్లు మా సరిహద్దులపై సైన్యాన్ని మోహరించారు. అనవసరంగా కా ల్పులు జరిపారు. వాళ్లు సామ్రాజ్యవాదులు'' - అని దుమ్మెత్తి పోయడం పరిపాటి. రంగనాయ కమ్మ కూడా ఇరుగుపొరుగు అత్తల యు.ఎ న్.ఓ.లో కోడలి సామ్రాజ్య విస్తరణ కాంక్షను తీవ్రంగా ఖండించింది. సభ్యులందరూ కూడా ఆమోదించారు. ఆమె వాదంలోని సత్యాన్నీ, అన్యాయానికి గురికాబడ్డ వ్యక్తి బాధను, ఆగ్ర హాన్నీ గుర్తించారు. తాము కూడా కోడళ్లపై ఆంక్షలు విధించి సాధిస్తామని ప్రకటించారు. అయితే యు.ఎన్.ఓ. ప్రక టించిన ఆంక్షలకు ఏ దేశం భయపడ్డది గనుక? కోడళ్లెవరూ అత్తల మాటలు వినలేదు. ''అత్తల దౌర్జన్యాలకు గురయ్యే కోడళ్లారా... ఐక్యంకండి. మీకు పోయేదేం లేదు. సంకెళ్లు తప్ప'' అన్నట్లుగా ఇరుగుపొరుగు కోడళ్లను సంఘటితపరిచి తమ న్యాయమైన కోరికల సాధనకు ఇతోధికంగా కృషి చేసింది రాధ.

తగిన పరిజ్ఞానం లేకపోవడం వల్ల రంగనా యకమ్మ సామ, దాన, భేద, దండోపాయాల్ని ఒక క్రమంలో ప్రయోగించలేకపోయింది. తన అన్ని ప్రయత్నాలూ విఫలమవడంతో రంగనాయకమ్మ నిర్వీర్యమై పోయింది. మాన సిక బాధకు లోనై వార్ధక్యం ముంచుకొచ్చి ఇహలోకాన్ని విడిచి వెళ్లిపోయింది.

అత్తగారు పోయినప్పుడు రాధ గుండెలు బాదుకొని ఏడ్చింది. అది చూసి కేశవమూర్తి మనసు ద్రవించిపోయింది. చుట్టు పక్కలవా ళ్లందరూ బతికున్నప్పుడు అత్తాకోడళ్ల వర్గశ తృత్వాన్ని గమనించినా ఆమె అసలు మనసు గ్రహించి, ఆమె గురించి తప్పుగా అనుకు న్నందుకు బాధపడ్డారు. పోయినావిడ ఎట్లాగో పోయింది. ఉన్న రాధ ఎప్పుడన్నా అవసరపడ వచ్చు- అని గ్రహించిన బుద్ధిమంతులు వాళ్లు.

కాని అత్తగారు పోయినందుకు రాధ బాధప డిన సంగతి నిజం. తనకు ధీటైన ప్రత్యర్థి పడిపోవడంతో ఒక్కసారి జీవితం శూన్యమైంది ఆమెకు.




రాధ, కేశవమూర్తిల వివాహమైన 10 సంవ త్సరాలకు కూడా రాధకు పిల్లలు పుట్ట నందుకు మనుమలు, మనవరాళ్లను ఎత్తుకునే

భాగ్యం తనకు కలగనందుకు రంగనాయకమ్మ ఎంతో బాధపడింది. "ముసలిముండను ఇట్లా బాధపెడుతున్నది, ఆ పాపమే దాన్నట్లా కట్టి కుడుపుతోంది. నా కొడుకుతో మా వంశం నిర్వంశం అయిపోతుందేమో" అని వాపోయేది. కొడుకు తనమాట వినేటట్లయితే ఇంకో పెళ్లి కూడా చేసి ఉండేదే.

రాధ మొదటి మూడు నాలుగేళ్లూ పిల్లలు పుట్టనందుకు ఏమీ బాధపడలేదు గానీ తర్వాత తర్వాత పిల్లలు కలుగనందుకు కించపడసాగింది. పూజలు, వ్రతాలు, నోములు సాగించింది. భార్యాభర్తలిద్దరూ డాక్టరును దర్శించారు. రంగనాయకమ్మ పోయిన సంవత్సరంలోనే డాక్టరు ఇచ్చిన మందుల ఫలితంగానేమో రాధ గర్భందాల్చి ఆడపిల్లని కన్నది. పాపకి 'రమ' అని పేరు పెట్టారు. కాన్పు కష్టమై ఆపరేషను చేసి బిడ్డను బయటకు తీసిన డాక్టర్లు, ఆమెకిక పిల్లలు కలగరని చెప్పారు. అయితే ఇంతకుమునుపే అంటే రాధ పెళ్లయినమూడేళ్లకు ఒక అనూహ్యసంఘటన జరిగింది. రాధ తల్లి మహాలక్ష్మమ్మ మళ్లీ గర్భం ధరించి ఒక ఆడపిల్లను కన్నది.

మహాలక్ష్మమ్మ వివాహం పన్నెండేళ్లకే జరిగింది. పదమూడేళ్లకే ఈడేరడమూ, పద్నాలుగో ఏట కాపురానికొచ్చి పదిహేనో ఏట రాధ కడుపునపడటం జరిగింది. ఆ తరువాత రెండు మూడు గర్భస్రావాలు అయినాయి. ఇంక అందరూ రాధ ఒక్కతే కూతురు అనుకున్నారు. రాధ పుట్టిన 21 ఏళ్లకు మహాలక్ష్మమ్మ తిరిగి ఆడపిల్లని కన్నది. 'సీత' అని పేరుపెట్టుకున్నారు.

తనకేమీ పిల్లాపీచూ కలగనందుకు తండ్రి ఆస్తికి మరో వారసురాలు పుట్టినందుకు, రాధకు సీత అంటే మొదటినుంచీ పడేది కాదు.

దీనికితోడు రంగనాయకమ్మ చనిపోయిన సంవత్సరానికి ఎనిమిది సంవత్సరాల సీతని దిక్కులేనిదాన్ని చేసి మహాలక్ష్మమ్మ కాన్సర్‌తో మరణించింది. భార్య మరణంతో దశరథరామయ్య నడుం విరిగినట్లయింది. జీవితంలో సుఖం, మనసుకి శాంతి లేకపోయాయి. చిన్నదైన కూతురు సీతను రాధ దగ్గర వదిలి తీర్థయాత్రలు చేసి వస్తానని వెళ్లిన దశరథరామయ్య మళ్లీ తిరిగిరాలేదు.

దశరథరామయ్య యాత్రలకని పోయి ఇప్పటికి మూడేళ్లు నిండాయి. ఆయన ఎక్కడో చనిపోయి వుంటాడని అంతా అనుకున్నారు. దాంతో సీతను పైకి తీసుకురావాల్సిన బాధ్యత రాధపైపడింది. అయితే సీత వచ్చిన కొద్దిరోజుల్లో రాధ కూతురు జబ్బు చేసి చనిపోయింది. రమ పుట్టినప్పుడు కాన్పు కష్టమై ఆపరేషను చేసి బిడ్డను బయటకు తీసిన డాక్టర్లు ఇక రాధ గర్భం ధరించదని చెప్పారు. సీత శనిగ్రహంలా తమ ఇంటికి రావడంవల్లే, తన కూతురు చనిపోయిందని ఆమె భావించసాగింది. తనకు ఇంకా పిల్లలు పుట్టే అవకాశం లేకపోవడంతో ఆ అశక్తత సీతపై ఆగ్రహంగా మారిపోయింది.

తన ఎదానపడిన చెల్లెలు తనకు ప్రత్యర్థిగా పెరుగుతున్నట్లు రాధ భావించసాగింది. అత్తగారు లేని లోటును భర్తీచేస్తున్నట్లు అనుకోసాగింది. తనకి తిరిగి పిల్లలు పుట్టరనే భావన విశ్వసింపలేక, విస్మరించలేక అంతరాంతరాల్లో, అంతః చేతనలో దాగి ఆమెని వేధించసాగింది. పెరుగుతున్న చెల్లెలు తనని గెలవలేక ఈ రూపేణా అవతరించిన అత్తగారా అన్పించేది రాధకి.

ఎవరి అధికారానికీ అణగి వుండ నిరాకరించే ఆమె అహం, ఎదురీదాలనే ఆకాంక్ష, తెలియని ప్రత్యర్థిని సాధించాలనే తపనా అన్నిటికంటే ముఖ్యంగా తన కన్నకూతుర్ని పొట్టనపెట్టుకుందనే భావనా రాధకు ఆశ్వాసన కలిగించాయి. సీత వచ్చిన కొత్తలో భర్త ఆమెని స్కూల్లో చేర్పించ ప్రయత్నిస్తే రాధ ఆ ప్రయత్నాన్ని సర్వవిధాలా వమ్ముచేయాలని చూసింది. కేశవమూర్తి తను రోజూ చెప్పే పాఠంలో ప్రతి అక్షరం, పదం, చక్కగా గుర్తున్నట్లు రాధ అంతరంగాన్ని, ఆలోచనల్ని, ప్రవర్తనని, పనుల్నీ చక్కగా చదవగలడు. అన్ని విషయాల్లో ఆమెకి సర్వ స్వాతంత్ర్యమిచ్చినా తను ఏదయినా చేయదల్చుకుంటే రాధ కాదు గదా బ్రహ్మదేవుడు అడ్డుపెట్టినా ఆగడు. చదువు విలువ అతనికి తెలును. సెకండరీ

గ్రేడ్ టీచరుగా చేరి తను అక్కడితో ఆగిపోలేదు. బి.ఎ, బి.ఇడి కూడా పూర్తిచేశాడు.

సీతను స్కూల్లో చేర్పిద్దామని కేశవమూర్తి ప్రయత్నించినప్పుడు ఇంట్లో పెద్ద గోలే జరిగింది.

"ఆడపిల్లకు చదువెందుకండీ బాబూ? మీ అంతట మీకు తోచదు. నేను చెప్తే వినరు. నేనేం చదివాను? హాయిగా కాపురం చేసుకోవటంలా? దానికీ వయసు రాగానే పెళ్లిచేస్తే సరిపోతుంది'' అన్నది రాధ.

"అలాగే... వయసొచ్చినప్పుడు పెళ్లివేద్దాం. ఈ లోపల చదువుకుంటే ఏం మునుచుకుపోయింది'' అన్నాడు కేశవమూర్తి.

"ఏం మునుచుకుపోయిందా? అది ఇప్పుడే ఎట్లా చెప్పగలం? ఈ ఆడపిల్లలు తిన్నగా పోయి తిన్నగా వస్తారా? మధ్యలో మనకే అప్రతిష్ఠ తెచ్చే పనో చేస్తే నేను తలెత్తుకు తిరగలేను బాబూ''



''అన్నీ నీ చెల్లెలికే జరిగేట్టే మాట్లాడుతున్నావే? ఎంతమంది ఆడపిల్లలు స్కూళ్లకెళ్లడం లేదు, చదువుకోవడం లేదు? చదువుకున్న ఆడపిల్లలందరూ చెడిపోతున్నారా?''

''ఏవో... అది చదువుకోవడం నాకిష్టం లేదు. తల్లీతండ్రీ లేని పిల్ల. ఏదైనా అయితే నామీద పడి ఏడవాలది''

''తల్లీ, తండ్రీ లేకపోతేనేం, చెట్టంత అక్కవు నువ్వున్నావు కదా! ఏమవుతుంది? చదువుకుంటే లోకం తెలుస్తుంది. జ్ఞానం ఏర్పడుతుంది. రేపు సుఖంగా బతకగలుగుతుంది''

''ఏం నేను చదువుకోకపోతే ఏంనష్టమొచ్చింది. నాకు ప్రపంచం తెలీదా? నాకు జ్ఞానంలేదా? హాయిగా బతకడంలేదా?''.

''అది కాదు రాధా! నేను చెప్పేది సరిగ్గా అర్థంచేసుకో....''

''అర్థం చేసుకునే పనేం లేదండీ. అది నా చెల్లెలు, దాని బాధ్యత నాది. అది చదువుకుని చెడిపోవడం నాకిష్టంలేదు. ఇంక మీరేం మాట్లాడద్దు, నే వినను''

''సర్లే ... ఇంక నేనేం మాట్లాడను, నువ్వూ వినావద్దు. పాప నీ చెల్లెలే. నా చెల్లెలే అయితే నీతో మాట్లాడాల్సిన పనేలేదు. ఆ పిల్లబాధ్యత నాది కూడా. నీ ఒక్కదానిదే బాధ్యత అయినట్లయితే మీ నాన్న ఆ అమ్మాయిని మన ఇంట్లో దించడు. వినగల్గితే విను, లేకుంటే చెవులు మూసుకో ప్రపంచాన్ని చూస్తున్నాను, అంతో ఇంతో చదువుకున్నాను. ఈకాలంలో చదువు మొగపిల్లలకెంత అవసరమో, ఆడపిల్లలకూ అంతే అవసరం. వాళ్ళూ మనుషులే, రేపే పాపను స్కూల్లో చేర్పిస్తున్నాను''.

''అవును... మీకు ఊళ్ళో వాళ్ళందరూ మనుషులు. నేనుమాత్రం మీకు ఊడిగం చేసే దాన్ని. నేనూ చదువుకుంటాను, నన్నూ స్కూల్లో చేర్పించండి''

''ఆహా, నిరభ్యంతరంగా. ఇన్నిరోజుల్లో ఎంత చక్కటి మాటమాట్లాడావోయ్?! నువ్వూ కూడా చదువుకోవడం అవసరమే''

''ఛీ, ఛీ, ఇంక మాట్లాడకండి. మీకు సిగ్గులేకపోతే నాకైనా ఉండాలి''

''సిగ్గెందుకు చదువుకోడానికి? అదేం తప్పుడు పనికాదే?''

''మీరేమైనా చెప్పండి. దాన్ని స్కూల్లో చేర్పించడం కల్ల. మీరే నా మాటకాదంటే, తెల్లవారేటప్పటికి నా శవాన్ని చూస్తారు. కాపురానికి వచ్చినప్పటి నుండీ నామాటేం సాగనిచ్చారు గనుక? బతికున్నంతకాలం మీ అమ్మ రాచి రంపానపెట్టింది. ఆవిడ మాటే చెల్లించుకున్నది. ఇహ ఆవిడ పాత్ర మీరు వహిస్తున్నారు.

నా చెల్లెలి విషయంలో కూడా నా పెత్తనం లేదా ఏం?'' అంది రాధ, కళ్ళంబడికారే నీటిని చీరకొంగుతో తుడుచుకుంటూ, ముక్కు చీదుకుంటూ.

''నువ్వు ఏడ్చినా, మొత్తుకున్నా జరిగేది జరిగేదే. మీ ఊళ్ళో ఆ పిల్ల చదువుకున్న ప్రైమరీ స్కూలు నుండి టీ.సీ. తెప్పించాను. మా హెడ్‌మాస్టరుగారితో మాట్లాడాను. రేపు పిల్లను తీసుకువెళ్ళి స్కూల్లో జాయిను చేస్తున్నాను'' అంటూ చరచరా అక్కడినుండి వెళ్ళిపోయాడు కేశవమూర్తి.

మొండివాడు అందరికంటే బలవంతుడని సామెత. తన ఇన్నాళ్ళ సాహచర్యంలో భార్యని ఒప్పించే మార్గం మొండితనం తప్ప మరొకటి కన్పించలేదు కేశవమూర్తికి. ఆవిడకు తను అనుకున్నదే సత్యం. తను తలచిన మంచి చెడ్డలపై పూర్తి విశ్వాసం వుండేది ఆమెకి. వాదించి ఆవిడచేత హేతువును అంగీకరింపచేయడం అసాధ్యమని కేశవమూర్తికి తెలుసు. ఇంక ఒకటే మార్గం మొండిగా మంచి అనుకున్నది ఆచరించడమే. మర్నాడు సీతను తీసుకువెళ్ళి, స్కూల్లో జాయిన్ చేశాడు కేశవమూర్తి. అయితే రాధ తన ప్రయత్నం చివరివరకూ కొనసాగించింది. పాపను స్కూల్లో చేర్పించిన రోజు రాత్రి-

''మీకింత దురూహ మనసులోవుందని నాకు తెలీదు సుమండీ!'' అన్నది రాధ.

''ఏవిటది?'' అన్నాడు కేశవమూర్తి ఆశ్చర్యంగా.

''పుట్టిన ఒక్కగానొక్కటీ పోయింది, ఈ శనిగ్రహం అడుగుపెట్టాక ఇక సంతానయోగం లేదని తెలిసిపోయింది. అందుకే రెండో పెళ్ళి




ంగా దాన్ని కట్టుకోవాలని చూస్తున్నట్లున్నారు. మీ కోర్కెలకి అనుగుణంగా చదువు చెప్పించడం తొలి ప్రయత్నం. నావంటి చదువురాని మొద్దు మీకేం కళ్ళకానుతుంది? చదువూ అదీ చెప్పించి, మీక్కావాల్సినట్లు మలుచుకోండి దాన్ని..." అన్నది.

రాధ తనకు కావాల్సింది సాధించడంలో, తన్నుతాను అవమానించుకోడానికి తనవారిని అవమానించడానికి కూడా వెనుకాడలేదు.

"నువ్వు ఏంమాట్లాడుతున్నావో, ఎవరితో మాట్లాడుతున్నావో, ఎవర్ని గురించి మాట్లాడుతున్నావో నీకు తెలీదు. నీతో మాట్లాడ్డం అనవసరం" అన్నాడు కేశవమూర్తి ఏహ్యంగా.

"అవును... నాతో మాట్లాడ్డమే అనవసరంలెండి. పెళ్ళి చేస్తే ఇద్దరు పిల్లలకు తల్లులయే ఆడపిల్లలతో ఇక ఇకలూ, పకపకలూ లాగా వుంటాయా నా మాటలు? బయటివేషాలు చాలనట్లు ఇంట్లోనూ ఒకదాన్ని తయారుచేస్తున్నారు" అన్నది రాధ రోషంగా.

కేశవమూర్తి మాట్లాడకుండా రెండో వైపు తిరిగి పడుకున్నాడు.

"చచ్చిన పుణ్యాత్మురాలు, ఆవిడ ఎక్కడుందోగాని అత్తగారే నయం. ముసలితనంలో నాలిక్కేది నసిగాక వంటబాగుండలేదని నసిగేది తప్ప, మీలాగ ముంగిలావుండి నా కాళ్ళకింద ఎసరుపెట్టాలని ప్రయత్నం చేయలేదు. అయ్యా, అమ్మా నేనెక్కడ సుఖపడిపోతానో అని ఈ తద్దినాన్ని జతచేసిపోయారు. ఇది దాపురించిందీ, నా కూతుర్ని హతమార్చింది" అని మంచంమీద కూర్చున్న రాధ వంగి ముక్కు చీదుకున్నది.

"ఎవర్నీ ప్రయోజనమేంటి? మా నాన్నే నా కొంపని నిలువునా ముంచిపోయాడు. కన్నవాళ్ళకులేన్ని దుగ్ధ కట్టుకున్న వాళ్ళకుంటుందా ఏం?" అంది మళ్ళీ.

ఇట్లా ఎన్నిరకాలుగా, వయినాలుగా శోకాలు సాగించినా కేశవమూర్తి పట్టించుకోకుండా పడుకున్నాడు. కదల్లేదు, మెదల్లేదు, ఒక్కమాటకు జవాబుచెప్పలేదు. ఒక చేత్తో చప్పట్లు చరచడం అసాధ్యం గనుక ఏంచేయాలోతోచక, నిస్త్రాణగా వుండిపోయింది రాధ.

మొదట్లో తనకులేని చదువు, తన కూతుర్ని తనకి దూరంచేసిన ఈ శనిగ్రహానికి ఎందుకు అనుకున్నది. అయితే వాగ్వాదంలో తన మాటలు లక్ష్యపెట్టక, మొండిగా సీతకు చదువు చెప్పించాలని భర్త ప్రయత్నించడం ఆమె అహాన్ని దెబ్బతీశాయి. ఇంతవరకు తన మాటకు ఎదురుచెప్పినవాళ్ళు ఎవరూలేదు. చివరకు అసాధ్యురాలైన అత్తరంగనాయకమ్మ కూడా ఓడిపోయింది. మెత్తగా వుండే భర్త ఇంతమొండిగా, తన ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తాడని అనుకోలేదామె. మొదటిరోజు వాదన తరువాత రాధకు సీత చదువు సంగతి ప్రాధాన్యంగాక భర్త తనమాట వినకపోవడం భరించరానిదైంది.

మర్నాటి ఉదయంరోజూలాగా ఆమె పొద్దున్నే లేవలేదు. కేశవమూర్తికి భార్య సంగతి అర్థమైంది. తనేలేచి ఇంట్లోపనీ పాటలన్నీ చేసుకున్నాడు. వంట చేశాడు. సీతకు అన్నం పెట్టాడు. ఇంత జరుగుతున్నా, అన్నీ గమనిస్తున్నా ముసుగు తొలగించి లేవనేలేదు రాధ. స్కూలుకు వెళ్ళేముందు ఆమెను లేపి, ముఖంకడుక్కోమనిచెప్పి, కాఫీ కలిపి తీసుకొచ్చి ఇచ్చాడు. ఆమె తాగకుండా కాఫీకప్పు అలాగే పెట్టేసింది. కాస్త మనసు సర్దుబాటయిన తర్వాత ఆమే తీసుకుంటుందిలే అనుకుని స్కూలుకి వెళ్ళిపోయాడు కేశవమూర్తి.

మధ్యాహ్నం స్కూలునుండి భోజనానికి తిరిగివచ్చినా ఆమెపక్కమీదినుండి లేవలేదు. దండోపాయాన్ని గాంధీగారి సత్యాగ్రహంలా ప్రయోగిస్తోందని అర్థమైంది కేశవమూర్తికి. బతిమాలి చెప్పాడు అన్నం తినమని. అతని మాటలకేమీ జవాబు చెప్పనూలేదు, భోజనం చేయనూలేదు. అట్లా రెండ్రోజులు నిరసన వ్రతం సాగించింది రాధ. ఆ రెండ్రోజుల్లో అన్నం తినమని ఎన్నిసార్లు బతిమాలినా, ఒక్కసారి కూడా పాపను స్కూలు మాన్పిస్తాననలేదు కేశవమూర్తి. దాంతో రాధ బాగా చితికిపోయింది. ఎప్పుడూలేని నీరసం ఆమెని ఆవేశించింది. అందరిదగ్గరా చెల్లుబాటయేమాట, తన భర్త దగ్గర వమ్మయిపోయింది. ఇక బతికేం చచ్చేం? ఆ మనస్తాపంతో రెండోరోజు

రాత్రినుండీ విపరీతమైన జ్వరం వచ్చింది. రాత్రికి కేశవమూర్తి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన మందులూ, ఇంజక్షన్లూ ఇచ్చాడు. కేశవమూర్తి రాత్రల్లా ఆమెని కనిపెట్టుకునే వున్నాడు. తలనొప్పంటే అమృతాంజనం రాసి, తలపట్టాడు. ఆ మర్నాడు, ఆ తరువాత రోజూ కేశవమూర్తి, సీత - ఇద్దరూ స్కూలుకి వెళ్ళలేదు. మరి రెండ్రోజులగ్గానీ రాధకి జ్వరం తగ్గలేదు. స్కూలుక్కూడా శెలవుపెట్టి తన ఉపచర్య చేస్తున్న భర్తవల్ల ఆమె మనసు ద్రవించింది. దీనంగా తనకేసి చూస్తూ కూర్చున్న తల్లీతండ్రీ లేని పసిదైన చెల్లెలిమీద మనసు కనికరం వహించింది.

జ్వరం తగ్గిమామూలు మనిషైన తరువాత రాధ భర్తను నెగ్గుకురావడానికి మరోమార్గం ఆలోచించింది. పాప చదువుకున్నందువల్ల తనకేమీ నష్టంలేదు. కానీ ఆయన తనమాటను ఎందుకు వినకపోవాలి?.

సీతకి చదువంటే ఇష్టం లేకపోతే ఆయన తన అపజయాన్ని తప్పక అంగీకరించవలసి వస్తుంది. ఒకసారి ఒక ఆలోచన మనసుకు తోస్తే ఆచరించడంలో ఆలశ్యం చేయదామె.

చదువుకోవటానికీ, స్కూలుకి పోవడానికీ వీల్లేకుండా పాపకు పనులు చెప్పసాగింది రాధ. ఇంట్లో అన్నిపనులూ ఆ పసిదే చేయాలి. అక్కకి వ్యతిరేకంగా ఏమన్నా జవాబు చెప్పిందా, ఆరోజు పాపకు దెబ్బలు, తిట్లు, భర్తను విసుక్కోవడం, ఇష్టమొచ్చినట్లు మాట్లాడ్డం, తాను ఏడవడం, సాధించడం- అన్నీ వరసగా సాగించేది.

"ఒసేయ్ ... దేబి మొహమా! అలా నిలబడ్డావేం? లేచి పప్పురుబ్బు. మీ బావగారికి అన్నీ రకరకాలుగా కావాలి. పొద్దున టిఫెనూ, మధ్యాహ్నం టిఫెనూ చేయలేక ఛస్తున్నా"

"స్కూలుకి టైమైపోతోందక్కా" అన్నది సీత.

"ఓరోజు పోకపోతే అక్కడ నువ్వు చదివేదానికి కొంపేం మునగదులే. నువ్వేం చదివి, తలనెక్కి, రాజ్యాలు చేయాల్సిన అవసరం లేదు"

అక్కమాట కాదనడం కొరివితో తల గోక్కోటమేనని తెల్సామెకు. ఆరోజు స్కూలు ఎగ్గొట్టి పప్పు రుబ్బింది. మర్నాడు పండుగ వస్తోంది కాబట్టి ఇల్లు కడగాలి. రాధకు నడుం వంగదు. సీత ఇల్లు కడిగింది. అక్కదగ్గరుండి ముగ్గులు పెట్టించింది. ఇలా వరుసగా రెండురోజులు స్కూలు ఎగ్గొట్టేటప్పటికి ఆ విషయం కేశవమూర్తికి తెల్సింది.

"రాధా ... పాప నిన్నా మొన్నా స్కూలుకి రాలేదేం?" అని అడిగాడు.

"నేనే వద్దన్నానండి. పండగొస్తోంది. ఇల్లు మొల్లోతుగా ఉంది. కడగక మడ్డిపట్టి ఎన్నాళ్ళో అయింది. ఇంట్లోపని చేసుకోవాలికదాని- నేనే వద్దన్నాను" అందామె.

"ఇంట్లో పనులెప్పుడూ ఉంటాయి. వాటికోసం స్కూలు మానాల్సిన పన్లేదు. ఇంకో విషయం, రోజూ రాత్రిపూట పాప చదువుకునే సమయంలో నువ్వేం పనులు చెప్పకు" అన్నాడు కేశవమూర్తి.

"అబ్బో ... ఇంతోటి చదువుకు ఇంట్లోపని చేయకపోతే నేనే దొరికానా బావామరదళ్ళకు వెట్టిచాకిరీ చేయడానికి? అది కాకపోతే మీరు చేయండి. చేసీ చేసీ నా నరాలు తెగుతున్నాయి. ఇంట్లోపనీ, బైటపనీ చేసుకోలేక ఛస్తున్నాను. లేవ్వే, లే! చదువుల రాణీ! మీబావగారు తమరికి పనులేం చెప్పొద్దన్నారు. చదువు, చదువు, చదివి నా నెత్తినెక్కి డాన్సుచెయ్యి" అని పొయ్యిదగ్గర కూర్చున్న సీతని ఓ తోపు తోసి, తానక్కడ కూలబడ్డది రాధ.

కేశవమూర్తి ఆమెతో వాదనకు దిగలేదు. ఆమెతో వాదించి ప్రయోజనం లేదని అతనికి తెలుసు. చదువుకి ఆటంకం కలిగించకుండా ఉండదనీ తెలుసు. కానీ తప్పదు. ఇలాంటి పరిస్థితులలోనే మొండిగా తను అనుకున్నది సాధించాలి. సీత జీవితానికో దారి కల్పించాలి అనుకునేవాడు కేశవమూర్తి.

* * *

సైన్స్‌క్లాస్ జరుగుతోంది. సీత కొన్ని వింటోంది, కొన్ని వినడం లేదు. అంతంలేని ఆలోచనల్తో సతమతమైపోతూ పరధ్యాన్నంగా కూర్చుంది.

అస్తమానం పమిట జారిపోతున్నట్లు అని




పిస్తోంది. కంగారుగా సర్దుకుంటూ "వెధవ్వో ణీ" అని మనసులో గొణుక్కుంది. కొత్తకొత్తగా ఉంది, తిన్నగా ఓణీ వేసుకోవడం కూడా రావడం లేదామెకి.

ఈ లోకమేంటి ఇంత విచిత్రంగా ఉంటుంది? ప్రకృతి సహజమైన మార్పుకి ఇంత హంగామా ఎందుకు? పైసా ఖర్చవు తుందంటే ప్రాణం గిజగిజలాడే అక్క దీన్నో ఉత్సవంలా జరిపిందేం?

అక్కకి నేనంటే ఎందుకంత అయిష్టం? తప్పున్నా లేకున్నా తిట్టడం, సాధించడం, దండించడం తప్ప ఒక్కనాడైనా ప్రేమగా పల కరించదేం? తను చదువుకోవడం అక్కకి ఏమాత్రం ఇష్టంలేదు. బావ బలవంతంతో స్కూల్లో చేరగలిగింది. ఇప్పుడు ఈ సాకుతో మాన్పించాలని ప్రయత్నించింది. రెండ్రోజుల క్రితం అక్కాబావలకి జరిగిన సంభాషణ గుర్తొచ్చింది సీతకి.

"ఏవండీ ... పాపనింక స్కూలుకి పంపొద్దు"

"అదేం?" కేశవమూర్తి ఆశ్చర్యంగా అన్నాడు.

"అదీ, నేనే విడమర్చి చెప్పాలా?"

"పెద్దమనిషి కావడానికి, చదువు మానడానికి సంబంధంలేదు"

"సంబంధం ఉందో లేదో మీతో వాదనలనవసరం. పరువుగల కుటుంబం. పెద్దదైన పిల్ల నలుగురి కళ్ళలో పడ్డం బాగుండదు"

"నీతీ, నిజాయితీ మనలో ఉండాలి కానీ బైట తిరిగినంతలో చెడిపోరు. ఇదంతా చాదస్తం. పాపకూడా మన పిల్లలాంటిదే. పాపని చాతనైనంతవరకూ చదివిద్దాం".

"చదివింది చాల్లే, ఇంకా చదివి ఏంచేస్తుంది? ఎవర్ని ఉద్ధరిస్తుంది? ఇదో లేనిపోని లంపటంలా తయారౌతుంది".

"ఇవన్నీ పాతకాలపు మాటలు. సమాజం ఎంతో మారింది. దానితోబాటు మనమూ మారాలి. పాపని డాక్టర్నో కలెక్టర్నో చేయలేకపోయినా కనీసం తన కాళ్ళమీద తను బతకగల్గేంత చదువైనా చెప్పించాలి. నువ్వింకోసారి చదువు మాన్పిద్దాం అన్నావంటే పాపని తీసుకెళ్ళి ఏ హాస్టల్లోనో పడేసొస్తా - చెప్తున్నా" అన్నాడు కేశవమూర్తి నిశ్చయంగా.

"హాస్టల్లో కాకపోతే కాష్టంలో పెట్టుకోండి... సరైన మనుషులైతే ఏదైనా చెప్తే అర్థం చేసుకుంటారు, మొండిఘటాలకి ఎవరు చెప్పగలరు? నాదే బుద్ధితక్కువ, చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లౌతుందని ముందే చెప్పిచూశా, వినకపోతే మీఖర్మ. రేపేం జరిగినా మీరే అనుభవించండి" అంటూ వంటింటిలోకెళ్లి సామాన్లు ఎత్తెత్తికొట్టడంలో లీనమైపోయింది రాధ.

ఎవ్వరి నోటంట విన్నా - "పెద్దదైంది, పెద్దదైంది" అనే. తనలో మార్పేం లేదేం? పదిహేనురోజుల క్రితం ఎలా ఉందో ఇప్పుడూ అలానే ఉంది. ఇన్ని రోజులూ ఇంట్లోనే ఉంచారు. ఈవేళ స్కూలుకొస్తే అంతా వింతవింతగా చూడటం, ముసిముసినవ్వులు నవ్వడం- ఇదంతా చూస్తుంటే తనక్కూడా బెరుగ్గావుంది.

స్కూలయిపోయాక సీత, వసంత, రత్నమాల మెల్లగా నడుస్తున్నారు. వసంత, రత్నమాల ఎడతెరిపి లేకుండా ఏమేమో మాట్లాడుతున్నారు. సీత మౌనంగా నడుస్తోంది.

"ఏంటే మూగమొద్దులా ఏంమాట్లాడవే?! అన్నట్లు నీకు చెప్పలేదు కదూ. ఇదిగో ఈ బట్టలు మొన్న మా పెద్దక్క కొనిపెట్టింది" అంది వసంత.

"అక్కా?" అంది సీత ఆశ్చర్యంగా. అక్క ప్రేమకీ, ఆప్యాయతకీ నోచుకోని సీతకి ఎవరైనా తమ అక్కల గూర్చిగొప్పగా చెప్తే వింతగా అనిపిస్తుంది.

"అవును ... మా బావగారు చూడకుండా నన్ను తీసుకెళ్ళి కొనిపెట్టింది" వసంత సంతోషంగా చెప్పింది.

"నాకు యూనిఫాంని చూస్తేనే కంపరం. రోజూ ఇలా శనివారం అయితే ఎంచక్కా రంగురంగుల బట్టలేసుకోవచ్చు" అంది రత్నమాల.

"ఏంకాదు ... యూనిఫాం ఉండటం వలన గొప్ప, బీదా తారతమ్యం కొంతైనా తగ్గుతుంది" అంది సీత.

అలా మాట్లాడుకుంటూ నడుస్తుండగానే

వారి దారులు విడిపోయాయి. సీత ఒంటరిగా నడుస్తోంది. ఆమెకి మెరిసే వసంత కళ్ళే కనిపిస్తున్నాయి. వసంత అక్కది ఎంతమంచి మనసో? చెల్లెలికి ప్రేమగా బట్టలు కొనిపెట్టింది. చాటుగా. తన అక్కా ఉంది ఎందుకు? బావ డబ్బులిచ్చి కొనిపెట్టమన్నా తిట్టిపోస్తుంది. తప్పు... అబ్బ.. వాళ్ళంతా ఎంత అదృష్టవంతులో?'' వాళ్ళ అమ్మా, నాన్నలెంతో గారాబంగా చూసుకుంటారు. హాయిగా ఆడుకోవచ్చు, పాడుకోవచ్చు. ఏది కావాలన్నా కొనిపెడతారు. ఏమైనా తప్పు చేసినా వెంటనే క్షమించేస్తారు. వాళ్ళ అక్కలూ, అన్నలూ ఇంకా చుట్టాలూ అంతా ముద్దుచేస్తారు. తనకి ఏ అదృష్టమూ లేదు. ఒక్క బావకి తప్ప తనంటే అందరికీ అయిష్టమే, అసహ్యమే. తనకి అందర్లా అమ్మా, నాన్నా లేరు. తనొక అనాథ. అక్కెందుకట్లా అయిందానికీ కానిదానికీ కూడా విసుగూ, విరామం లేకుండా విరుచుకుపడుతుంది?

దేవుడికెందుకో అంత పక్షపాతబుద్ధి? కొందరికి అన్నీ ఇచ్చి హాయిగా బతకమంటాడు. నాలాంటి కొందరికి కష్టాలు, కన్నీళ్ళూ తప్ప మరేం ఇవ్వడు. ఇట్లా ఎందుకు జరుగుతోంది? పాపాలు చేస్తే దేవుడు శిక్షిస్తాడని తెలుగు టీచరు అంటూఉంటుంది. అంటే నేను పోయిన జన్మలో పాపాలు చేసి వుంటానా? అయినా మనచేతిలో ఏమీలేదు, అంతా ఆ దేవుడే చేయిస్తాడని చెప్తారుగా, మరి అప్పుడు పాపాలు చేయించడమెందుకు?- ఇప్పుడిట్లా హింసించడమెందుకు?' అని ఆలోచిస్తూ ఇల్లు చేరుకుంది సీత.

ఇల్లంతా రణగొణధ్వనితో గందరగోళంగా వుంది. కేశవమూర్తి ఇద్దరు మేనత్తలూ పిల్లాజల్లలూతోసహా వచ్చి వున్నారు. వారిద్దరూ పారుగూర్లో వుంటారు. ఏదో సినిమా చూసేందుకువచ్చి, ఇటొచ్చారట.

సీత రావడం ఆలశ్యం రాధ చేతిలో గరిట ఆమెకి అప్పగించింది. సీత పకోడీలు చేయడానికి ఉపక్రమించింది. వారున్నంతసేపు సీత ఏదో పని చేస్తూనేవుంది ఊపిరాడకుండా.

"మీ ఎరికలో ఏమైనా సంబంధాలుంటే దీని సంగతి మర్చిపోకండి... ఏంపెద్ద పిన్నీ? ఏమంటావు?'' అంది రాధ సీతని చూపించి.

"నువ్వంతగా చెప్పాలటే?'' సీతని పరకాయించి చూస్తూ అంది అన్నపూర్ణ.

"చిన్నగుంట... అంత తొందరేమొచ్చిందే?'' అంది చిన్న మేనత్త నరసమ్మ.

"లేదులే పిన్నీ ఎప్పటికైనా చేయకతప్పదుగా, ఆ చేసేదేదో త్వరగా ముగించేస్తే లేనిపోని శ్రమా తప్పుతుంది, నా బాధ్యతా తీరుతుంది''

అక్కడున్నపిన్నలూ, పెద్దలూ- అంతా పకోడీలు ఆరగిస్తున్నారు, ఒక్క సీత తప్ప. ఆమెకెవరూ పెట్టిన పాపానపోలేదు. రాధకి చెల్లెలు తినకూడదని వుండకపోయినా, పిల్చి సాగదీసి, తినిపించేంత ఓపికా, సహనంలేవు. చేసింది తినకేం చేస్తుందని అనుకునే తత్వం. వారంతా నవ్వుతూ, తుళ్ళుతూ ఛలోక్తులు విసురుకుంటూ తింటుంటే, తాను దేభ్యపు మొహంతో నిలబడ్డం ఇష్టంలేక సీత అవతలికి వెళ్ళిపోయింది. అనుకోకుండా దుఃఖం పొంగుకొచ్చి కాసేపు తనివితీరా ఏడ్చింది.

ఏమీ తోచక పుస్తకాలు కెలుక్కుంటూ కూర్చుంది. పెన్సిల్తో ఏవో పిచ్చిగీతలు గీసింది కొంతసేపు. ఆ అల్పసంఘటనకే ఆమె లేతమనసు గాయపడింది. అవి తినాలని ఆశగానీ, తినలేదని బాధగానీ లేదు. కాకపోతే తననొక్కదాన్నీ వెలిపెట్టినట్లు వుంచడం, పట్టించుకోకపోవడం, ఘోరంగా అవమానించినట్లు అన్పించింది.

ఆ తర్వాత రెండ్రోజులకు–

ఎంత హడావిడిపడినా ఆరోజు సీతకు స్కూలు టైం అయిందాకా ఇంటిపని తెమల్లేదు. పని పూర్తి చేసి, రెండు మెతుకులు కతికి, టిఫిన్ డబ్బాలో పచ్చడి కూడు పెట్టుకుని బయల్దేరేప్పటికి తొమ్మిది గంటలయింది. స్కూలు ఆవరణలో ప్రవేశించేటప్పటికి మూడో గంట కూడా కొట్టి పది నిమిషాలు అయించి. గేటు వేసేశారు. ఇంకా నల్గురు ఆలశ్యంగా వచ్చిన విద్యార్థినీ, విద్యార్థులు గేటు బైటే నిలబడ్డారు. హెడ్మాస్టారు తలుపు తీయించి పేముబెత్తంతో శిక్షించడానికి సిద్ధంగా వున్నారు. అది ఆయనకి రోజువారి కార్యక్రమం.




స్కూలు డిసిప్లిన్ విషయంలో ఆయనెప్పుడూ అప్రమత్తంగా వుంటాడు. ఆయనకు తెల్సు కొంతమంది విద్యార్థులు తప్పని సరైన పరిస్థితుల్లోనే ఆలశ్యంగా వస్తారని. అయినా శిక్షించడం మానివేస్తే, బుద్ధిపూర్వకంగా ఆలశ్యంగా వచ్చే విద్యార్థుల సంఖ్య ఎక్కువౌతుందనీ, క్రమశిక్షణ నాశనమౌతుందనీ ఆయన ఉద్దేశం. వరుసగా పిల్లలందరికీ చేతుల మీద రెండు పేము బెత్తపు దెబ్బల కార్యక్రమం సాగించిన తరువాత వాళ్ళని క్లాసుల్లోకి పంపాడాయన.

సీత కూడా శిక్ష అనుభవించి క్లాస్ రూం వైపు పరుగుతీసింది. జారిపోతున్న ఓణీని సరిచేసుకుంటూ, 'మరి నన్ను నిర్లక్ష్యం చేస్తే ఎల్లా' అన్నట్లు అలిగి టిఫిను డబ్బా కిందపడి, మూతవిచ్చి, అన్నం నేలపాలయింది. చేసేదేంలేక ఖాళీ డబ్బా మూత పెట్టుకుని, సీత క్లాస్ రూం వైపు పరిగెత్తింది! ఇవన్నీ స్టాఫ్ రూం నుండి గమనిస్తూనే వున్నాడు కేశవమూర్తి. తరచు సీత స్కూలుకు ఆలశ్యంగా రావడాన్నెలా పరిష్కరించాలి?- ఆలోచించాడు కేశవమూర్తి. ఈ పిల్లకో 'సైకిల్ కొనిస్తే' ముందు సైకిల్ తొక్కడం నేర్పాలి. ఆడపిల్ల సైకిల్ తొక్కడం అంతా విడ్డూరంగా చూస్తారు.

సమాజంలో వ్యవహారంలో లేనిపని ఎప్పుడూ విడ్డూరంగానే కన్పిస్తుంది తొందరగా మార్పును అంగీకరించని సమాజానికి. ఇవాళ కొత్త విషయం రేపటికి మామూలుదైపోతుంది. ఒకప్పుడు ఆడపిల్ల చదువుకోవడమే విడ్డూరం. పెద్దమనిషి అయిన పిల్లకు వివాహం చేయడం నేరంగా పరిగణించేది సమాజం. సతీసహగమనం ఆచారంలో వుండేది. సముద్రయానంపై ఆంక్ష వుండేది. అంటరానితనం, కులం- గట్టి కాంక్రీటు గోడల్లా పెరిగి సమాజాన్ని ముక్కలు చేశాయి. ఇవాళ్టి రోజున అవి నశించాయనికాదు- గోడలు బీటలువారాయి. పెక్కుసున్నం రాలిపోయింది. రాబోయే తరం దూతలు ఇటుకలన్నీ ఎత్తిపారవేసి సమాజాన్ని ఒక్కటి చేస్తారు.

లంచ్ పీరియడ్ బెల్లవగానే స్కూలు ప్యూను లక్ష్మయ్యా వచ్చి సీతకు టిఫిను పార్శిలు చేసిన పాకెట్టు అందించాడు.

"ఏమిటిది?" అందామె.

"కేశవమూర్తి సారు పంపిండు" అని ఓ చీటీ ముక్క కూడా అందించాడు లక్ష్మయ్య.

"సాయంత్రం లాంగ్‌బెల్ కాగానే నన్ను కలువు" అని రాసివుంది.

సీత అప్రతిభురాలయింది. అయితే బాధ అన్నీ గమనించాడన్నమాట. సాయంత్రం తను ఆయన్ని కలవడమెందుకు? ఆయన కూడా తను ఆలశ్యంగా వచ్చినందుకు చీవాట్లు వేస్తాడా?

సాయంత్రం మూడుగంటలకు లాంగ్ బెల్లవగానే స్టాఫ్‌రూం వద్దకు వచ్చింది సీత. కేశవమూర్తి మిగతా ఉపాధ్యాయులతో మాట్లాడుతున్నాడు తన కప్‌బోర్డ్‌లో పుస్తకాలను సర్దుతూ. అంతమంది ఉపాధ్యాయుల మధ్యలో ఆయన్ని పలకరించడానికి సిగ్గుపడి, బయటే నిలబడిపోయింది సీత. కేశవమూర్తి స్టాఫ్‌రూం నుండి బయటపడేప్పటికి ఇంకో పావు గంటైంది. చాలామంది విద్యార్థులు దూరంగా ప్లేగ్రౌండులో ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, వాలీబాల్, బాట్‌మింటన్ కోర్టుల్లో ఆడుకుంటున్నారు.

"వచ్చావా... సరే పద" అని బయటకు దారి తీశాడు కేశవమూర్తి సీతను చూసి. స్కూలు ఆవరణలో చింతచెట్టు దగ్గరికొచ్చారు వారిద్దరూ.

"చూడు... ఇవాళ్టి నుంచి నీకు సైకిలు తొక్కడం నేర్పుదామనుకుంటున్నాను. ఏం కష్టంలేదు. నాలుగైదు రోజులు ప్రయత్నం చేస్తే అదే వచ్చేస్తుంది"

"నాకా? సైకిలా? వద్దు బాబూ! నే తొక్కలేను" సంభ్రమంగా అన్నది సీత.

"పాపా! నువ్వే తొక్కాలి.. నేర్చుకోవాలి. యంత్రయుగమిది. యంత్రాలు నడపడం నేర్చుకోవాలి. అనాది కాలం నుంచి మనిషి ప్రకృతిని తన అధీనంలోకి తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆటవికుడైన అనాది మానవుడు నిప్పు కనుక్కోకముందు జంతువులను చేతులతో సంహరించి పచ్చిమాంసాన్ని తినేవాడు. తరువాత వాటిని చంపడానికి రాళ్ళతో ఆయుధాలు తయారు చేసుకున్నాడు. మీ

సోషల్ పుస్తకంలో చదువుకున్నావుగదా. పాత రాతియుగం, కొత్తరాతి యుగం మనుమలని. పొలం దున్నడం నేర్చుకున్నాడు. పంటలు పండించారు. ప్రయాణ వేగాన్ని సంతరించుకోవడానికి 'చక్రం' అనే మహత్తరమైన సాధనాన్ని కనుక్కున్నాడు. ఇన్ని వేల సంవత్సరాల సాంకేతిక, వైజ్ఞానిక ప్రగతి ఒక ఎత్తూ, ఈ వంద సంవత్సరాలు, ముఖ్యంగా పారిశ్రామిక విప్లవం నుండి వచ్చిన ప్రగతి ఒక ఎత్తు.

ప్రకృతి రాకాసి కాదనీ, దాన్ని అధీనంలోకి తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నాడు. కాబట్టి మనమూ ప్రయత్నంచేయాలి. నిన్నేం విమాన చోదకుడుగా ఆకాశయానం చేయమని చెప్పడంలేదే... అవసరంవస్తే, అవకాశం వస్తే అదే చేయాలనుకో... సైకిలు తొక్కడం నేర్చుకోమంటున్నాను. సైకిలు నేర్చుకుంటే స్కూలుకి ఆలశ్యం కాకుండా రావచ్చు. ఇంకా ఎన్నో పనులు చేసుకోవచ్చు. ఈ కాలపుజీవితం వేగవంతమైంది. మనమూ ఆ వేగాన్ని అందుకోవాలి''

సీతకు అతని మాటలు కొన్ని అర్థమయ్యాయి, కొన్ని కాలేదు.

''ఏమో బాబూ... అందరూ నవ్వుతారు. ఆడపిల్లలు సైకిలు తొక్కడమేమిటి?'' అన్నది సీత సిగ్గుగా.

''సరే... చూడమ్మాయి! ఆడపిల్లలకు చదువెందుకు? హాయిగా పెళ్ళి చేసుకుని అత్తారింటికెళ్ళి, సంసారంచేసుకుంటూ కాలంగడపచ్చుకదా?'' అన్నాడు కేశవమూర్తి- ఆమెను ఒప్పించే ధోరణిలో వాదం మొదలుపెడుతూ.

సీత మనసులో స్త్రీ విద్య అనివార్యం అన్న భావన ప్రతిష్ఠితమయ్యే వుందికానీ, హేతువెందుకో చెప్పలేకపోయింది.

''ఏం... ఎందుకు చదువుకోకూడదు ఆడపిల్లలు? ఎన్నో విషయాలు తెలుస్తాయి చదువువల్ల'' అన్నదామె.

''అంటే చదువు మొగపిల్లలకీ, ఆడపిల్లలకీ - అందరికీ ముఖ్యమే. మొగపిల్లలూ చదువుకోవాలి, ఆడపిల్లలూ చదువుకోవాలి. కానీ మొగపిల్లలు మాత్రం బస్సు ఎక్కవచ్చు, ఆడపిల్లలు ఎక్కకూడదు- అంతేకదా?''

''అదేం? అందరూ ఎక్కవచ్చు''

''ఎలా... ఆడపిల్లలు కదా! వాళ్ళు నడిచేరావాలి''

''బస్సెక్కడానికి ఆడేమిటి, మొగేమిటి బావా?'' అందామె.

''అంటే ఏ పనిచేయడానికైనా ఆడలేదు, మొగలేదు. పని మొగదికాదు, ఆడదికాదు. పనిచేసేది మనిషి. మనిషి తనకు లాభించే పని, అది ఇతరులకు కష్టం కలిగించనిదైతే తప్పకచేయాలి... అవునా?''

అవునని తలాడించింది. కానీ మనసులో ఎక్కడో మూలబెరుకు వుండనేవుంది సీతకు.

''కనుక నీకు లాభించే పని, ఉపయోగపడే పని ప్రస్తుతం సైకిలు తొక్కడం నేర్చుకోవడం'' అన్నాడు కేశవమూర్తి.

''మరి... అక్క...''

''ఆఁ... అక్క ఏవంటుందో అంటావు! ఏవంటుంది? చెడిపోయావంటుంది. నేను చెడగొడుతున్నానంటుంది. కొత్తలో మీ క్లాస్‌మేట్స్ ఎగతాళి చేస్తారు. నువ్వు ఏడిస్తే ఏడ్పిస్తారు. నువ్వు నవ్వితే వాళ్ళేడుస్తారు. అందువల్ల నువ్వు చేయాల్సింది యుద్ధం- ఈ ప్రపంచంలో, సమాజంలో అలసిపోని యుద్ధం చేయడం''

కేశవమూర్తి వాచ్‌మాన్‌తో సైకిల్ తెప్పించాడు. సీతను సీటుమీద కూర్చోబెట్టి, ఆమెకి ఎలా నడపాలో సలహాలిస్తూ చింతచెట్టు చుట్టూ విశాలమైన స్కూలు ఆవరణలో ఆమెకి సైకిలు నేర్పసాగాడు. దూరంగా కొంతమంది విద్యార్థులు, స్టాఫ్‌రూం వరండాలో నిలబడి ఇద్దరు ముగ్గురు ఉపాధ్యాయులూ చోద్యంచూస్తున్నారు. మధ్యలో కేశవమూర్తి వదిలేసినప్పుడు సీత రెండు మూడుసార్లుపడ్డది. కొంచెంగా మోచేతులూ, మోకాళ్ళూ డోక్కుపోయాయి. కిందపడ్డప్పుడల్లా ఇక నేను సైకిలు ఎక్కనని మొరాయించేది సీత. కేశవమూర్తి నచ్చజెప్పి మళ్ళీ ఆమెను సైకిలుపైకి ఎక్కించేవాడు. అరగంటసేపు ప్రాక్టీసు అయినతరువాత ''ఇవాళ్టికి చాల్లేపద...'' అన్నాడు కేశవమూర్తి.

''హమ్మయ్య...'' అని నిట్టూర్చింది సీత.

బావామరదళ్ళు ఇంటి ముఖంపట్టారు. ఆలశ్యం అయినందుకు అక్కకేం చెప్పాలని




ఆలోచిస్తోంది సీత డోక్కు పోయిన మోచేతులూ, మోకాళ్ళుచూసి ఏంగొడవచేస్తుందోనని భయపడుతూ.

"ఏవే... ఇంత ఆలశ్యమైంది? ఇద్దరూ కలసి వస్తున్నారు, ఎక్కడికి వెంచేశారేం?" అన్నది రాధ.

"అక్కా... మరే...మరే..." నసిగింది సీత.

"సరిగ్గా చెప్పి ఏడవ్వే, ముంగిమొద్దూ" అన్నది రాధ అనుమానంగా చూస్తూ.

"ఏవుంది చెప్పడానికి- పాపకి సైకిలు తొక్కడం నేర్పుతున్నాను. అందుకనే ఆలశ్యమైంది" అన్నాడు కేశవమూర్తి బట్టలిప్పి, లుంగీ కట్టుకుంటూ.

ఓ మనిషిని హత్యచేసొచ్చి 'పొడిచేశాను... పోయాడు వెధవ' అన్నట్టు తాపీగా చెప్తున్న భర్తవేపు చూస్తూ అవాక్కుగా నిలబడిపోయింది రాధ. 'ఏంమనిషీయన? ఈయనకు జ్ఞానం ఎప్పుడొస్తుంది? ఆడపిల్లకు సైకిలు నేర్పడమేమిటి? దీన్నేం బాగుపడనీయడా ఈయన? ఎట్లా ఈయన్ని మార్చాలి? ఒఠ్ఠి మొండిమనిషి' అనుకుంటూ రాధ అలా నిశ్చేష్టతలోనే వుంది.

"పద పాపా! ఇప్పటికే ఆలశ్యమైంది. ఇంటి పనులేమైనావుంటే చేసి ఆరుగంటలకల్లా పుస్తకం ముందు కూర్చోవాలి- తెల్సిందా?" అన్నాడు కేశవమూర్తి.

అప్పటికి గండం గడిచిందని లోపలి గదిలోకిపోయింది సీత.

రాళ్ళేరుతున్న బియ్యపు చేటని పక్కకుతోసేసి, గోడకు నిస్త్రాణగా చేరబడింది రాధ. మనసులో చెప్పరానంత అక్కసుగావుంది. పైట చెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, ముక్కు చీదుకుంటూ మొగుణ్ని ఎలా సాధించాలో తెలియక కూర్చుండిపోయింది. ఒక పావుగంటగ్గానీ ఆమె తెప్పరిల్లలేకపోయింది.

"ఒక్క విషయం చెప్పండి- అది బాగుపడ్డం మీకిష్టంలేదా?" అన్నది భర్తవంక చూడ్డం ఇష్టంలేక, మరోవైపు చూస్తూ.

"నువ్వూ ఒక్క విషయం చెప్పు- ఆ పిల్లబాగుపడటం నీకిష్టంలేదా?" అన్నాడతను.

"నేను దానికి అక్కనండీ- నాకంటే దాని బాగుకోరేవారు ఎవరీ ప్రపంచంలో?"

"నేను నీకు మొగుణ్ని. ఆ పిల్లకి బావని. నేను మీ బాగుకాక ఓగు కోరుకుంటానా?"

"మాటకు మాట సమాధానంకాదు. ఇవాళ మీరుచేసిన పనేమిటి?"

"నేనేం చెడుచేయలేదు. నాకు మంచి అన్పించింది ఎవరు కాదన్నా చేయకమానని నీకూ తెల్సు గనుక, నామీద నమ్మకముంచు. ఇంక ఈ విషయం తర్కించాల్సిన పనిలేదు" అని పేపరు చేతిలోకి తీసుకున్నాడు కేశవమూర్తి.

"అక్కా... ఈ పూట వంటేం చేసేది?" అన్నది సీత గదిలోకొచ్చి, అక్కవంక భయం భయంగా చూస్తూ.

"ఏదో ఒకటి తగలెట్టమ్మా... నేనెందుకూ ఇక్కడ దిష్టిబొమ్మను? మీరూ మీరూ నిర్ణయాలు తీసుకోండి, మీ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించండి. నాకు చావు రాకుండా వుందిగానీ, మీ భాగోతం చూడకముందే కళ్ళుమూస్తే బాగుణ్ణు" అన్నది రాధ విపరీతమైన దుఃఖంతో.

ఏం మాట్లాడాలో తెలియని సీత వంటింట్లోకి వెళ్లింది. కేశవమూర్తి ఆమె మాటలు పట్టించుకోక పేపరు పఠనంలో లీనమైపోయాడు. రాధ తన సొద ఆపలేదు. వంట పూర్తయి సీత పుస్తకాలు ముందుకు వేసుకు కూర్చున్నదాకా భర్తమీద, చెల్లెలిమీద నిష్ఠూరంగా మాట్లాడ్తూనే వుంది. ఆ తరువాత చెంగు కప్పుకుని అలాగే ఒరిగిపోయింది. తొమ్మిది గంటలకు భోజనానికై ఆమెను లేపాడు కేశవమూర్తి. ఎలా పరిస్థితిని ఎదుర్కోవాలో తెలియని ఆమె ప్రస్తుత పరాజయాన్ని అంగీకరించి మారుమాట్లాడక లేచివచ్చింది.

సైకిల్ నేర్చుకోవడం నిరాఘాటంగా సాగిపోయింది. సీతకు ఇంట్లో అక్క ప్రతిఘటనే కాక బయట స్కూల్లో ఎకసెక్కాలకు, ఎగతాళులకు తట్టుకుని నిలబడవలసి వచ్చింది. మీనాక్షి, రామేశ్వరి, మంగతాయారులు సీతని అవహేళన చేయడమే పనిగా పెట్టుకున్నారు.




"అదిగో- సైకిల్ చండీరాణి వస్తోంది" అని కరరిస్తే "సైకిల్ భంగం చేసే రాముడెప్పుడొ ‌డో సీతామాలచ్చిమి" అని ఇంకొకరు హే న పట్టించారు. సీత స్నేహితురాళ్ళు సంత, రత్నమాలలకు ఈ సైకిల్ ప్రహసనం చ్చకపోయినా వారేం వ్యాఖ్యానించలేదు. కేశ మూర్తి వెంటలేనప్పుడు విద్యార్థి నాయకులు దరు విజిల్స్ వేసేవాళ్ళు. ఆమె వెనక చ్చి మరికొందరు "నేనూ వస్తాను, వెనక క్కేదా?" అనేవారు. కొందరు ఉపాధ్యాయు కూడా చెవులు కొరుక్కున్నారు. సీతకు ంతా నరకంలా వుంది. సైకిల్ ప్రాక్టీసు లిపెట్టి పారిపోవాలని వుంది. కానీ కేశవ ర్తి మొండిగా ఆమె బాగా నేర్చుకున్నదాకా లిపెట్టలేదు. ఆమెకు ఆడవాళ్ళ సైకిల్ కొనిపెట్టాడు.

సైకిల్ నేర్చుకున్నందువల్ల, సైకిల్ మీద స్తున్నందువల్లా సీత అప్పుడప్పుడూ తగిలే ల్‌మాస్టర్‌గారి కేన్ రుచి తప్పింది. కేశవ ర్తి దృష్టిలో ఇది వ్యక్తి స్వాతంత్ర్యానికి క. రాధకూ మొదట్లో వున్న వ్యతిరేకత పోయింది. ఇప్పుడు బజారు సామాను తోనే తెప్పిస్తోంది. తను అష్టమానం బజా ం వెళ్ళి సరుకులు తెచ్చుకునే భారం డంతో కొంత కుదుటపడినా ఆమె ఇంకా ్తిగా అపజయాన్ని అంగీకరించలేదు.

శవమూర్తి వద్ద తెలియని విషయాలు ంచుకునేందుకు విద్యార్థులు వచ్చేవారు. మాత్రం సీత విషయంలో చాలా జాగ్రత్త ది. ఆమె మొగపిల్లలతో మాట్లాడినట్టు స్తే ఇంట్లో పెద్ద గొడవచేసేది. సీత కూడా నికి పలకరించక తన మానాన తను వుకునేది. కేశవమూర్తి ట్యూషన్లకొచ్చే ర్థులను నిరుత్సాహపరిచేవాడు. వారికి యని విషయం, అర్థంకాని పాఠం మరో ం ఇంటికి వస్తే చెప్పేవాడుకానీ, దానికింద తీసుకునేవాడుకాదు. శీఘ్ర విషయగ్ర ం లేని కొందరు విద్యార్థులు అతని కు వచ్చేవారు. విద్యార్థినులు గనుక ు చెప్పించుకోవడానికి వస్తే రాధ చాలా త్తగా వుండేది. వరండాలోనే తానో మూల ్చుని బోధనా కార్యక్రమాన్ని నిశితంగా పరి స్తుండేది.

"ఆ పిల్లకి మరీ మగా, ఆడా తెలియకుండా వుందేమండీ? అలా మీ మీదకొచ్చి కూర్చుంటుంది. పట్టి వెర్రి పిల్లలా వుంది" అనో. "ఆ పొట్టి పిల్ల పంటి మీద వోణీ నిలవదేం- ఏం పాయ్యేకాలం వచ్చిందో? మీ పిల్ల బడుద్ధాయిల వంకర చూపులూ, కొంటె చేష్టలూ... కాస్తంత మందలించండి. ఎవరి హద్దుల్లో వాళ్ళుండటం మంచిది" అనో. "ఎందుకీ సంతనంతా పోగుచేస్తున్నారు? వాళ్ళు చేసే గోలకి మర్యాదు పరండా అంతా పిమ్మలేక నా పరైపోతోంది. పోనీ డబ్బు అయినా తీసుకోండి. ప్రతీం చెత్తా ఫలందక్కిన ట్లవుతుంది" అనో ఏదో ఒక వ్యాఖ్యానం చేయకుండా ఊర్కోదామె. ఇలాంటి విషయాల్లో ఆమెని మందలించేవాడుకాదు కేశవమూర్తి. వ్యాఖ్యానం మరీ పరుషంగా వున్నప్పుడు నవ్వి తీసిపారేసేవాడు. ఒక్కోసారి నరేననేవాడు. కానీ ఆమెతో ఎప్పుడూ వాగ్వాదంలోకి దిగేవాడు కాదు. అతనికి చెప్పి ప్రయోజనం లేకపోయినా రాధ తన వ్యాఖ్యానాలు మానేదికాదు.




అలా అలా సీత ఏడు, ఎనిమిది, తొమ్మిది క్లాసులు పాసయి ఎస్.ఎస్.సికి వచ్చింది. ఇప్పటికంత పసితనం పోయింది. ప్రపంచం అర్థమవుతోంది. అయినా అక్కుపోరు ఒకోసారి భరించలేకపోయేది.

ఆరోజు స్కూలు వదిలిన తరువాత సీత సైకిల్ నడిపిస్తూ వస్తూంటే వసంత, రత్నమాల పక్కన నడుస్తున్నారు.

"ఏయ్ సీతా! నాకు పెళ్ళి కుదిరిందే. ఈ టెంత్ పరీక్షలు రాయగానే పెళ్ళి" చెప్పింది వసంత.

"అప్పుడే ఏం పెళ్ళి? కనీసం ఇంటర్మీడియేట్ పూర్తయ్యేవరకైనా ఆగక?"

"అమ్మా, నాన్నలకొకటే తొందర. నా పెళ్ళైతేగానీ వాళ్ళకి నిశ్చింత లేదట. సర్లే... చదివి మాత్రం చేసేదేముంది గనుక?" ఆరిందాలా మాట్లాడింది వసంత.

"పెళ్ళైతే పెద్దరికం వచ్చేస్తుంది. అన్నీ కష్టాలేనేమో అనిపిస్తుంది" అంది సీత.

"అబ్బబ్బబ్బా... కష్టాల్ని గురించి సందేహాలుంటే సీతనే అడగాలి. నువ్వు కష్టాల మీద రీసెర్చి చేసి ఓ పెద్ద గ్రంథం రాద్దుగాని కానీ ఇప్పట్నుండీ మమ్మల్ని హడలగొట్టకు తల్లీ" అంది రత్నమాల.

"నాది చాలా మిజరబుల్ లైఫే మాలా! అందుకేనేమో నాకు మార్పంటే మరీ భయం, అదింకా ఘోరంగా వుంటుందేమోనని"

"నిజమే సీతా! నిన్ను చూస్తే నాకెంతో జాలేస్తుంది. నువ్వు మనసు విప్పి అన్నీ చెప్పకపోయినా నీ పరిస్థితి ఏమిటో మా ఇద్దరికీ తెలుసు. నీకు కోపం వస్తుందేమో గానీ నీ మట్టుకు నీకు త్వరగా పెళ్ళవ్వడమే మేలనిపిస్తుంది" అన్నది రత్నమాల.

"ఛ... పోవే, అప్పుడే పెళ్ళేంటి? ఇంట్లో ఎలక వుందని ఇంటికి నిప్పంటించినట్లుంటుంది నువ్వు చెప్పేది"

"ఓయబ్బో... కబుర్లకేమొచ్చెలే, ఆపవమ్మా... పెళ్ళి చేసుకోక తప్పుతుందా? మీ అక్క నిన్ను ఆదరించక బరువుగా భారంగా భావిస్తూ విసురుకుంటూ, కసురుకుంటూ వుంటేనే బాగుంటుందా? పెళ్ళై నీమానాన నువ్వు సుఖంగా కాపురం చేసుకోక... దూరంగాపోతే అప్పుడామెక్కూడా ప్రేమ పెరుగుతుందేమో" అంది వసంత.





ఆ సంభాషణ అంతటితో ఆగిపోయిం
కానీ ఆరోజంతా సీత మనసు అశాంతి
అస్థిమితంగా వుండిపోయింది- ఏవో ఎడ
రిపి లేని ఆలోచనలు.

జనాలంతా హాయిగా, ఆనందం
వుండగా నేనే ఎందుకు నిరంతరం ని[illegible]తా
హంతో కుమిలిపోతున్నాను? అందర
ల్లా నాకు అమ్మా, నాన్నా లేరు. అ
వుందంటే ఒక అనురాగం లేదు, ఆప
యత లేదు. పనిమనిషికంటే హీనం
దిక్కులేని అనాథని చూసినట్లు చూస్తుం
బావకి మాత్రమే నేనంటే ఇష్టం. అయి
ఏం లాభం? చాటుమాటుగా తప్ప ఆ
మని నిర్భయంగా ప్రదర్శించలేడు. న
కావాలనుకునేవాళ్ళెవరూ లేనప్పుడూ, న
మైనా మంచి జరిగితే పంచుకోవడానికిగా
చెడు జరిగితే బాధపడటానిగ్గానీ ఎవ
లేనప్పుడు నాకు సంతోషం ఎ
వుంటుంది?

అసలు ఆనందానికి అర్థం ఏమిటి
అనేది ఆమెకి ఎప్పుడూ సందేహమే.

ఒకసారి బావని అడిగితే "గ
సందేహం వచ్చిందేం పాపకి? నాకూ తె
దు!... నీకెప్పుడు సంతోషమేస్తుందో చె
ముందు" అన్నాడు కేశవమూర్తి నవ్వే

"ఏమో.... నాకెప్పుడూ దిగులుగానే, బ
గానే వుంటుంది. ఎప్పుడైనా నూటికొక్కటి
ఎవరైనా మెచ్చుకుంటే... అప్పుడు మాత్ర
సంతోషమేస్తుంది" చెప్పింది సీత.

"అదీ నిజమే. మనం చేసిన ప
మనలో వున్న మంచి లక్షణాన్నో ఎవ
గుర్తిస్తే సంతోషమేస్తుంది. కానీ అస
ఆనందం స్వేచ్ఛలో వుంది. స్వేచ్ఛ అం
ఏమిటి? ఇష్టమైన పనిని ఇష్టమైనరీ
చేయగల్గడం. అలాని దాన్ని దుర్వినియో
చేసుకోమని కాదు నా ఉద్దేశం. ప్రతిదా
కొన్ని హద్దులుంటాయనేది తర్వాతి సం
మనసుకి నచ్చిన పనులు చేయడ
సంతోషం, సంతృప్తీ వుంటాయి" అనా
కేశవమూర్తి.

## కాసింత బిజ్ చేస్తుంది ఎన్నో పనులు
## నిజంగా బిజ్ తెస్తుంది ఎంతో పొదుపు




సూపర్ బిజ్. దీనితో
పాత్రల నిండా తళతళలు
నక్షత్రాల మిలమిలలు.
ఒక్క పాత్రలేమిటీ?
బిజ్ అన్నిటా చూపుతుంది తన
చమత్కారం.
మీ ఇంటి నేలలు, టయిల్స్,
వాష్ బేసిన్, కిటికీ-తలుపుల
గాజు రెక్కలు—ఏమైనా సరే,
బిజ్‌తో గొప్ప మెరుపులు.
మరి ఖర్చు ఎంత తక్కువంటే
మీకు ఆదాయే ఆదా!

గోద్రెజ్
సూపర్
# బిజ్
తోమే పౌడర్
**పనితనం...వెల కంటే అధికం**




CLARION/B/GS/49/173/TEL

తీరిగ్గా కూర్చుని కేశవమూర్తి మాటలు నెమరువేసుకుంటే సీతకి అందులో ఎంతో సత్యం కన్పించింది.

తనకా సంతోషం ఎందుకు లేదు? అనేక మందిలా అందని ఆశలేం లేవే తనకి? బావ చెప్పినట్లు తన ఈ దుఃఖానికి కారణం స్వేచ్ఛ లేకపోవడమేనా? అవును... నిస్సందేహంగా అంతే. కూర్చుంటే తప్పు. నిలబడ్తే తప్పు. ఏమైనా చేస్తే తప్పు. ఏమీ చేయకపోతే తప్పు. అరే- పొద్దస్తమానం ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, ఏ క్షణంలో ఏం ముంచుకొస్తుందోనని భయాందోళనలతో బతకడమే తప్ప హాయిగా, స్వేచ్ఛగా ఎప్పుడైనా విహరించి ఎరుగునా ? స్వతంత్రించి ఏ చిన్నపనైనా చేసిన పాపానపోయిందా? అంతెందుకు కనీసం ఒక స్నేహితురాలిని ఇంటికి తీసుకెళ్ళి పదినిమిషాలు ముచ్చటించగలిగే భాగ్యమైనా తనకి లేదే?

తిట్టడం, కొట్టడం, నిందించడం, దండించడం, ద్వేషించడం, అసహ్యించడం-ఇవి తప్ప అక్క తనతో ప్రేమానురాగాలతో అభిమానించి, ఆదరించిన సంఘటన ఒక్కటుందా? అక్క తనని లాలనగా, బుజ్జగింపుగా జన్మలో పలకరించిన సందర్భం వుందా?

ఇలా జరగడానికి కారణం ఏమిటి? అక్కకి నాపైన ఇంత ద్వేషభావానికి తనేం పాపం చేసింది? ఇది అక్కలో లోపమా? లేక తనలోనే లోపంవుందా?

అక్కకి తనో వీడని బంధంగా, బరువుగా తయారైంది. అందుకే సహజంగా వుండాల్సిన వాత్సల్యం అంతరించింది.

మరి దీనికి పరిష్కారం ఏమిటి? నేను మంచి చేసినా అక్కకి అది చెడుగానే కన్పిస్తుంది. ఒక పని మంచో కాదో చేసే వ్యక్తి చేతిలో కంటే చూసే మనిషి దృష్టిలో వుంటుంది. వక్రదృష్టితో చూస్తే అన్నీవక్రంగానే కనిపిస్తాయి. పోతే దీనికి మిగిలిం ఒకటే మార్గం- అక్కకి దూరంగా వెళ్ళిపోవడం. కానీ అదెట్లా సాధ్యం?

వసంత , రత్నమాలలు చెప్పినట్లు తన పెళ్ళయితే తప్ప దూరంగా వెళ్ళలేదు నిజమే.... ఇది తప్ప మార్గాంతరం లేదు అబ్బ... అక్కకి దూరం అవ్వడం... ఇ ఊహించుకుంటేనే ఎంత హాయిగా మరెంత మధురంగా ఉంది?

కానీ పెళ్ళయిన ఆడవాళ్లంతా సుఖంగా సంతోషంగా వున్నారా? తను మాత్రం సుఖా నికి నోచుకుంటుందనే నమ్మకం ఏమిటి ఎందుకుండదు? తనే రాజభోగాలు కోరడం లేదే! బావలాంటి నోరూవాయీలే భార్య చెప్పుచేతల్లో నడుచుకునే భర్త కావాలనుకోవడం లేదే! ఏదేమైనా తను ఇక్క నుంచి బయటపడాలి. ఇక్కడికంటే మరె క్కడైనా నిశ్చింతగా, నిర్భయంగా వుండగలన్పిస్తోంది.

ఇలాంటి గందరగోళపు ఆలోచనలు చె రేగినప్పుడల్లా సీత ఒక నోట్‌బుక్ తెరి ఏమేమో తోచినట్లు రాసుకుని, కొంత కొంత ఓదార్పూ, సంతృప్తీ కల్గినట్లు అ భూతి చెందుతుంది. ఆరోజూ అలాగే రా కుంది.

ఆరోజు సాయంత్రం బావిలోంచి నీ తోడి చెట్లకి పోస్తోంది సీత.

"సీతా! రేప్పొద్దున యూనిట్‌టెస్టు పె కుని నువ్వేంటి తీరిగ్గా ఆ పనీ, ఈ . చేస్తూ కూర్చున్నావు?" అన్నాడు కేశవమ కాళ్ళు కడుక్కుంటూ.

అదే సమయంలో ఉల్లిపొట్టు పడేయ నికి అటుగా వచ్చిన రాధ భర్తనోసారి ఉరి చూసి "ఆఁ...ఆఁ...ఆపండింక, దానికి ర రోజుకీ కాళ్ళు తెస్తోంది మీరు కాదూ?" అం ఉచ్చస్వరంతో.

"ఏమిటి రాధా? నీ అర్థంపర్థం లే మాటలు? ఇప్పుడు నేనేమన్నానని?" అ డు కేశవమూర్తి కోపంగా .




"ఏమనేదేంటి? అదేదో మహా పాటుపడి పోతున్నట్లు... మనకేం నౌకర్లూ, చాకర్లూ వున్నారనుకున్నారా? లేకపోతే చెట్లకి నీళ్ళు నేను పోయాలనా మీ ఉద్దేశం?" అదే స్వరంతో అంది రాధ.

అయిందానికీ, కానిదానికీ ఎందుకంత కోపం తెచ్చుకుంటావు? పాటుపడిపోతోందని కాదు- ఈ పనులన్నీ రోజూ వుండేవేకదా! నాల్గున్నరకి స్కూలు నుంచి వచ్చింది. అప్పట్నుండీ అంట్లు తోమడం, బట్టలు ఉతకడం, ఇల్లూ, వాకిలీ ఊడవడం, ఇంకా నువ్వక్కడికీ, ఇక్కడికీ పొమ్మంటే పోవడం, ఇప్పటికీ తెమలకుండా వుందని అట్లా అన్నాను. రేపట్నుంచి యూనిట్ టెస్టులున్నాయి. ఏమీ చదవకుండా రేపెళ్ళి అక్కడ ఏం రాస్తుంది? చెప్పు" అన్నాడు నింపాదిగా.

"అయితే ఏంటంట? పనులన్నీ కానిచ్చుకుని చదువుకుంటుందిలే" అంది రాధ నిర్లక్ష్యంగా.

"నువ్వేం మనిషివో, నీకెట్లా చెప్తే అర్థమౌతుందో నాకు తెలీదు" అన్నాడు కేశవమూర్తి.

"నాకంతా తెలుసు... మీరేం చెప్పనక్కర లేదు. అదేదో కలెక్టర్ చదువుతున్నంత హంగామా కన్పిస్తుంది మీ కబుర్లలో"

"ఎంత చెట్టుకి అంతగాలని, ఆ వయసుకి ఆ చదువు చదవడమూ గొప్పే" అని ఇంకా అక్కడే వుంటే చిలికిచిలికి గాలివాన అవుతుందని గబగబా వెళ్ళిపోయాడు కేశవమూర్తి.

సీత మరో అరగంటలో అంతా తీర్చుకుని గదిలో ఓ చాప పరుచుకుని, పుస్తకాలు ముందేసుకుని చదువుకోసాగింది.

కేశవమూర్తి మౌనంగా ఆమె చదువుకుంటున్న పుస్తకాలని వదిలేసి, మిగిలినవన్నీ తనిఖీ చేస్తున్నాడు. అతడి శ్రద్ధ అలాంటిది. నోట్సులు సరిగా రాసుకుంటుందా లేదా? హోంవర్కులు చేస్తోందా లేదా? రాతలో ఎలాంటి తప్పులు దొర్లుతున్నాయి? కాపీ రైటింగు నీటుగా వుందా లేదా? ఏ టీచరైనా, ఎందులోనైనా రిమార్కులు రాశాడా?- ఇలా జాగ్రత్తగా పరిశీలిస్తుంటాడతడు.

సీతకి అది అలవాటే కాబట్టి ఆమె అదేం పట్టించుకోకుండా తన మానాన తను చదువుకోసాగింది. కేశవమూర్తి చాలాసేపు చూశాక, గడ్డం సవరించుకుంటూ దీక్షగా ఆలోచించసాగాడు- కొంతసేపు సీతనే తదేకంగా చూశాడు. ఆమె అనుకోకుండా కేశవమూర్తిని చూసి, తనవేపే చూస్తూండటంతో కాస్త ఉలిక్కిపడి తిరిగి చదవసాగింది.

కానీ సీత మళ్ళీ తలెత్తి చూసినా కేశవమూర్తి ఆమెనే చూస్తూ వుండటంతో ఆమె మెల్లగా "ఏమిటి బావా... ఏం కావాలి?" అంది.

"ఆఁ... ఆఁ... ఏంలేదు. ఏంలేదుగానీ, నువ్వు పుస్తకాల్లో మధ్యపేజీలు ఎందుకు చింపేస్తున్నావు?" అన్నాడు కేశవమూర్తి.

ఆ ప్రశ్నలో సీతలో కొద్దిపాటి తొట్రుబాటు కన్పించింది. ఏమీ చెప్పకుండా తలవంచుకుంది.

"మాట్లాడవేం? అట్లా కాయితాలు చింపి, ఈ పుస్తకం కుట్టకపోతే, అడిగితే ఇంకో నోట్ బుక్ కొనీయనా?"

"అదికాదు బావా..."

"ఏదికాదు? నీకు డైరీ రాసుకోవాలని అంత ముచ్చటగా వుంటే చెప్పొచ్చుగా, డైరీ తెచ్చిచ్చేవాణ్ణి. ఇట్లా నోట్సుల్లో రాసుకోవచ్చా? ఇంకెవరైనా చదివితే...?"

ఆమె గుండె దడదడలాడింది. తన పిచ్చి రాతలన్నీ బావ చదివాడన్నమాట. ఆమెకి సిగ్గూ, భయమూ ఒక్కసారిగా ముంచుకొచ్చాయి.

"సారీబావా!" అన్నది.

"సారీ ఎందుకు? జరిగిపోయినవాటికి నేనేం అనను, నీకు తెలుసు. కానీ, ఇక ముందెప్పుడూ ఇటువంటి పనులుచేయకు-

నరేనా?'' అని నెమ్మదిగా, తలుపు బయటికి చూసి, ఆ దరిదాపుల్లో భార్యలేదని నిర్ధారించుకుని మళ్లీ మొదలుపెట్టాడు. "చూడు పాపా! నీ మైండింకా సరిగా డెవలప్‌కాలేదమ్మా! ఇట్లా అంటున్నానని వేరేగా అనుకోకు. నేనేం చెప్పినా నీ మంచికోరే చెప్తాను... ఔనా కాదా?'' అన్నాడు.

సీత తలెత్తి ఔనన్నట్లు తలూపింది.

"అయితే ఇట్లారా దగ్గరికి" అన్నాడు. సీత చదువుతున్న పుస్తకాన్ని చాపమీదపెట్టి, కేశవమూర్తి కుర్చీ దగ్గరికి వెళ్లి నిలబడింది.

"స్వేచ్ఛలో సంతోషం వుందని చెప్పిన మాట నిజమే. అయితే అక్క కాస్త తొందరపాటు మనిషి. తను నిన్ను తరచుతిడుతుంది. కాబట్టి ఆమెకి దూరమవ్వడం... ఇదేనా స్వేచ్ఛంటే? దీన్ని పలాయనవాదం అంటారు. అయినా పెళ్లి చేసుకుంటే స్వేచ్ఛవస్తుందనుకోడం నీ అమాయకత్వాన్నీ, ఎదగనితనాన్నీ సూచిస్తున్నాయి''



కేశవమూర్తి ఇట్లా చెప్పుకుంటూ పోతుంటే సీతకి తల తీసేసినట్లయింది. ఆమె తనలో తాను కుంచించుకుపోతూ ఏం చెప్పేందుకూ పాలుపోక బిక్కమొహం పెట్టుకుని, కాలి బొట నవేళ్లని నేలపై రాస్తూ, చేతులు కట్టుకుని మౌనంగా నిలబడింది.

"పాపా... దేవుడు వరాలిస్తాడని ఎవరైనా చెప్పినంతలో ఆయన్ని వెతుక్కుంటూ బయ ల్దేరతావూ? చెప్పు. దేవుడెక్కడుంటాడో ఎవరిక యినా తెల్సా? అర్ధరాత్రి కూర్చుని సూర్యో దయం కోసం ఎదురుచూసినంతలో సూర్యుడొ స్తాడా? పట్టపగలు చంద్రుడు కనిపిస్తాడా? దేనికైనా ముందు సమయం రావాలి" అన్నా డు కేశవమూర్తి.

సీతకి భయం తగ్గింది. కేశవమూర్తి అంత ప్రసన్నంగా, అంత ఓదార్పుగా చెప్తుంటే ఆమె కి కన్నీళ్లు వచ్చాయి. "అంతేనా బావా? అంత కుమించి దీనికి ఇంకేం పరిష్కారం లేదా? నువ్వు చూస్తూనే వున్నావుగా, అక్క నామీదెప్పు డూ అకారణంగా అరుస్తూండటం? తనకి నేనంటే ఎందుకంత ద్వేషం? అసహ్యం? నాకీ ఇంట్లో నుంచి పారిపోవాలన్పిస్తోంది. కాదు... చచ్చిపోవాలన్పిస్తోంది..." పొంగుకొస్తున్న దుః ఖాన్ని అణచుకునేందుకు ప్రయత్నిస్తూ కన్నీ రు తుడుచుకుంటూ, గొంతు తగ్గించి అన్నది.

"ఛ ఛ... ఊరుకో, అట్లా మాట్లాడకూడదు. నీమనసు నాకు తెలుసు. కష్టసుఖాలెప్పుడూ శాశ్వతంగా వుండవు. వెలుగూ, చీకట్లలా ఒక దాని తర్వాత మరొకటి వస్తూనే వుంటాయి. అంతమాత్రాన చీకటి రాగానే నిరుత్సాహం చెందకూడదు. నీకిది స్ట్రగుల్ పీరియడనుకో. దీన్ని దాటి ముందుకెళ్తే నీకు ఉజ్వలమైన భవిష్యత్తుంది. పూలు చూడు చుట్టూ ముళ్లు న్నా ఏసందునుంచో చోటు చేసుకు వికసించి పరిమళిస్తుంటాయి"

"చెప్పడం సులువే బావా! నేనెంత ఓర్చుకు నేందుకు ప్రయత్నిస్తున్నా అక్క చేష్టలు శాంతి లేకుండా చేస్తున్నాయి. ఇంకెంతకాలమని ఇట్లా? ఇటీజ్‌నథింగ్ బట్ హెల్' అంటూ చేతుల్లో ముఖాన్ని దాచుకుని ఏడ్వసాగింది సీత.

"నీకెన్నోసార్లు చెప్పాను, దేనికైనా సమ యంరావాలి, అప్పటివరకూ సహనం కావాలి అని. నీకు త్వరలోనే మంచిరోజులొస్తాయి. "ఇఫ్ విన్టర్ కమ్స్ విల్‌ది స్ప్రింగ్ బీ ఫార్ బియాన్డ్' అంటారు చూడు- ఇంకెన్నాళ్ళు సాధిస్తుంది మీ అక్క? నువ్వలా నీ పన్లేవో త్వరగా ముగించుకుని శ్రద్ధగా చదువుకో. మీ అక్కకి ఎదురుతిరిగి నిన్నింత పట్టుదలగా చదివిస్తున్నదానికి నువ్వు సార్ధకత చేకూర్చాలి. రేపు నీకు పొట్టనింపేది అదే. మహానుభావుడు గేథే ఏమన్నాడో తెలుసా? 'జీవితం పెద్ద బండ రాయి, నీక్కావాల్సిన రూపాన్ని, అందాన్ని నీవే తయారుచేసుకోవాలి. నీ వ్యక్తిత్వమే నిన్ను శిల్పంగా తీర్చిదిద్దుతుంది' అని... కాబట్టి ను వ్వు చక్కటి వ్యక్తిత్వం వున్న మనిషిగా తయా రుకావాలి. బాగా చదువుకోవాలి. చదువంటే కేవలం ఈ పాఠ్యపుస్తకాలనిబట్టీ పట్టడంకాదు, మంచి మంచి సాహితీ గ్రంథాలనీ, మనుషుల నైజాల్నీ నిశితంగా చదువు... జీవితమన్నాక సంఘర్షణ తప్పదు. నువ్వీ చిన్న చిన్న సంఘ టనలకే రియాక్టవడం అనవసరం... సరేనా? ఈపిచ్చిపిచ్చి ఆలోచనలు మానేసి వెళ్లి బు ద్ధిగా చదువుకో పో. రేపు చూస్తాగా, ఫస్టుమార్కు రావాలి" అన్నాడు కేశవమూర్తి.

సీత... "హమ్మయ్యా" అని ఊపిరి పీల్చు కుని వెళ్లి చదువులో లీనమయింది.

ఆరోజు స్కూల్లో-

"సీతా... నీసైన్స్ క్లాస్‌వర్క్ ఓసారిస్తావా? రేపు తెచ్చిస్తా" అడిగాడు శ్రీహరి ఇంటర్వెల్లో. సీత క్లాసులో మెరిట్ స్టూడెంట్ అవ్వడంచేత చాలామంది ఆమె నోట్సులు అడిగి తీసు కుంటుంటారు.

"సారీ శ్రీహరీ... సైన్స్ నోట్స్ ఈరోజు తేలే దు"

"అబద్ధం చెప్పకు... ప్లీజ్. సరిగ్గా హాండిల్ చేయనని భయమా?"

"నామాట మీద నమ్మకం లేకపోతే, ఇదిగో నా బుక్సన్నీ చెక్ చేసుకో. నేనంత సెల్ఫిష్‌కా దు. ఒక నోట్సు భాగ్యానికి అబద్ధం చెప్తానా?" సీత కాస్త కోపంగా, తీక్షణంగా అంది. ఆమె సర్వసాధారణంగా అబద్ధం చెప్పదు. అలాగే




అనుమానిస్తే భరించలేదు.

"సారీ... సారీ... టేకిటీజీ. పరమేశంవా ళ్లంతా వుంచుకునీ ఇవ్వడంలేదు. నువ్వూ అంతేననుకుని అన్నాను" అంటూ వెళ్లిపోయాడు శ్రీహరి.

ఆరోజు సాయంత్రం ఏడుగంటల ప్రాంతంలో తోమిన అంట్లు వంటింట్లో సర్దుతున్న సీతకి-

"సీత ఇంట్లో వుందాండీ?" అన్న శ్రీహరి మాటలు విన్పించాయి. ఆమె చప్పున వీధి తలుపు దగ్గరికి వెళ్లబోయి అక్కస్వరంవిని ఆగిపోయింది.

"ఎందుకు? నువ్వెవరు?"

సీతకి మనసంతా బాధతో నిండినట్లని పించింది. ఛ ఛ... అక్క అసలు మనిషేనా? వీసమెత్తయినా మానవత్వం వుందా? తనని ఎంత హీనంగా అయినా చూడనీ- ఫరవాలేదు. కానీ, ఎవరో బయటివాళ్లతో కూడా అట్లా మాట్లాడుతుందేం? ఆ స్వరంలో లేశమాత్రమైనా సామ్యం లేకపోగా ఎక్కడలేని అధికారం, అహంకారం ఉట్టిపడుతున్నాయేం!

"కావాలండీ... నేనామె క్లాస్‌మేట్‌ని..."

"దాన్తో ఏం పనినీకు?"

"ఒక నోట్సు కావాలి, అందుకని..."

"సీత లేదు... ఎక్కడికో వెళ్లింది" రాధ మాట తీరుకి మరొకరైతే వెంటనే మరలిపోయేవారే, కానీ శ్రీహరి కాస్త మొండివాడు.

"ఓ గంటలో వస్తుందాండీ?" అన్నాడు.

"రాదు. వచ్చినా నీతో మాట్లాడదు. ఏం బాబూ? నోట్సు కావాలంటే నీతోటి మగపిల్లల దగ్గర తీసుకోవచ్చుగా- ఆడపిల్లే కావాల్సొచ్చిందా? అయినా ఈ సీతే కన్పించిందా? ఆడపిల్లలూ, మగపిల్లలూ కల్సి తిరగడం, మాట్లాడుకోవడం మా ఇంటావంటాలేదు. ఇంకెప్పుడూ ఇట్లా రామాకు" అంది రాధ జంకూగొంకూ లేకుండా.

అతను సిగ్గుతో సగం చచ్చిపోయి, వంచిన తలెత్తకుండా, మారుమాట్లాడకుండా వచ్చిన దార్నేపోయాడు.

"నీకు బొత్తిగా సిగ్గూ, ఎగ్గూలేకుండా పోయాయే! వాణ్ణి నువ్వే రమ్మన్నావా ఇంటికి?" లోపలికొచ్చి అపరకాళిలా అడిగింది రాధ.

ఆ క్షణంలో సీతకి రాధపట్ల అవగింజలో అరవయ్యోవంతు కూడా అభిమానంలేకుండా పోయింది. అనంతమయిన ఏహ్యాభావం కలిగింది.

"లేదు... నేరమ్మన్లేదు. అయినా ఆ అబ్బాయి చాలా మంచివాడు... ఇంటికొచ్చిన వాళ్ళని అట్లా అవమానించడం..." అంటూ లోపల్నుండి ఒక విధమయిన ఛీత్కారభావం ఉప్పొంగుతూంటే ధైర్యం కూడదీసుకుని మాట్లాడబోయింది సీత.

రాధ మధ్యలోనే అందుకుని "నోర్మూసుకో... సిగ్గులేనిదానా! ఇంకోసారి ఎవడైనా వస్తే కాళ్ళిరగ్గొడతా జాగ్రత్త. నీకెంత పొగరే? నాకే నీతులు నేర్పుతున్నావా? గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్లు" అంటూ సాగించి పావుగంటపాటు విరామం లేకుండా అనేకరకాలుగా సాధింపుల బాణాలు సంధించి వేధించింది సీతని రాధ.

ఆరోజు పుస్తకాలు పట్టుకుని దిగులుగా కూర్చుంది సీత. ఆమె బుర్రకేమీ ఎక్కడంలేదు. ఏమో ఆలోచించుకుంటూ మధ్య మధ్యలో కన్నీరు తుడుచుకుంటూ కూర్చుంది.

ఇదేమీ తెలియని కేశవమూర్తి కొంతసేపు ఆమెని గమనించి "ఏం పాపా? అట్లావున్నావేం? ఒంట్లో బాలేదా?" అన్నాడు దగ్గరగా వెళ్ళి.

సీత తుళ్ళిపడి కంగారుగా కళ్ళు తుడుచుకుని, ముఖకవళికలు మార్చేందుకు ప్రయత్నిస్తూ "ఆఁ... ఏంలేదు, ఎలావున్నా? మామూలుగానే ఉన్నాగా" అంది.

కేశవమూర్తి ఓసారి తలుపువైపు చూసి "కంగారుపడకు, ఏమైంది? మళ్ళీ ఏమైనా గొడవా?" అన్నాడు.

సీత ఏమీ మాట్లాడలేదు.

"చెప్పవా? అయితే సరే..." అంటూ లేవబోయాడు. సీత తలెత్తి కేశవమూర్తి కళ్ళలోకి చూసింది. ఆమె కళ్ళు అశ్రుపూరితాలై, ఎర్రబారి ఉన్నాయి.

ఆమె కన్నీళ్ళు తుడుస్తూ "ఏమైంది పాపా? ఎందుకేడుస్తున్నావు? అక్క తిట్టిందా?" అన్నాడు.

"కాదు బావా... శ్రీహరి ఏదో నోట్సుకోసమని ఇంటికొచ్చాడు. నేనేం రమ్మన్లేదు. వస్తాడని తెలీదు కూడా. అది తప్పట- నానా తిట్లూ తిట్టింది. ఒకచోట కలసి చదువుకునేటప్పుడు. అవసరమై మాట్లాడితే ఏమవుతుంది బావా? అదేదో పెద్దనేరమైనట్లు... నన్ను తిడితే తిట్టింది, ఆ అబ్బాయిని కూడా అవమానించి పంపింది. రేపు స్కూల్లో ఆ అబ్బాయి మొహం చూడాలంటే సిగ్గు పడేటట్లు చేసింది" అంది సీత.

ఆమె మాటలకి నవ్వాడు కేశవమూర్తి.

"ఏ విషయాన్నీ నిశ్శంకతో చూడలేకపో వడం మీ అక్కబలహీనత. ఇంకా నిన్నిలా వదిలేసిందేమా అని ఆశ్చర్యపడుతున్నాను. 'తివిరి ఇసుమున తైలం తీయడం' లాంటిది మీ అక్కను మార్చే ప్రయత్నం. ఎవరైనా సరే- సిగ్గుపడాల్సింది స్వీయప్రవర్తనపట్ల. వేరేవాళ్ళందరి ప్రవర్తనకూ, మాటలకూ నువ్వు బాధ్యత వహించాల్సిన అవసరంలేదు" అంటూ అనునయించాడు.

"లేదు బావా! ఎంత దారుణంగా మాట్లాడిందో నీకు తెలీదు"

"నువ్వు చెప్పఖ్ఖర్లేదు పాపా! మీ అక్క ఎప్పుడెలా మాట్లాడుతుందో నాకు తెలుసు" అన్నాడు కేశవమూర్తి.

"నువ్వే చెప్పుబావా... ఇందులో తప్పేముందని? తనంత రాద్ధాంతం చేయడానికి? ఒక ఆడపిల్లా, ఒక మగపిల్లాడూ మాట్లాడుకో కూడదా? అంతా మనుమలేకదా?!"

"మళ్ళీ మొదటికొచ్చావా? తప్పా... బుద్ధివున్నవాళ్ళెవరూ ఆ మాటనరు. చూడు పాపా! ఒక చిన్నగుంట ఉందనుకో, అందులో ఎన్నో నీళ్ళు పట్టవు. అదే సముద్రంలో చూడు... అట్లాగే హృదయం విశాలంగా ఉంటే ఎన్నో ఉన్నత భావాలు ఇముడుతాయి. కానీ సంకుచిత మనస్కులకి నీచాలు, కుచ్చితాలు తప్ప మంచి ఆలోచనలు ఎట్లా వస్తాయి?" అన్నాడు కేశవమూర్తి.

సీత చెక్కిలిమీద చేతులుంచుకుని ఆశ్చర్యంగా చూసింది కేశవమూర్తిని. ఆమెకి ఏం మాట్లాడాలో తెలియలేదు. కానీ మనసంతా గజిబిజిగా, గందరగోళంగా మారింది.

అంతలో రాధ అటుగా రావడంతో వారి సంభాషణ అర్ధాంతరంగా ఆగిపోయింది.

మరుసటిరోజు స్కూలుకు వెళ్ళేందుకు సిగ్గుగానూ, భయంగానూ అన్పించింది సీతకి. ఆరోజు మానినా, మర్నాడైనా వెళ్ళకతప్పదు కదా అనుకుని బయల్దేరింది. ఎవరితోనూ మాట్లాడకుండా ఓ మూలగా తలొంచుకుని కూర్చుంది. రెండు మూడుసార్లు మగపిల్లల వైపు చూసింది, శ్రీహరికోసం. అతడి ముఖం కన్పించిందికానీ అందులో ఏ భావమూ గోచరించలేదు. అటు నవ్వూలేదు. ఇటు బాధాలేదు. ఆమెకి మొదటిసారిగా ఆడ, మగభేదం తెలియవచ్చింది. "అబ్బా... మగపిల్లలు ఎంత గంభీరంగా ఉంటారు? ఆడపిల్లల్లా ప్రతిదానికీ రియాక్టవరు. ఒకవేళ అయినా దాన్ని మనసులో దాచుకుంటారే తప్ప ముఖంలో మాత్రం చూపరు" అనుకుంది.

స్కూలు అయిపోయింతరువాత వసంతని వెంటబెట్టుకుని శ్రీహరిని సమీపించింది.

శ్రీహరి చూడలేదో, చూసినా చూడనట్లు నటించాడో తెలీదు కానీ వారిని దాటి వెళ్ళిపోతున్నాడు.

ముందే బిక్కుబిక్కుమంటున్న సీతకి అతడట్లా పోవడం మరీ భయం కల్పించింది.

జరిగిన సంగతంతా వసంతకి ముందే చెప్పింది సీత.

"శ్రీహరీ! సీత పిలుస్తోంది ఒకసారిటు చూడు" అందామె

శ్రీహరి వెనుదిరిగి నవ్వాడు. ఆ నవ్వు తెచ్చిపెట్టుకున్నట్లులేదు. అతి మామూలుగా ఉంది. అంతకుముందురోజు జరిగిన సంఘటన కలకాదు కదా అన్పించింది సీతకి ఒక్క క్షణం.

"ఇదిగో సైన్స్ నోట్స్" అంది సీత పుస్తకమిస్తూ.

"నిన్న మీ ఇంటికొచ్చాను" అన్నాడు శ్రీహరి.

"ఔను... అందుకే సారీ చెప్పడానికి వచ్చాను. రియల్లీ అయామ్‌వెరీసారీ శ్రీహరీ! మా అక్కకాస్త తొందరపాటు మనిషి. తన తీరే

అంత. అందరితో అట్లాగే మాట్లాడుతుంది''
తలొంచుకుని పాఠం అప్పజెప్పినట్లు చెప్పింది సీత.

''నువ్వెందుకు సారీ చెప్పడం? నేనే చెప్పాలి సారీ. అసలు రావడం నాదే తప్పు. అవసరమే తోచింది తప్ప, ఆలోచన రాలేదు. మీ అక్కకి చెప్పు- ఇంకెప్పుడూ అలా రానని'' అన్నాడు.

''అంటే ఇంకా కోపం పోలేదన్నమాట? జరిగినదానికే బాధపడుతుంటే, నీ మాటలు...''

''ఇందులో బాధపడాల్సిందేముంది? అసలిప్పుడేం జరిగిందని? వేరేగా అనుకోకు. నాక్కోపమే రాలేదు''

''నిజంగా? కోపం రాలేదా? చాలా థాంక్స్ శ్రీహరి!'' కృతజ్ఞతాపూర్వకంగా చూసింది సీత.

మర్నాడు సాయంత్రం స్కూలు నుండి ఇంటికి వెళ్తున్న శ్రీహరిని దోవలో పలకరించాడు కేశవమూర్తి.

''ఏమయ్యా శ్రీహరీ చదువెలా సాగుతోంది?''

''బాగానే చదువుతున్నాను మాష్టారూ! పోతే సైన్సు, లెక్కలు కొంత ఇబ్బందిపెడుతున్నాయి. సైన్సయితే చదువుకుంటే వస్తుంది కానీ, లెక్కల్లో మాత్రం చాలా డౌట్లున్నాయి మాష్టారూ'' అన్నాడు శ్రీహరి వినయంగా.

''మరి క్లాసులో ఎప్పుడూ అడగవేం? లెక్కలు నాసబ్జక్టే కదా! నువ్వు అడగకపోతే నీకు సందేహాలొస్తున్నాయని నాకెలా తెలుస్తుంది? మీరేం ప్రశ్నలు వేయకపోతే మీకు ఏ అనుమానాలూ లేవనీ, అంతా అర్థమైందనీ అనుకుంటాం మేం''

సమాధానంగా ఏం మాట్లాళ్ళేదు శ్రీహరి.

''అలా మొహమాటపడితే ఎలాగయ్యా సాధించేది? సర్లే... రోజూ హోంవర్క్ చేస్తున్నావా? లెక్కలు రోజూ ప్రాక్టీస్‌చేయాలి. మిగతా సబ్జెక్ట్స్‌లో ఎప్పుడో చదువుతానంటే కుదర్దు. రోజూ ఒక్కగంటైనా లెక్కల కోసం వెచ్చిస్తావా?'' అడిగాడు కేశవమూర్తి.

''లేదు మాష్టారూ! రోజూ చేయను. ప్రతి ఆదివారం ప్రయత్నిస్తానుగానీ సందేహాలొస్తుంటాయి. అప్పటికి మీరు వేరే ఛాప్టర్లోకిపోతే పాతదాంట్లో సందేహాలు అడిగేందుకు సంకోచమేస్తుంది''

''సంకోచంతో నోర్మూసుకు కూర్చుంటే ఎలా? అడిగితే కానీ అమ్మయినా పెట్టదంటారు. సరే... ఇవాళ సాయంత్రం ఆరుగంటలకు మా ఇంటికిరా- సందేహాలు తీర్చుకుందువుగాని. ముందు నువ్వు చదువుకునేందుకు ఒక ప్రణాళిక వేసుకోవాలి. ఏ టైములో ఏ సబ్జక్టు చదవాలి అని. నీకు కష్టమైన సబ్జక్టులు రెండు ఒకరోజు, మిగతామూడూ ఒక రోజూ- అలా ఆల్టర్‌నేటివ్‌డేస్‌లో చదువు. నువ్వు వెచ్చించగల్గిన కాలాన్ని ఈ సబ్జక్టుకు ఇంత అని కేటాయించు. రోజూ ఉదయం మాథ్స్ చేయాలి. చదివేపని రాత్రి, రాసేపని పగలు- ఇలా విభజించుకుంటే మంచిది''

''అలాగే మాష్టారూ... అలాగే చేస్తాను. ఓ టైంటేబుల్ వేసుకుని మీకు చూపిస్తాను''

''సరే... ఆదివారం పాతపాఠాలు రివైజ్ చేసుకోవడానికి వినియోగించాలి. అర్థమయిందా? పరీక్షల టైములో విషయాన్నంతా ఒకేసారి బుర్రలోకి బలవంతంగా నెట్టాలనుకునేకంటే ఇది సులువైన పద్ధతి, సరైన పద్ధతి. దీనివల్ల పరీక్ష పాసవ్వడమే కాదు విషయంపై క్షుణ్ణమైన అవగాహన ఏర్పడుతుంది. అదే సరైన చదువు''

''అలాగే మాష్టారూ''

''నువ్వు రోజూ మా ఇంటికి రానవసరంలేదు. నీకేం తెలియకపోయినా సంకోచపడకు, రా! అర్థం కానంతవరకూ రావాల్సిందే'' అన్నాడు కేశవమూర్తి.

శ్రీహరి ఆరోజు సాయంత్రం ఆరుగంటలకల్లా కేశవమూర్తి ఇంటికి వచ్చాడు. సీత, శ్రీహరి క్లాస్‌మేట్స్ అవడం వల్ల ఇద్దర్నీ కూర్చోబెట్టి పాఠం చెప్పాడు కేశవమూర్తి. శ్రీహరి సహజంగా తెలివిగల పిల్లవాడవడంతో చాలా తేలిగ్గా విషయగ్రహణం చేయగల్గాడు. సీతకు సహజమైన తెలివితేటలకంటే పరిశ్రమ అధికమవడంతో మంచిమార్కులతో పాసవుతూండేది.

శ్రీహరి ఆ తరువాత చాలాసార్లు కేశవమూర్తి

ఇంటికి వచ్చాడు. సీత పక్కన కూర్చుని పాఠాలు నేర్చుకోవడంలో అతడో థ్రిల్ అనుభవించేవాడు. సీత సాన్నిధ్యం అతనికెంతో ఆనందాన్ని ఇచ్చేది. శరీరకష్టం వలన సన్నగా, రివటలా, పొడుగ్గా ఎదిగి తెల్లటి శరీరఛాయతో, బుగ్గల్లోగానీ, శరీరంలోగానీ ఎక్కడా అనవసరపు కండలేని సీత అతన్ని ఎంతో ఆకర్షించింది. అందం పురులు విప్పుతున్న వయసామెది. వాస్తవం కాక ఊహ కలిగించే ఆనందంలో విహరించే వయసతనిది.

ఎస్.ఎస్.సి. పరీక్షలు అయిపోయాయి. వేసవి సెలవల్లో వసంత పెళ్ళయింది. వసంత క్లాసు విద్యార్థులూ, విద్యార్థినులూ చాలామంది పెళ్ళికి వచ్చారు. వసంత వచ్చి సీత అక్కనూ, సీతనూ, మాష్టారునూ రమ్మని మరీ మరీ ప్రార్థించింది. కేశవమూర్తికి స్పాట్ వాల్యుయేషను వుండడంతో, తను ఊళ్ళో వుండననీ, రాలేననీ చెప్పాడు. వసంత వచ్చి తనను ప్రార్థించడంతో రాధ అహం తృప్తి పొందింది. తను రాలేకపోయినా సీతను పంపటానికి అంగీకరించింది. "ఒసేవ్ మొద్దూ! అక్కడ అందరితో యికయికలూ పకపకలూ సాగించక మర్యాదగా, బుద్ధిగా వుండు. ఎవరైనా రాధ చెల్లెలు బుద్ధిమంతురాలు అనిపించుకునేటట్లుండాలి" అని చెప్పి పంపింది. పెళ్ళి రాత్రి ఏడున్నరకు. ఎనిమిదిన్నరా తొమ్మిది గంటలకల్లా వచ్చేయాలని చెప్పి మరీ పంపింది రాధ.

ఇల్లు, స్కూలు వాతావరణం దాటి మొదటిసారి స్వాతంత్ర్యాన్ని అనుభవించిన అనుభూతి పొందింది సీత. వసంత పెళ్ళి ఆర్భాటంగానే చేశారు. పైపై పనులన్నీ వసంత క్లాస్‌మేట్స్ నిర్వహించారు. మూహూర్తంకాగానే ఎనిమిది గంటలకల్లా భోజనాలు ఏర్పాటు చేశారు. వడ్డన కార్యభారాన్ని కూడా పిల్లలే వహించారు. ఎప్పుడూ లేనంత చలాకీగా తిరిగే సీతను చూసి శ్రీహరి మనసు ఆనందంతో నిండింది. అన్నం పళ్ళెం వడ్డనకు సీత తీసుకువస్తే "ఉండు సీతా... అన్నంపళ్ళెం నువ్వు మొయ్యలేవు. అన్నం నేను వడ్డిస్తానుగానీ, ఈ నేతిగిన్నె నువ్వు తీసుకో" అని బరువైన వస్తువు లేవీ ఆమె మోయకుండా జాగ్రత్తపడి ఆమె పక్కపక్కనే తిరిగాడు.

పెళ్ళికి వెళ్తోందని రాధ సీత వద్దని వారించినా వినక తన పట్టుచీర కట్టి పంపింది. పెళ్ళికి పట్టుచీర లేకుండా వెళ్తే ఏం బావుంటుంది? రాధ చెల్లెలు మామూలు లంగా ఓణీతో వెళ్తే జనం ఏమనుకుంటారు? అక్క ప్రతిష్ఠను కాపాడే భారం తాను పట్టుచీర ధరించి వహించిన సీతకు, జారిపోతూన్న చీర చికాకు కలిగించింది. వంగి వడ్డిస్తున్నప్పుడు కొంగు విస్తళ్ళలో పడేది.

"అలాకాదు- ఇలా గట్టిగా లాగి బొడ్డులో దోపుకోవాలి కొంగును" అని సలహా ఇచ్చాడు శ్రీహరి- వట్టి చేతులతో అభినయిస్తూ.

"ఏంఅక్కర్లేదు" అంది సీత ముఖంమీద పడ్తున్న ముంగురులను చేత్తో పైకి తోసుకుంటూ.

"చీర పాడవుతుంది మరి. చెప్పినట్లు చేస్తావా? నేసాయం చేసేదా?"

"ఏయ్ మొద్దు" అని అతనన్నంతపనీ చేస్తాడేమోనని తనే కొంగు దోపుకుని వడ్డనకు ఉద్యమించింది సీత.

"ఆఁ అదే ... ఇహ కానీ" అన్నాడు శ్రీహరి.

"సరే ... ఇవన్నీ నువ్వెప్పుడు నేర్చుకున్నావు శ్రీహరీ? చీర కట్టుకోవడం ఎప్పుడైనా ప్రాక్టీసు చేశావా?" అంది సీత.

"నేర్చుకోలేదు కానీ, నిన్ను చూసి ఇప్పుడు నేర్చుకోవాలి" అన్నాడు శ్రీహరి ఆమెవంక చిలిపిగా చూస్తూ.

"ఏంబాగాలేదా? నేనెప్పుడూ పట్టుచీర కట్టలేదు. అక్క వద్దంటే వినలేదు. బుట్టబొమ్మలా వున్నాకదూ?"

"బంగారు బొమ్మలా వున్నావు" అని మంచి నీళ్ల జగ్గుతో బంతిలో వడ్డనకు వెళ్లిపోయాడు శ్రీహరి.

"ఏవిటే గుసగుసలాడుతున్నారు? ఏవంటున్నాడు శ్రీహరి?" అన్నది అటుగా వచ్చిన మంగతాయారు.

"ఏంలేదు" అంది సీత.

"ఓహో ... రహస్యాలు కాబోలు. కానీ ఇట్లా నలుగురి మధ్యకాక అలా తోటలోకిపోయి మాట్లాడుకుంటే ఇంకా చక్కగా వుంటుంది"




"సరే పద ... అలాగే మాట్లాడుకుందాం"

"నాతోనా? నాతో నీకేం రహస్యాలుంటాయి?"

"నువ్వు ఇంతకుముందు రామేశ్వరితో ఏంమాట్లాడొచ్చావు?"

"ఏంలేదు"

"రామేశ్వరి ఎలా మన క్లాస్‌మేటో, శ్రీహరీ మన క్లాస్‌మేటే. పాపం పరీక్షల్లో చదివీచదివీ బుర్రపాడై పాడు ఆలోచనలు వస్తున్నట్లున్నాయి. నేనెవరికీ ప్రేమసందేశాలు పంపించడంలేదు. కాబట్టి నువ్వు నిశ్చింతగా వుండు" అన్నది సీత.

మంగతాయారు తేలుకుట్టిన దొంగలా ఏమీ మాట్లాడలేకపోయింది. ఆమెకు, కృష్ణమోహన్‌కు మధ్య నడిచిన ప్రేమలేఖల విషయం స్కూల్లో పెద్ద గొడవైంది.

పెళ్లయిపోయింది. భోజనాలూ అయ్యాయి. రాత్రి తొమ్మిదిన్నర అయింది. రామేశ్వరీ, మీనాక్షీ మంగతాయారూ- ఎవరూ బయల్దేరేట్లు లేరు. తిరిగి వెళ్లేటప్పుడు వాళ్లతో కలిసి వెళ్దామనుకుంది సీత. వాళ్లు ఎప్పుడు బయల్దేరుతారో?! ఆలస్యమైతే అక్కేమంటుందోనని భయపడుతోంది సీత.

శ్రీహరి దగ్గరికొస్తూ- "పద, నిన్ను మీ ఇంటి దగ్గర దింపి నేవెళ్తాను" అన్నాడు.

ఎవరేమనుకుంటారోనని ఒక్షణం సందేహించింది సీత. ఇంకా ఆలస్యం అయితే అక్క గొడవ చేస్తుంది అని తప్పనిసరిగా బయలుదేరింది సీత. వసంతకు చెప్పి బయటపడ్డారు వారు. రాధ సంగతి తెలుసు కాబట్టి ఆమెని వుండమని బలవంతం చేయలేదు వసంత.

"మంగతాయారుది ఒట్టి కుళ్లుబుద్ధి" అంది సీత దార్లో.

"అదేం?" అన్నాడు శ్రీహరి.

"ఏంరహస్యాలు మాట్లాడుకుంటున్నారు అనడిగింది, ఇందాక మనం మాట్లాడ్డం చూసి"

"ఏమన్నావు?"

"నేనేం ప్రేమలేఖలు రాయడం లేదులే అన్నాను - నోర్మూసుకుంది"

"ప్రేమలేఖలు రాస్తే ఏం తప్పు" అర్థమైనా కావాలనే అడిగాడు.

"తప్పా? తప్పున్నరా? మనం స్కూలుకి ఎందుకొస్తున్నాం? చదువుకోడానికి- ప్రేమలేఖలు రాసుకోడానిక్కాదు"

"కానీ మనుమలం కదా. ఇతర్లపై అభిమానం కలగచ్చు. ప్రేమ కలగచ్చు. దాంట్లో తప్పేముంది? అది మానవసహజం"

"ఏం ... నీకు ఆ మానవ సహజమైన దుర్బుద్ధి పుట్టిందా ఏం? దాన్ని సమర్థిస్తున్నావు?"

"ఆమెని సమర్థించేందుకు కాదుగానీ, మానవ సహజమైంది దుర్బుద్ధి ఎలా అవుతుంది?"

"అది మానవసహజం కాదు, మానవుల బలహీనత"

"బలహీనత కూడా మానవ సహజమేగా. అయితే మీ అక్కకీ, బావకీ నీమీద ప్రేమ వుంటే అది మానవబలహీనతా?"

"అది పవిత్రమైంది. తిరిగి ఏమీకోరని ప్రేమ స్వచ్ఛమైంది. మనమనుకున్నదాంట్లో అలాంటి ప్రలోభం ఏమీలేదని నిర్ధారణ కాలేదుగా"

"నువ్వేమైనా చెప్పు. అందమైనదాన్ని మెచ్చుకోవడంలో, ఆరాధించడంలో, ప్రేమించడంలో తప్పేంలేదని నా వుద్దేశం"

"మంచిదే- మెచ్చుకో, ఆరాధించు ప్రేమించు. కానీ నీకు సొంతం కావాలని ఆరాటపడకు. చెట్టుపై పూసిన పుష్పాన్ని చూసి ఆనందపడు, కానీ కోసి, వాసనచూసి నలిపేయాలనుకోకు. ఆకాశంలో స్వేచ్ఛగా విహరించే పక్షిని చూసి ఆనందించు - కానీ తుపాకీతో కాల్చిచంపి భక్షించాలని ఆశపడకు" అంది సీత.

"బావుంది. నీది మరీ వెజిటేరియన్ ప్రేమలావుంది. మరి నాన్‌వెజిటేరియన్ల మాటేమిటి?"

అతని మాటలకు నవ్వింది సీత. ఇంత హాయిగా, స్వేచ్ఛంగా ఆమె నవ్వగా అతనెప్పు

డూ చూళ్లేదు. శ్రీహరి మనోగగనంలో వేయితా రలు విరిశాయి. కోటి దీపాలు వెలిగాయి.

మాటల్లో ఇంటికొచ్చేశారు ఇద్దరూ. సీత వీడ్కోలు తీసుకుని ఇంట్లోకి వెళ్లిపోయింది.

వేసవి సెలవులు అయిపోయి మళ్లీ స్కూళ్లూ, కాలేజీలు తెరిచారు. ఇంటర్మీడియట్‌లోకి ప్రవేశించిన సీత ఉత్సాహంగా వుంది. మునుపంతా ప్రపంచాన్ని భయం భయంగా చూసిన సీత నిజానికి ప్రపంచం అంతా భయంకరం కాదనీ, అందమైనదనీ, సుఖప్రదమైందనీ భావించసాగింది. సెల్ఫ్‌పిటీ అంత దౌర్భాగ్యం మరొకటి లేదని చెప్పాడు కేశవమూర్తి. "నీకంటే కష్టాలు పడేవాళ్లూ, రోజంతా తిండిక్కూడా నోచుకోనివాళ్లూ, వంటిని పూర్తిగా కప్పుకునేపాటి బట్టలు కూడా లేని నిరుపేదలు అనేకమంది వున్నారు. నీ పరిస్థితి అంత ఘోరమేం కాదు" అని నచ్చజెప్పాడు. సీతకి కొన్ని అర్థమయ్యాయి, కొన్ని కాలేదు. అక్క తిట్టినా ఆ క్షణానికి బాధేసినా ఇప్పుడామె మనసు దాని గురించి ఆలోచించడంలేదు. అలవాటైపోయింది. మునుపటి అమాయకత్వం తగ్గింది.

వేసవి సెలవుల్లో నవలలూ, నాటకాలూ, పత్రికలూ చదవమని కేశవమూర్తి ప్రోత్సహించేవాడు. అయితే క్లాసు పుస్తకాలు తప్ప మరేవి చదివినా చెడిపోయినట్లుగా భావించే రాధ ముందు ఆ పుస్తకాలు చదవగలిగేది కాదు సీత.

కిందటి సంవత్సరం లాగానే శ్రీహరి ఇంకా మిగతా విద్యార్థులూ అప్పుడప్పుడు కేశవమూర్తి ఇంటికి వచ్చిపోతున్నారు. సీత అక్షరాలు కుదురుగా, పొందిగ్గా వుంటాయి. శ్రీహరి ఆమె దస్తూరిని మెచ్చుకునేవాడు.

"మాబావగారు సరిగ్గా రాయకపోతే ఊరుకోరు. రాయడం నేర్చుకున్నది, మానవుడు కనిపెట్టింది తనకోసం కాదు, ఇతరులకోసం అంటారు బావ. మనిషి తన భావాలను వ్యక్తపరచడానికి భాష కనుక్కున్నాడు. ఎదుటవున్న వ్యక్తితో అయితే సంభాషించవచ్చు. కానీ ఎదుటలేని వ్యక్తితో మాట్లాడాలంటే రాయడం తప్పవేరే మార్గం లేదుకదా! రాత నేర్చుకోవడం వల్ల మానవాళికి ఎంతమేలయింది? పురాతన కాలపు మేధావులతో కూడా పరిచయం ఏర్పరచుకోగలుగుతున్నాం అంటారు బావ. అందుకే బాగా రాయకపోతే ఊరుకోరాయన" అనేది సీత. తాను సంభాషించేటప్పుడు బావను ఏకవచనంతో సంబోధించి మాట్లాడినా, ఇతరులతో చెప్పేటప్పుడు మాత్రం కేశవమూర్తిని గూర్చి గౌరవవాచకాలు వాడేది సీత.

ఇంటర్ ఫస్టియర్ పరీక్షలు దగ్గరికొచ్చాయి. విద్యార్థులంతా ఊపిరిసలపని దీక్షతో చదువుతున్నారు. రాధ కూడా ఏమనుకుందో సీతకు ఎక్కువ పనిచెప్పకుండా చదువుకోనిచ్చింది. కేశవమూర్తి దృష్టి అంతా వాళ్ళమీదే కేంద్రీకరించాడు. పరీక్షలు అయిపోయాక అందరూ "హమ్మయ్య" అని నిట్టూర్పులు విడిచారు.




సీతను కాలేజీలో డిగ్రీ మొదటి సంవత్సరంలో చేర్పించిన నెలరోజులకు కేశవమూర్తికి కడప బదిలీ అయ్యింది ప్రమోషనుపై. అనుకుంటున్నదే కానీ ఇంతత్వరగా వస్తుందనుకోలేదు కేశవమూర్తి. ప్రయివేటుగా ఎమ్.ఎ పాసై డిపార్ట్‌మెంట్‌కు తెలియపరిచాడు. జూనియర్ కాలేజీ లెక్చరర్‌గా ప్రమోట్‌చేసి బదిలీ చేశారు. అయితే కేశవమూర్తి ఫామిలీని కూడా అక్కడకు మార్చాలనుకోలేదు. సీత చదువు మధ్యలో డిస్టర్బ్అవడం అతనికి ఇష్టంలేదు. రాధను, సీతను అక్కడేవుంచి సెలవుల్లో తను వస్తూపోతూ వున్నాడు.

బావ ట్రాన్స్‌ఫర్‌మీద వెళ్ళిపోయిన తరువాత సీతకు శూన్యంలో వున్న అనుభూతి కలిగింది. అక్క తననిప్పుడు అంతగా బాధించడం లేదు. 'పుర్రెలో పుట్టిన బుద్ధి'

అన్నట్టు అప్పుడప్పుడు తిట్టినా సీత అంతగా మనసున పెట్టుకోవడం లేదు. అతను వున్నంతవరకు తానతనిని గుర్తించలేదు. వెళ్ళిపోయిన తరువాత మనసు బావకోసమే ఎదురుచూస్తోంది. తనేదీ అడక్కపోయినా తనకెప్పుడేది అవసరమో అతను సమకూరుస్తుండేవాడు. ఇప్పుడు తనను పట్టించుకునేవాళ్ళు ఎవరూ లేరు. అతనిది అందమైన హృదయం. "నల్లగా, గేదెలాగా వుంటారని" అక్క అప్పుడప్పుడూ వెక్కిరించినా సీతకు అలాంటి మృదుహృదయుడు ఎక్కడా కనిపించలేదు. ఆమె అతన్ని శారీరకంగా ఎన్నడూ పరిశీలించి చూడలేదు. హృదయంతో కొలిచింది.

రాధ సీతకు సంబంధాలకై ప్రయత్నిస్తున్నది. ఒకసారి కేశవమూర్తి చిన్న మేనత్త వచ్చినప్పుడు రాధ ఆమెని సంబంధాల విషయం ఏమైనా తెలిస్తే చెప్పమని అడిగింది.

"అమ్మాయి... నువ్వేమనుకోనంటే ఓమాట చెప్తాను- దీనికీ మీ ఆయన చేతే మూడుముళ్ళూ వేయించరాదూ? నీకా పిల్లల్లేరు.. దాని కడుపునయినా ఓకాయకాస్తే వాడివంశం నిలుస్తుంది" అంది.

"సర్లేండి... అలాఅయితే ఇంకేం? నేచెప్పిచూశా, ఆయన ఒప్పుకోరు" అన్నది రాధ సమాధానంగా.

ఈ సంభాషణంతా వింటున్న సీత మనసులో తొలిసారిగా బావను తన వరుడిగా ఊహించుకుంటే, ఆమెకేమీ జగుప్స కలగలేదు. ఇప్పుడు తనకు అర్థమైనట్లన్పించింది. బావరాకకై తన మనసెంత పరితపిస్తున్నదో? ఇది ప్రేమా? ప్రేమంటే ఏమిటి? సాన్నిహిత్యం వల్ల కలిగే బంధమేనా? ఇందులో శారీరక సంబంధానికేమీ ప్రాముఖ్యత లేదా?- అన్నీ ప్రశ్నలే. ఊహల హరివిల్లు విరుచుకుంటే అన్నిరంగుల్లోనూ కేశవమూర్తే కన్పించేవాడామెకు. కేశవమూర్తి ఇచ్చిన డైరీ అంతా ఇప్పుడు కవిత్వంతో, మనోమథనంతో నింపుతున్నదామె. ఒకోసారి తన కవితల్ని తనే చదువుకుని ఎంతబాగా రాస్తున్నాను అనుకునేది. 'ఇదంతా బావ ఇచ్చిందే' అనుకుని ఆమె మనసు కృతజ్ఞతతో నిండిపోయేది.

పాఠ్యభాగంగా చదువుకున్న రవీంద్రనాథ్ టాగూర్ కవితొకటి గుర్తుకు వచ్చిందామెకు.

"ఏపుష్పాల పూజించను నిన్ను?
పూలన్నీ నీవు సృజించినవేనాయె
ఏజలాల అభిషేకించను నిన్ను?
తలపై నిడుకున్న గంగను భువినొదిలినది నీవాయె

హృదయమర్పణ చేసి పూజింపతలతు,
అదియు నీదేనాయె నేనేమిజేతు

అని టాగూర్ని అనుకరిస్తూ కవితను తన డైరీలో రాసుకుంది. అదే గీతాన్ని కాపీ చేసి కేశవమూర్తికి పంపిస్తూ మూలాన్ని కూడా జతచేసింది. కేశవమూర్తి జవాబు రాశాడు.

"నీ అనువాదం బావుంది. ఇంకా రాయి... ఇంకాబాగా రాయి. నువ్వు రాసిన కవితలో చివరి విరుపు తళుకుమనేటట్లు, హృదయ స్పందన కలిగించేటట్లు వుంది. అలా లేనప్పుడు నీరసంగా పదాలు పేర్చడం కవిత్వం కాదు. నువు రాసిన కవిత థీమ్‌లోనే తత్వం 'ఏమి సేతురా లింగా?' అన్నది కూడా వున్నది. నువ్వు విన్నావా? ఇంకా చదువు, ఇంకా తెలుసుకో... మరిన్ని రాయి.

"నేను సంక్రాంతి సెలవలకు రావడం కుదరదు. వీలయితే రెండురోజులు సెలవుపెట్టి ఫిబ్రవరిలో వస్తాను. మీఅక్కకు కూడా ఉత్తరం రాస్తున్నాను. చదువు అశ్రద్ధ చేయవద్దు. నీకు ఇదివరకు చెప్పిన పద్ధతిలో ప్రణాళికవేసుకుని బాగా చదువు"

సీతకు రాసే ఉత్తరాలన్నీ కేశవమూర్తి కాలేజీ అడ్రసుకే రాస్తాడు. ఆరోజు ఉత్తరం చూసుకున్న సీతకు కేశవమూర్తి రానని రాయడంతో నీరసం ఆవహించింది. నిరుత్సాహంగా, శూన్యంగా అన్పించింది. నిస్త్రాణగా అందరూ పోయినా, ఇంటికి కదలకుండా కూర్చున్న సీతను పలకరించాడు శ్రీహరి.

"ఏంసీతా... ఈరోజు ఇంటికి పోవాఏం?"

"పద వెళ్దాం" అన్నది సీత నీరసంగా ఉత్తరాన్ని పుస్తకంలో పెడ్తూ.




"ఏం ఉత్తరం అది?" అన్నాడు అతను.

"బావ రాశాడు. సంక్రాంతి సెలవలకు రాడట"

"నాకూ రాశారు మాష్టారు. కంగ్రాట్స్... నీకవిత బాగుంది"

"నాకవితా? ఏకవిత?"

"అదే నువ్వాయనకు రాసి పంపించినది. ఆయన నాకు దాన్ని కాపీచేసి పంపారు. 'నీకెలాగుందో, నీ అభిప్రాయం రాయవోయ్' అని రాశారు."

"మరి సమాధానం రాస్తున్నావా?"

"ఆ రాస్తాను... ఇకనుండీ నువ్వు రాసే కవితలు నాక్కూడా చూపించు. నువ్వు రాస్తావని నాకు తెలీదు"

"నాకూ తెలీదు. నిన్నింక ఆ దేవుడే కాపాడాలి"

"అదేం?"

"కవులు ఈ వీధిలో వస్తుంటే ఆ వీధిలోంచి పారిపోతారట జనం. నువ్వేమో చిత్రంగా కవితలు చూపమంటున్నావు"

"మరి అలాంటి కవులనుండి జనం పారిపోకేం చేస్తారు? నీకా భయం లేదులే- నువ్వు బాగా రాస్తావు"

"తప్పుతుందా? మొహమాటానికి ఏ మాటలైనా మాట్లాడాలి"

"చూశావా... నిజం చెప్తే బతికే రోజులు కావివి"

"పోన్లే... అబద్ధాలే చెప్పు."

"ఓ కవయిత్రీ! నీ కవితామృతము గ్రోలి అమందానంద కందళిత హృదయారవిందుడనైతి. ఈ ఆనంద రసపారవశ్యము మ్రోల ఆ స్వర్గ సౌఖ్యములేపాటి? సురలు గ్రోలు అమృతము త్రావ మనసిచ్చగింపకున్నది. ఆ రంభా పరీరంభ సౌఖ్యము నీ కవితాకన్య కౌగిలి మ్రోలతుచ్ఛము. కవులను పైకెత్తివేసే అతిశయోక్తి ఇది."

"ఊ... అదే చెప్పు వింటాను"

"ఓ కవయిత్రీ మణీ! నీ కవితాఝరీ వేగమున అతల, వితల, సుతల, తలాతల, రసాతల, పాతాళ లోకాదులకుంజనినామ నీవు భువిపై అవతరించి వున్న హేతువు తిరిగిరాను ఇచ్చగింపకున్నది"

అతని మాటలకు సీత ఫక్కున నవ్వింది

"నీవూ కవివే శ్రీహరీ... ఓ కవిత చదవరాదూ?" అన్నది నవ్వును అణచుకుంటూ.

"నువ్వు పారిపోనంటే, నాకేం అభ్యంతరం లేదు"

"నాకా భయం లేదులే... కానీ"

"సరే... విను- ఇంతకుముందు రాసుకున్నదే"

"ఆ తంద్రిల స్వప్నాంచలాల వదల లేక
తన్వంగి
మరి ఏమె! తల పంకించుచు నుండె
కలల వలపు తలపులు వదలలేదామె
మరుల విరుల మధువులై విరిసెనేమె
ఆమె తల ఎత్తి చూచె నొక్కసారి
కమలాలు విరిసె కథలు పరిమళించె
స్వప్న రాగపు వీణియె మీటె సరాగమై
ఆ కనుగంటి చూపులో కోటి స్వర్గాలు
ఆ కనుగవల చూపులో కదలిపోయాయి
ఎదలోన మెదలెనేదో భావ వీచిక
భావనా లోకపు బరువు భరింపలేదా బ
కనులు మోడ్చి మరియేమొ కాన్చుచు
మొగమెత్రనయ్యే మరుని మధువు మా
ఏమి ఆలోచనలో, ఏమి భావనలో
తెలియంగరాదు ఆమె వలపు తలపు
వచ్చి పోయెడి నెలరాజు నేను కాదొకో
ఆ తంద్రిల స్వప్నాంచలాల వదలలేక
తన్వంగి

"బావుంది... విరహగీతంలా వుంది, మలో పడ్డావా ఏంఖర్మ?" అన్నది సీత నవ్వుతూ.

"అవును... పడ్డాను. నడుం విరిగిం హాస్యంగా అన్నాడు శ్రీహరి"

"ఒళ్ళు కొంచెం జాగ్రత్తగా కాపాడుకో, ఎందుకైనా మంచిది. ప్రేమలో పడ్డవాళ్ళ సంగతి చెప్పలేం"

"ఏమో... ఎవరు చెప్పగలరు? ఒక శర



ండై, మూడై, నాలుగై, ఇక ఫుల్‌స్టాప్.
మంటే ఫామ్లీప్లానింగ్‌వాళ్ళు జైల్లోపెట్టేస్తారు''

''అబ్బో... పెద్ద ప్రణాళికలోనే వుండే అబ్బా
ంగారి పథకం''

''ప్రణాళికలన్నీ పెద్దగానే వుండాలి. ఊహా
రిద్ర్యం మన వంటికి పడదు'' అన్నాడు
ిపిగా నవ్వుతూ.

బావ రానని రాసిన ఉత్తరంవల్ల కల్గిన
్వేదం శ్రీహరి సంభాషణతో అంత
ించింది. మళ్ళీ ఏదో ఉత్సాహం, ఉద్వేగం.
ంటరిగా వుంటే తిరిగి నిరుత్సాహం, వేదన,
క్షణ. ఆరోజు రాత్రి సీత తన డైరీలో ఇలా
ుకుంది-

''నీవు రావైతివేమి నా స్వామి?
ఈ అనంత నీరవ నిశ్శబ్ద ప్రకృతిలో
ఒంటరినైన వేళ
నా కోటి స్వర్గాల వెలుగు
కనుచీకటైనవేళ
తమిలో కనురెప్పలు మధుర భావాలతో
బరువైన వేళ
ీవు రాక వాడి వత్తలైన విరులు
వ్యథనొందేటివేళ
ఈ శీతల జ్వాల నన్ను దారుణంగా
దహించువేళ
ీవు రావైతివేమి నా స్వామి''

్రీహరి ఆరోజు డైరీలో రాసుకున్నాడు.

'ఏడు మల్లెల ఎత్తు నా రాణి
ెదలోని మాట ఎరుక యేలే నాకు
ూటాడునా మురిపెమ్ము లేక
వ్వునా హృదయతంత్రుల తాళమ్ము లేక
ేక, పికముల రవళి కన్న
ెలి పలుకులె నాకు మిన్న
ెన్నెలు, వెన్నెల సైతము చిన్నబోయె
ఈ కన్నియ చిరునవ్వు ముందు
ేవేల తారల గూడి
ెలరాజు వెలవెలబోయె
క్కని చుక్కా... నీ పక్కన
ునుండి రారాజై వెలిగితిపో''

ారోజంతా సీత మనసు ఏదో పోగొట్టుకున్న
బాధతో నిండిపోయింది. ఆమె పదేపదే
అనుకుంది- 'బావదగ్గరున్నప్పుడు ఎప్పుడూ
కలగని ఈ విచిత్ర భావపరంపర ఇప్పు
డెందుకు కలుగుతోంది? అందనంత దూ
రంలో వుంటే మరీ అందంగా కన్పిస్తుందా?
దూరమైనకొద్దీ ప్రేమ పెరుగుతుందా?'- అని.

ఆమె హృదయసంద్రంలో కవితాలహరు
లు చెలరేగాయి.

''ఎదురుగ నీవు వున్నంతసేపూ
భావోద్రిక్తత లుప్తమైనది
నువ్వు కనుమరుగైనంతనె
నీ తలపుల కడలి
నాలోన పొంగిపొరలి
అశ్రుకెరటాలు ఎగసిపడుతున్నాయి
నీదన్నది ప్రతిదీ నాకెంతో ప్రియమై
నీ చెలిమే నా ఊపిరియై
నీ హృదియే నా సంపదైనది
నిన్ను చూస్తే మెరిసే కళ్ళు
స్మరిస్తేచాలు మురిసే మనసు
నీ కలస్వనానికై విప్పారిన వీనులూ
నా చేరువకే స్పందించే హృదయం
ప్రేమకి నిర్వచనం చెప్తాయి
నన్ను విడిచి నువ్వు ఎంతదూరమేగినా
నీ స్మృతులుమాత్రం నాతోనే వున్నాయి
నువ్వున్నా లేకున్నా నాలోనే వున్నావు
కానీ నిను కనని కన్నులలో
కన్నీటిధారలు కదలాడాయి
ఏ పనిలో నేను లీనమైతిననుకున్నా
తెలియని కల్లోలమే చెలరేగింది''

అలా రాసి తనే చదువుకుంది. ఆమెకవి
బాగానే అన్పించాయి. అదీగాక గుండెలోని
బాధకి అక్షరరూపం కల్పించేసరికి ఒకవిధ
మైన ఓదార్పు లభించినట్లు అనుభూతి
చెందింది. సీతకి ఇంకా రాయాలనే కుతూ
హలం కల్గింది. ఇంకా ఇట్లా రాసింది-

''నీకు నేను ఏమీకాను
కానీ నాకు నువ్వే అన్నీ
ఎక్కడున్నా ఎప్పుడయినా
నినుగూర్చిన ఆలోచన
నను వీడనంటుంది
కన్నుమూసినా తెరచినా
నీ రూపదీపమే వెలుగుతుంది
ఎందుకో ఇంత మక్కువ నీపై?
ఈ హృదికి ప్రేమకైపెక్కనేమి?




నిన్ను మించిన సౌందర్యం
ఇంకెందులోనూ గోచరించదు
ఎందులోనూ లేని అందాన్ని
నీయందే పొందుపరిచెనో
లేక నీ ప్రేమ మురళికి మాత్రమే
నా హృదయం స్పందించునో
నీడెందము నాదౌతుందనే
నీ ప్రేమ మధువును గ్రోలుతాననే
కలల వెలుగులోనే బ్రతుకుతున్నా
నిరంతర నిరీక్షణాంధకారంలోనే
నా జీవితరథం సాగుతోంది
నీ అశ్రద్ధా సంద్రాన్ని
సహననౌకతో దాటేందుకు
ఒపినంత యత్నిస్తున్నా
అయినా అనుకోని నీ పిడుగుబాటు
ఎడబాట్ల ఆటుపోటులకి
అది మునిగిపోతుందనే
సందేహం కలుగుతోంది
నీ ప్రేమతీరాన్ని చేరతాననే
ఆశ ఎందుకో సన్నగిల్లుతోంది
ఎదురుచూపులు బరువుకి
మెద కృంగిపోతోంది''

ఈ కవిత కాపీచేసి కేశవమూర్తికి పంపింది
. అతడు ఆమెను ప్రోత్సహిస్తూ తిరుగుట
ో జవాబు రాశాడు. ఆమె ఏమిరాసినా
టనే బావ విమర్శకై పంపేది. అతడెప్పు
- వాస్తవికతవేపు కూడా దృష్టిబరపమని
్రం రాసేవాడు.

ఆరోజు క్లాసెస్ అయిపోయినా రోజూ మాది
 హడావిడిగా పరిగెత్తక కాలేజ్‌గ్రౌండ్‌లో
్రకమీద కూర్చుని ఒళ్ళో పుస్తకాలు పెట్టు
ు దిగులుగా ఆలోచిస్తూ ఒక చేతిలో కా
తం పట్టుకుని మరోచేత్తో పెన్నుతో లయాత్మ
గా చెక్కిలిపై కొట్టుకుంటోంది.

'ఏవిటి దీర్ఘాలోచన? కలల్లో తేలిపోతున్న
న్నావు?'' అంటూ వచ్చి ఎదురుగా కూర్చు
డు శ్రీహరి.

'అంతేగా మరి. నిజంగా పొందలేనివి
ల్లోనేగా సంతృప్తినిచ్చేది'' అన్నది సీత.

'దేవతలు పొందలేనివి ఏముంటాయ

బ్బా? ఏదో నావంటి నిర్భాగ్యులకైతే అనుకోవ
చ్చుగానీ''

''చాల్లే జోకులు. మీ మగవాళ్ళెప్పుడూ ఇంతే. ఇవాళ దేవతలంటూ ఆకాశానికి ఎత్తుతారు, రేపు దెయ్యమంటూ ఎత్తికొడతారు. బెట్టు చూపితే బతిమలాడతారు, కోరి దరికి చేరబోతే చులకన చేస్తారు'' అంది.

''బాప్రే... ఏమి ఈ శూలములబోలు పలుకుల శరపరంపర? బంగాళాఖాతంలో వాయుగుండం వడ్డట్లు సీత మనసులో ఏమిటా దుమారం చెప్మా'' అని చెక్కిలిమీద చేయుంచుకుని ఆశ్చర్యపోయినట్లు నటించాడు శ్రీహరి.

''ఆఁ ఆఁ... ఒక్క సీతేం ఖర్మ? ప్రతి భావోద్రిక్తతగల మనిషికీ చివరికి మిగిలేది శోకమే''

''నిజమే... ప్రతిదానికీ కొన్ని అవధులుంటాయి. సముద్రానికి చెలియలికట్టుంది. అవి దాటితే అవస్థలు తప్పవు. ఇంతకీ ఇప్పుడు నీకొచ్చిన కష్టమేంటి? చెప్పు... చిటికలో తీర్చేస్తా'' అన్నాడు శ్రీహరి.

''ఓసోస్... మాటలు కోటలు దాటడం అంటే ఇదే. అయినా నా సమస్య ఎటువంటిదో తెలియకుండా నీకంత ధీమా ఏంటి?''

''ప్రతి సమస్యకూ ఏదో పరిష్కారం ఉంటుంది'' అన్నది నా పాలసీ. అదేదో చెప్పరాదా?''

''కొన్ని బాధలు ఒకరికి చెప్పలేం. రహస్యాలు... ఛఛ... ఊరికే అన్నా నిజమనుకోకు. ఏం లేదు... అంతా తమాషా''

''ఆడవారి మాటలకి అర్థాలే వేరులే! అద్సరే... చేతిలో ఆ కాయితం ఏంటి? ఏదో కవితా కుసుమంలా ఉందే- ఇటివ్వు''

''ఆఁ... కవితే- ప్రస్తుతం కాయితం మీదుంది కాబట్టి కాయితమ్మువ్వాందామా? ఇస్తాను కానీ, చదివి నిర్మొహమాటంగా ఎట్లావుందో చెప్పాలి మరి''

''దానికేం భాగ్యం? నువ్విట్లా కవిత్వం దంచేస్తోంటే త్వరలో నేనో గొప్ప క్రిటిక్‌నైపోతా''

సీత అందించిన కాగితం తీసుకుని శ్రీహరి చదివాడు. అందులో ఓ చిన్న కవిత ఉంది-

''ఏమేమో మధుర భావాలు




నీ మీదే సాగుతున్నాయి
నా అణువణువూ మౌనంగా
నిన్నే ధ్యానిస్తుంది సదా
నా మానసవీణని మీటి చూడు
నా స్మరణా గానం వినిపిస్తుంది
నా కనుల మునులని అడిగిచూడు
నిరంతర నిరీక్షణ ఫలించెనంటారు
నా శ్రవణ పేటికలు తెరచి చూడు
నా పలుకుల సరిగమలే కనిపిస్తాయి
నాపాద నదులని ప్రశ్నించు
నీ సన్నిధే తమ గమ్యమంటాయి
నా గళకోయిలని పలకరించు
అనంత అనురాగాలు ఆలపిస్తుంది
నా తనుర్లతని స్పృశించిచూడు
పులకరింతల పూలు గుబాళిస్తాయి
అయినా ఏమి ప్రయోజనం
ఎవరికి నివేదించుకోనీ వలపు పూలమాల
నీ కఠిన కర్కశ శిలా హృదిపై
తల మోదుకుని గతించె నా ప్రేమ విహంగం''

''ఓ మైగాడ్'' అన్నాడు వత్తి వత్తి పలుకుతూ, చిలిపిగా నవ్వుతూ శ్రీహరి.

''దేవుడేదో నీ స్వంతమైనట్లు''

''నువ్విహ కవుల కేటగిరిలోకి చేరిపోయినట్లే''

''ఎగతాళి చేయకులే- ఏదో తోచీతోచని పిచ్చిగీతలు. అసలు నిజం చెప్పాలంటే కవిత్వానికి నిర్వచనం అయినా తెలీదు'' అన్నది సీత సిగ్గుపడుతూ.

''అతి వినయం ధూర్త లక్షణం అంటారు''

''నేనేం వినయ విధేయతలు ప్రదర్శించేందుకు అలా మాట్లాడంలేదు. నిజం చెప్తున్నా శ్రీహరీ. అట్లా రాయాలన్పించింది, రాశాను, అంతేతప్ప అదసలు కవితో కాదో నాకే సందేహం''

''నేను చెప్తున్నా, నిస్సందేహంగా అది కవిత్వమే. నీలో ఇంత ప్రతిభ ఉందని నేనెప్పుడూ అనుకోలేదు. అయ్యబాబోయ్... ఇకమీదట ఈ కవయిత్రితో జాగ్రత్తగా మసలుకోవాలి, లేకుంటే నన్ను తిడుతూ కవిత్వం రాసేయగలదు''

''హాస్యంకాదు, నిజం చెప్పు శ్రీహరీ! గొప్పగా లేకున్నా ఫర్లేదా? అంటే నేనూ కవిత్వం రాయొచ్చా? లేకుంటే జనాల్ని బాధించడమే ఔతుందా? బావకు కూడా రాసిపంపుతున్నా. అయితే ఆయనకి ఎన్ని కవితలు పంపినా ప్రోత్సహించడమూ, వాస్తవికతను, ప్రపంచాన్ని నిశితంగా పరిశీలించమనే తప్ప వేరేగా విమర్శించడు. నాదేం కవిత్వమో నాకర్థంకావడంలేదు''

''అబ్బబ్బా... బొత్తిగా సెల్ఫ్ కాన్ఫిడెన్స్ లేదే నీకు? వస్తున్నా, ఛస్తున్నా వంటి ప్రాసాక్షరాల పదాలు పంక్తికి పదిసార్లు ప్రయోగించి అదే కవిత్వమని డబాయించి, కవులుగా చెలామణీ అవుతున్న ఈ కాలంలో నువ్విలా మాట్లాడుతున్నావా?''

''అన్యాయం శ్రీహరీ... అసలు నా భయమే అది-నేనూ ఆ బాపతు కవయిత్రినౌతానేమోనని. రాసే సత్తా లేకపోతే చేతులు ముడుచుకుని కూర్చోవాలే తప్ప అడ్డమైన చెత్తా రాసిపడేసి జనాలని చెండుకుతినకూడదు. పనికిమాలిన వాళ్ళంతా రాయడం మొదలుపెట్టడానే 'కవి' అనే పదమే ఒక తిట్టుగా తయారయింది'' అన్నది సీత ఆవేశంగా.

''నిజమే... సరిగ్గా నా ఉద్దేశమూ అదే. ఈ సందులో కవిని చూసి ఆ సందులోంచి పారిపోయేట్లుండకూడదు. సోకాల్డ్ పోయెట్సంతా ఇప్పుడదే దుస్థితిలో ఉన్నారు. కానీ నువ్వట్లా కాదు నీలో రాసే శక్తుంది. కాలాన్ని వృధాచేయకు. నువ్వింకా రాయాలి. సృజనాత్మక శక్తి ఒక ప్రవాహంలాంటిది, దాన్ని సాగనిస్తే ఎప్పటికయినా మహాసముద్రాన్ని చేరచ్చు, ఆటంకం కల్గితే ఆగిపోతుంది''

''శ్రీహరీ! నీ మాటలు వింటుంటే నాకు నిజంగా భలే ఉత్సాహంగా ఉంది. నాకేంటో వెర్రి ఆనందంగా, మనసు గాల్లో తేలిపోతున్నట్లుంది''

''అది సహజమేలే. బేకన్ అనుకుంటా అంటాడు- 'విత్తనం పాతితే మొలకెత్తి వృద్ధి పొందుతుంది, కానీ ప్రతిభ విత్తనం కాదు' అని ఎంతో చక్కగా చెప్పాడు కదూ? అశ్రద్ధ చేస్తే నిష్ఫలం అవుతుంది. నామట్టుకు నాకేమన్పిస్తుందో చెప్పనా?'' అని స్టైల్‌గా ఓ క్షణం



ఆగాడు.

"ఊఁ... చెప్పూ" అంది సీత నవ్వుతూ.

"ప్రతిభని విత్తనమే అందాం కాసేపు. కానీ ఆ ప్రతిభాబీజం మొలకెత్తి వృద్ధిపొందాలంటే ప్రోత్సాహం అనే నీరు అత్యంత అవసరం. గుర్తింపు అనే ఎరువు కూడా దొరికితే మరీ మంచిది"

"భలే చెప్పావు శ్రీహరీ! ఈరోజు అబ్బాయి గారు మంచి హుషారుమీదున్నట్లున్నారు"

"మనమెప్పుడూ జోరుగా, హుషారుగా, నిషాగా, తమాషాగానే వుంటాం. నీరసం మన శరీరానికి పడదు"

"రెండ్రోజులు తిండిమానేసి, అప్పుడను ఈమాట- ఒప్పుకుంటాను" అంది సీత.

ఆతర్వాత ఇద్దరూ ఇళ్ళకి బయల్దేరారు.

ఆరోజు సీత ప్రేమోద్రేకపు బరువుభారాల నిట్టూర్పులతో కేశవమూర్తికి ఒక పెద్ద ఉత్తరం రాసింది. అందులో రెండు కవితలు కూడా

జతచేసింది-

"గులాబీ రేకకీ బంగారు రేకుకీ
తేడా తెలియని జడుడివి నువ్వు
నీమీది అవ్యాజానురాగంతో
విరహపు నరకంలో వేగిపోతూ
రాగ నీరాజన సమర్పణకై నిరీక్షిస్తూ
శరుడి పాదంకింద కుసుమంలా
నీ నిర్లక్ష్యానికి బలైపోయా
గమనించే దృష్టిలేకుంటే
స్పందించే హృదయం లోపిస్తే
అన్నీ శూన్యంగానే కన్పిస్తాయి
ఎందులోనూ అందం తెలియదు
విలువ తెలియని వారికి
రత్నమైనా రాయైనా ఒకటే"

"రాతినేలలో పాతాను
నా సర్వసంపదలైన
ప్రేమ విత్తనాలని
అవి నిరుపయోగమై
నిట్టూర్పులు మిగిల్చాయి
ఒకనాటి నా జీవన నందనవనం
ఇవుడు ప్రేమ బీజాలు కరువై
మరుభూమిగా మారింది.
చెలికాని చెలిమి మొలకలు నిలిపితే
కలకల స్నేహఝురులు ప్రవహిస్తే
ఈ తడారిపోయిన ఎడారే
కళకళలాడే బృందావనమౌతుంది"

ఉత్తరం అంతా రాశాక చివర్లో ఇంకా ఇట్లా రాసింది సీత కేశవమూర్తికి.

"బావా... ఈమధ్య నాకు బొత్తిగా మనస్థిమితం లేకుండా వుంది. దేనిమీదా శ్రద్ధాసక్తులు లేకుండా పోతున్నాయి. ఎందులోనూ మనసుని కేంద్రీకరించలేకపోతున్నా. ఆఖరికి చదువులో కూడా. బలవంతాన చదివినా బుర్రకెక్కడంలేదు. నిరాశా, నిస్పృహా, నిరుత్సాహం, నిట్టూర్పులు- వీటినుండి నాకు విముక్తి లేదా అన్పిస్తుంది.

"నా కవిత్వం మరీ కపిత్వంలా వుందా? మాటిమాటికీ ఏదో ఒకటిరాసి వేధిస్తున్నానా? నీ ప్రోత్సాహవచనాలే అందుకు సహకరిస్తున్నాయి. శ్రీహరి కూడా శాయశక్తులా మెచ్చుకుంటుంటాడు పాపం. కవిత్వంలో పరిపక్వత లేదని నిశ్చయంగా తెలుసు. కానీ నువ్వు చెప్పినట్లు దాన్ని అభివృద్ధిపరచుకునేందుకు తోచిందేదో రాస్తూ ప్రయత్నిస్తున్నాను. అయినా నా కవితలుచూసి, నువ్వేమనుకుంటావోనని నాకు విపరీతమైన భయం కలుగుతోంది. వయసుని మించిన ఊహలని నాపైన పిచ్చి ఇంప్రెషన్ కలగలేదుగదా? కాల్పనిక కవిత్వానికి కాలం చెల్లిందని తెలుసు. అయినా చంప లేనిది కాల్పనికత, కాదా?! భావకవిత్వంమీద నీ అభిప్రాయం తెలియజెయ్యి.

"నువ్వు వీలైనంత త్వరలో వచ్చేందుకు ప్రయత్నించు- నా ఉత్తరం అందగానే జవాబురాయి"

కేశవమూర్తినుండి తిరుగుటపాలో జవాబొచ్చింది. అందులో కొంతభాగం ఇట్లా వుంది:

"నువ్వూ పెద్దదానివి అవుతున్నావు. నీకు నువ్వు ఆలోచించి నిర్ణయాలు తీసుకునే వయసొచ్చింది. అలాంటప్పుడు వయసుకి మించిన ఊహలని నేనెలా అనగలను? ఇదేనా నువ్వు నన్నర్థం చేసుకుంది?

పోతే సాహిత్యంపట్ల అభిరుచి కలగడమే కాక స్వయంగా నువ్వూ సాహిత్యాన్ని సృష్టించ గలగడం అంటే నీకా ప్రతిభవుండటం నీ అదృష్టం. భావకవిత్వం రాస్తున్నావు, సరే- మంచిదే. ఈ వయసులో అది సహజమే కాబట్టి అదే బాగా రాయగలవు. నీ కవిత్వం బాగుంది. సానపట్టినకొద్దీ వజ్రం మెరుస్తుంది. అట్లాగే ఇంకా పదును పెట్టు. మంచిపుస్తకాలు మరీ మరీ చదువు, అప్పుడు పరిపూర్ణత చేకూరుతుంది. కేవలం ప్రతిభ వున్నంతలో సరిపోదు. ముఖ్యంగా వ్యుత్పత్తి, తర్వాత అభ్యాసం- ఇవికూడా వుంటేనే అది గొప్ప కవిత్వం అవుతుందని నేననుకుంటున్నాను. పోతే అడిగావు కాబట్టి చెప్తున్నా- పుట్టగొడుగుల్లా కవులు పుట్టుకొస్తున్న ఈకాలంలో కవిత్వంమీద నాకు సదభిప్రాయంలేదు. అది నిజమైన కవిత అయితే, నన్ను గిలిగింతలు పెడితే చదివి ఆనందిస్తాను. కానీ ప్రస్తుతం వస్తున్న చాలా కవితల్లో కవిత్వం లోపించి పదాలు మిగులుతున్నాయి. కవిత్వమెక్కడుంది? మాటల్లోనా? ఛందస్సులోనా? భావంలోనా? రసంలోనా? అలంకారంలోనా?-




# ఆ నొప్పికి
# స్ట్రాంగ్ చికిత్స
# అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిశ్రితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింపజేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

## అమృతాంజన్ స్ట్రాంగ్




మిక్కిలి బాధాకరమైన నొప్పులకు

అమృతాంజన్ లిమిటెడ్



OBM 831 TG

ఎక్కడుంది... పరిశీలించి చూడు?

చివరగా ఒక్కవిషయం. నువ్వు సాహిత్యం చదువు, ఆలోచించు, రచించు- బాగానే వుంటుంది. కానీ ఇక దైనందిన కార్యక్రమాలన్నీ మానేసి దానితోనే సతమతమైపోకు. పిచ్చి పిచ్చి ఆలోచనలన్నీ తుడిచేసుకో. ప్రపంచాన్నీ వాస్తవాన్నీ గుర్తించని భావుకత చూసేవాళ్ళకి పిచ్చితనంగా, వెకిలితనంగా గోచరిస్తుంది. నీ శ్రేయోభిలాషిగా అట్లా రాశాను. తొందరపాటులో అపార్థం చేసుకోక శాంతంగా ఆలోచించి చూడు. అన్ని విషయాలతో ఉత్తరాం రాయి''

ఒకరోజు కాలేజ్ అయిపోయాక శ్రీహరీ, సీతా మెల్లగా నడుస్తూ ఇళ్ళదారిపట్టారు. సీత మాటలమధ్యలో-

''నీకో చిన్న కాంప్లిమెంట్ శ్రీహరీ! ఈ నేవీబ్లూషర్ట్‌లో భలే బాగున్నావు. నీకు బాగా సూటైంది. ముందే తెల్లగా వుంటావంటె ఇందులో మరీమన్మధుడిలా వున్నావు''అన్నది.

''అది తిట్టా? దీవెనా?

''మరేమనాలబ్బా?'' అని బుగ్గనచేయిపెట్టుకుని ఒక్షణమాలోచించి ''కంతు, జయంతు, వసంతాదులు నిన్గని వెలవెలబోరో కో'' అంది తమాషాగా నవ్వుతూ.

''నిజంగానా... థాంక్స్. అతిశయోక్తి అంటే అబద్ధమని ఓసారి అర్థంచెప్పావుగానీ, ఇవాళ నీమాటలు నిజమనే అన్పిస్తున్నాయి'' అని నవ్వాడు. మళ్ళీ అతడే ''వద్దన్నకొద్దీ మొన్న పుట్టిన్రోజుకి అక్క తీసుకుంది. స్టిచింగ్ కూడా తనదే'' అన్నాడు మురిపెంగా షర్టువైపు చూసుకుంటూ.

''ఓహో... మీ అక్క గిఫ్టా? ఆవిడేం చేస్తుంటారు? పెళ్ళైందా?''

''విడో. మా ఇంట్లోనే వుంటుంది. నీకెప్పుడూ చెప్పినట్టులేను. వయసేం ఎక్కువ లేదు, నాకంటే అయిదారేళ్ళు పెద్దది- అంతే! పోయినవాళ్ళతో పోలేంకదా? ఉన్నంతకాలం అదే అదే గుర్తుచేసుకుంటూ నిర్జీవంగా కాలం గడుపుతూ జీవితాన్ని చేతులారా పాడుచేసుకోవడం ఎందుకో నాకర్థంకాదు. మళ్ళీ 'పెళ్ళి చేసుకో' మని నెత్తీనోరూ మొత్తుకుని చెప్పినా వినదు'' అన్నాడు శ్రీహరి దిగులుగా.

''అయ్యో... అట్లాగా? చనిపోయినవారి స్మృతులు బాధకలిగించే మాట నిజమే కానీ. పోయినవాళ్ళకోసం వున్నవాళ్ళు సుఖసంతోషాలని త్యాగంచేసినంతలో వాళ్ళేం తిరిగివస్తారా? అనవసరంగా తమకి తాము బాధపడుతూ, ఇంకా చుట్టూ వున్నవాళ్ళక్కూడా మనశ్శాంతి కరువుచేయడం అవుతుందిగానీ'' అంది సీత.

''ఈ లోకంలో అందరికంటే, చివరికి అమ్మకన్నా కూడా అక్కయ్యంటేనే గౌరవాభిమానాలు నాకు. నిజంగా దేవతలున్నారో లేదో తెలీదు గానీ మా అక్కమాత్రం ప్రత్యక్షదేవతలా కన్పిస్తుంది. మానవత్వం మూర్తీభవించే మహోన్నతమైన మనిషి. ఒకర్ని సంతోషపెట్టేందుకు తనెంత కష్టపడేందుకైనా సిద్ధపడే తత్వం ఆమెది. గొప్పలనుకుంటావేమోగానీ సీతా- నిజంగా చెప్తున్నా మా అక్కని చూసుకుని నేనెంతో గర్వపడుతుంటాను''

''అట్లాగా? ఓసారి చూడాలావిణ్ణి. పిల్లలున్నారా ఆవిడకి?''

''లేరు- పెళ్ళై రెండేళ్ళయినా నిండకముందే పోయారు బావగారు. ఇక ఇప్పుడు పనే తన ప్రపంచం. ఆ మిషనెక్కితే అన్నం తిందో లేదో కూడా గుర్తుండదు''

''అబ్బా?! నాకు కుట్టు నేర్పుతారా?''

''అడిగితే కాదంటుందా? అయినా నీకెందుకు?''

''నాకు మహా ఇష్టం''

''దాందేముంది? రోజూ వచ్చి నేర్చుకో మరి''

''అత్త సొమ్ము అల్లుడు దానం చేసినట్లుంది. మీ అక్క అనుమతి తీసుకుని చెప్పవోయ్''

''ఇది అత్తసొమ్ము కాదు, అక్క విద్య మాత్రమే. మా ఇద్దరి అనుబంధం ఎట్లాంటిదో నీకు తెలీదులే. అయినా వచ్చిన విద్య నేర్పితేనే సార్థకమవుతుందని ఎప్పుడూ చెప్తుంటుంది అక్క. ఇంతకుముందు ఎంతో మందికి నేర్పింది కూడా''

# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




లైఫ్‌బాయ్
మురికిలోని క్రిములను వదలగొడుతుంది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS LB P 100 1811 TL

"థాంక్స్ శ్రీహరి... అయితే వస్తాను"

"ఎప్పుడో ఎందుకు- ఇప్పుడు రారాదా?"

"అమ్మో... ఇప్పుడా?"

"చూశావుగా. నీకోసం మాకీరోజు ప్రాక్టికల్స్ లేకపోయినా ఇంతసేపు ఆగాను. నువ్వుమాత్రం కాసేపు ఇంటికి రమ్మంటే మహాపోజులు... నామాటవిని రా- అక్కని పరిచయం చేస్తా, అరగంటలో వెళ్ళిపోదువుగాని" అన్నాడు శ్రీహరి.

సీత కాదూ కూడదూ అనలేదు. శ్రీహరితోబాటు అతడి ఇంటికి వెళ్ళింది.

"అక్కా... నా క్లాస్‌మేట్, సీత! మా అక్క- పేరు శారద" అన్నాడు శ్రీహరి- ఇద్దరినీ ఒకరినొకరికి పరిచయంచేస్తూ. ఇద్దరూ తలలు వంకించి నవ్వుకున్నారు.

"మీగురించి చెప్తుంటాడు, ఎప్పుడూ మీ నామస్మరణే" అంది శారద అందంగా నవ్వుతూ.

చామనచాయరంగూ, ఎత్తుగా, బొద్దుగా వుంది. కళ్ళలో గొప్ప తేజస్సు, ముఖం ప్రసన్నంగా వుంది. పొడుగాటి జుట్టు. జడే వేసుకుంది. ఎటువంటి ఆభరణాలూ లేవు- కనీసం పోగులుకూడా పెట్టుకోలేదు. డాంబికం అనేది ఆవిడ డిక్షనరీలో లేనట్లుంది. సీత రెండు క్షణాలు శారదని కళ్ళార్పకుండా చూసి "అబ్బ! ఎంత నిరాడంబరంగా వుంది?" అనుకుంది.

శారద మాటలకి చిరునవ్వులు చిందిస్తూ "నాగురించా? ఏమని?" అందామె.

"మీదగ్గరో నిఘంటువుందనుకోండి. అందులో ఏయే పదాలున్నాయంటే ఎన్నని చెప్పగలరు, మీరు ఏమేం చేస్తారో, ఏమేం చేయరో- అన్నీ చెప్తాడు"

"తమాషాగా మాట్లాడ్తారే? నేనేం చేస్తానో, ఏం చేయనో నాకే తెలీదు" అన్నది సీత.

"మీరిద్దరూ మాట్లాడుతుండండీ, నేవెళ్ళి టీపెట్టి తెస్తాను" అంది శారద లేచి నిలబడి.

"ఒద్దొద్దు... మీరు కూర్చోండి" అన్నది సీత.

"నాక్కావాల్లే- త్వరగా పెట్టక్కా" అన్నాడు శ్రీహరి.

"అయితే నేవెళ్తానండీ. ఇంటిదగ్గర అక్క కంగారుపడ్తుంది" అంటూ లేచింది సీత.

"వచ్చి రెండునిమిషాలు కాలేదు- అంత తొందర! ఏమైనా పనిమీదొచ్చారా?" అడిగింది శారద.

"తనంతేలేగానీ, నీకెందుకు నువ్వెళ్ళి టీ తీసుకురా అక్కా?" అన్నాడు శ్రీహరి. శారద నవ్వి వెళ్ళింది.

"నేనొచ్చింది టీ తాగుతూ తీరిగ్గా కూర్చునేందుకా? మా ఇంట్లో సంగతి తెలిసి కూడా...?" అంది సీత చిన్నగా.

"సీతా... మరీ చిన్నపిల్లతరహాగా మాట్లాడకు. వచ్చినదానివి ఎలాగూ వచ్చావు. అయిదూ, పదీ నిమిషాలు అటూ ఇటూ అయితే సర్దిచెప్పలేవా? అక్కైనా ఏమనుకుంటుంది? మరీ అలా ముళ్ళమీద కూర్చున్నట్లు లేచెళ్తే?" అన్నాడు శ్రీహరి.

సీత ఇంకేం అనలేదు. ఆమె ఆ ఇంటినీ, అటూ ఇటూ తిరుగుతున్న పిల్లినీ చూస్తూ కూర్చుంది.

శారద వచ్చి ఇద్దరికీ టీ అందించింది.

"అక్కా... సీత నీ దగ్గర శిష్యరికం చేద్దామనుకుంటోంది"

"చాల్లే ఊరుకోరా... శుభ్రంగా చదువుకుంటున్న పిల్లకి ఈ కుట్లు పొట్లెందుకు?"

"నిజమండీ... మీరు నేర్పితే నేర్చుకోవాలనుంది" అంది సీత.

"ఇంతకుముందు ఎక్కడైనా నేర్చుకున్నారా?"

"లేదండీ... తిన్నగా సూది పట్టుకోవడం కూడా రాదు" అంది సీత నవ్వుతూ.

"సరే... ఎ టు జెడ్ - అంతా నేర్పుతుంది గానీ, మరి గురుదక్షిణేమిస్తావు?" అడిగాడు శ్రీహరి.

"ఆవిడేమడిగితే అది" అంది సీత.

"గురుదక్షిణా? నీ దగ్గర వసూలు చేస్తా" అంది శారద తమ్ముడి వంక చూస్తూ.

"ఏడ్చినట్లుంది. నా దగ్గరెందుకు?"

"నీ ఫ్రెండు కాబట్టి"

"అయితే సీత ఇకమీదట నా ఫ్రెండు

కాదు- స్నేహితురాలైనా, శిష్యురాలైనా నీకే-నరేనా?'' అన్నాడు శ్రీహరి.




''బహుకాల దర్శనం. అబ్బో... పిన్నులిద్దరికీ మామీద కటాక్షం కలిగిందే?'' అంటూ ఎదురెళ్ళింది రాధ.

''ఎంతకాలమైనా మేం రావాల్సిందేగానీ ఈ ఘోషా స్త్రీ మాత్రం ఇల్లు కదలదు'' అన్నది నరసమ్మ.

''మీకేమమ్మా- దర్జాగా కూర్చుంటే చేసిపెట్టే కూతుళ్ళూ, కోడళ్ళూ వున్నారు. నేనూ, మీరూ ఒకటా?''

''నీకు లేదటే చెల్లెలు పిల్ల?'' అంది అన్నపూర్ణ.

''ఆఁ... వుందిలే, ఎందుకు? విగ్రహపుష్టి'' అంది రాధ.

''అంతేలే... పొరుగింటి పుల్లకూరే రుచి. దానికేం నిదానస్తురాలు. వినయ విధేయతలు కలిగిన పిల్ల, అవసరమైతే అన్నం కూడా తినిపిస్తుంది- కాదంటావా?'' అన్నది నరసమ్మ.

''అన్నంకాదు. సున్నం తినిపిస్తుంది. అంత మోజుగా వుంటే తీసుకెళ్ళి పెంచుకోరాదూ?'' అన్నది రాధ.

''ఒట్టొట్టి మాటలకేంలే? నువ్వివ్వాలేగానీ మహద్భాగ్యం అనుకుంటాను. దానికేం తక్కువ, చక్కటి చుక్క''

''ఈ చిన్న పిన్ని గాల్లో పేలాలు వేయిస్తుంది. చక్కటి చుక్కట, కబుర్లేగా- ఓ సమ్మంధం కుదర్చరాదూ?''

''ఆ పనిమీదే వచ్చాం తల్లీ'' అంది అన్నపూర్ణ.

''నిజమా పిన్నీ?''

''నేనేం చిన్నపిల్లనా- పరాచికాలాడేందుకు?''

''ఏదీ... పిల్లకనబడదేం?'' అంది నరసమ్మ.

''కాలేజ్ కెళ్ళింది. ఇంకారాలేదు''. చెప్పింది రాధ.

''కాసిని మంచినీళ్ళియ్యమ్మా రాధా'' అంది అన్నపూర్ణ.

''మాటల్లో అడగడమే మర్చిపోయా. ఉండు పిన్నీ... ఒక్క నిమిషం'' అంటూ వెళ్ళి నీళ్ళు తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది రాధ.

''ఇదిగో అమ్మాయి... పొద్దుట్నుంచీ ఎండలో తిరుగుతూ మాడిచచ్చాం. కాస్త మంచాలు వాల్చావంటే కాసేపు పడుకుంటాం'' అంది నరసమ్మ.

''నాలుగవుతూంది, ఇప్పుడేం నిద్ర? టీ పెట్టిస్తాను... పెందలాడే భోంచేసి పడుకుందుర్లే''

''ఏంటి? రాత్రికి ఇక్కడా? మీ బాబాయిలు కర్రలుపట్టుకుని వస్తారు''

''ఆఁ ఆఁ... వాళ్ళు మీకు భయపడకపోతే చాలు. మిమ్మల్ని భయపెడ్తారా? పుణ్యాత్ములు?'' రాధ నవ్వుతూ అంది.

''మీ బాబాయిలేం మా మేనల్లుళ్ళూ అమాయకులు కారే రాధా'' అంది అన్నపూర్ణ.

''మీరూ, మీ మేనల్లుడూ అమాయకులు; నేనూ, మా బాబాయిలూ గయ్యాళులం'' రాధ ఉక్రోషంగా అంది.

''తీరిగ్గా వాదించుకుందుర్లేగానీ... నువ్విట్లా పడుకో అక్కాయ్! నువ్వెళ్ళి టీ పెట్టమ్మా రాధా'' అంది నరసమ్మ.

''ఇంతకీ సంబంధం అన్నారు, ఏవూరు? ఎవరబ్బాయి? ఏంసంగతి? వివరాలేం చెప్పరే?'' అంది రాధ వుండబట్టలేక, టీపెడుతూ.

''ఈ ఊరి సంబంధమే అమ్మాయి. నరసింహమూర్తిగారి రెండో అబ్బాయి'' అన్నది నరసమ్మ.

''ఏ నరసింహంగారు?'' అడిగింది రాధ.

"అదేనే... మనవాడు చేసే స్కూల్లోనే టీచరు?! మనకీ - వాళ్ళకీ దూరపు చుట్టరికం కూడా వుంది" అంది అన్నపూర్ణ.

"వాళ్ళబ్బాయా? ఏం చేస్తాడు?"

"గుమస్తాగిరంట. విశాఖపట్నంలో ఉద్యోగమట. అయితేమట్టుకు ఏమైందిలే? నిదానంగా ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చేమో. ఏమంటావు?"

"అంతా బాగుంటే ఎక్కడైతే ఏముంది? అయితే అన్ని విషయాలూ మాట్లాడారా?" అడిగింది రాధ.

"ఆఁ... ఏవుంది మాట్లాడేందుకు? మీ నాన్న మిగిల్చిపోయిన ఆ కాస్త పొలమూ ఇస్తారనీ, ఇప్పుడు డిగ్రీ చివరి సంవత్సరం చదువుతోందనీ, అదైపోయాక ఇష్టమైతే ఉద్యోగం చేస్తుందనీ చెప్పాం. మన పిల్ల అందచందాలూ, గుణగణాలు ఆయనకి తెలుసుకదా. ఇకపోతే వాళ్ళబ్బాయి పెళ్ళిచూపులు ఒద్దన్నాడట. కాబట్టి ప్రత్యేకంగా అటువంటి ఏర్పాట్లేంచేయకండని చెప్పారు"

"అదేంటి?" అంది రాధ విస్తుపోతూ.

"చుట్టం చూపుగా మా ఇంటికి వచ్చినట్లు వస్తారట. అక్కడికే అమ్మాయిని తీసుకొస్తే బాగుంటుంది అన్నారు. సీతక్కూడా ఇదేం చెప్పద్దు. ఊరికే ఇద్దరికీ పరిచయం చేద్దాం"

టీ కప్పులు అందిస్తూ "ఏమో పిన్నీ! మీ పుణ్యమాని దాని పెళ్ళిత్వరగా అయిపోతే నాకు ఇంకే దిగులూ లేదు" అంది రాధ.

"నువ్వు నిశ్చింతగా వుండు. పిల్లేం అనాకారా? పెళ్ళికాదని బాధెందుకు? పైగా చదువుకున్నది" అంది నరసమ్మ.

★ ★ ★

ఆ రోజు సీత, రోజూకంటే ముందుగా వచ్చింది శ్రీహరి ఇంటికి.

"శారదా... ఈరోజు ఇంకా రెండు క్లాసులున్నా ఎగ్గొట్టి వచ్చాను. నీతో హాయిగా గడుపుదామని" అంది సీత.

"మంచిపని చేశావులే. అయినా పిచ్చి సీతా- నన్ను రోజూ చూసినా నీకెప్పుడూ విసుగన్పించదా?" నవ్వుతూ అంది శారద.

"అంటే- ఇది ఇన్‌డైరెక్టుగా, నీ విసుగుని తెలియజేయడమా?" అంది సీత.

"ప్లీజ్... సీతా, పరిహాసానిక్కూడా నువ్వలా మాట్లాడకు. నీకూ, నాకూ ఏదో జన్మజన్మల అనుబంధం వున్నట్లన్పిస్తుంది! సరే... మేడమీదికెళ్ళి కూర్చుందామా?" అడిగింది శారద.

"ఎందుకు టైం వేస్ట్? నువ్వట్లా హెమ్మింగ్ చేస్తూనే వుండు- నేనీ రెండుజాకెట్లు కుట్టిస్తాను. పనిచేసుకుంటూనే మాట్లాడుకుందాం"

"మొత్తానికి గురువుని మించిన శిష్యురాలయ్యావు. మొన్న సత్యవతి కూతురికి గౌను కుట్టావు చూడు. అదిచూసి ఎంతోమంది మెచ్చుకున్నారట. మహా పొగిడేస్తుంటే నాకెంత సంతోషమేసిందో తెలుసా?"

"రెండేళ్ళ నుండీ నేర్చుకుంటున్నా మరి. అదీ ఒక ఎక్స్‌పర్ట్‌దగ్గర- కాబట్టి నాగొప్పతనం ఏమీలేదు. సరేగానీ శారదా... నువ్వు పొద్దస్తమానం కుడుతూనే వుంటావు గదా, మరో వ్యాపకం లేకుండా! నీకెప్పుడూ చికాకన్పించదూ? మార్పు కోరుకోవూ?" అంది సీత.

"ఊహూ... నాకెప్పుడూ చికాకన్పించదు. మిషను తొక్కడం, పువ్వులూ, అద్దాలు కుట్టడం- ఇదే నాప్రపంచం. ఆపనులు చేస్తున్నంతసేపూ నాకు మరోసంగతి పట్టదు. అసలు నన్ను నేనే మరచిపోతాను. కానీ ఈమధ్య కాస్త ఆరోగ్యం పాడైన దగ్గర్నుంచి పనిచేసేటప్పుడు ఏమీ వుండదుకానీ రాత్రులు మాత్రం కాళ్ళూ, చేతులూ నొప్పి చేస్తున్నాయి" అంది శారద.

"ఎవరికైనా ఎన్నాళ్ళుంటుంది ఓపిక? నువ్వు మరీ శక్తికి మించి శ్రమపడుతుంటావాయె. శారదా! నేను నీ ఆత్మీయురాలినేనా?" అడిగింది సీత.

"ఇదేం ప్రశ్న అర్థాంతరంగా? కావని ఎవరనగలరు?"

"ఏంలేదు... ఎప్పట్నుంచో నాకో సందేహం- అడిగితే ఏమనుకోవుగా?"

"ఈ ప్రక్కప్రశ్నలు చాలించి, అసలు ప్రశ్నేంటో ముందు చెప్పు" అన్నది శారద.

"నీ ఆలోచనల్లో, చేతల్లో ఎంతో పరిపక్వత కన్పిస్తుంది. కానీ ఒక్కవిషయంలో మాత్రం




నీపద్ధతి నాకు ఆశ్చర్యాన్నీ, అంతకంటే కోపాన్నీ బాధనీ కలిగిస్తున్నాయి''

''ఏమిటది? మళ్ళీ పెళ్ళా?''

''ఔను... వేరే చెప్పాలా?''

''సీతా! నువ్వింకా చిన్నపిల్లవే. నీకీలోకం గురించి పూర్తిగా తెలీదు. నాకేం పునర్వివాహం అనమ్మతం కాదు. కానీ ఒక పెళ్ళై భర్తపోయిన నన్ను కావాలని పెళ్ళిచేసుకుని, మనసు నొప్పించకుండా మామూలుగా మసలుకునే పాటి ఉదారబుద్ధి ఈ సామాన్యమైన మగవాళ్ళ వర్లోనూ వుండదని నాకు తెలుసు. అలాంటప్పుడు లేనిపోని తలనొప్పి, గుండెబరువూ, అశాంతీ- వీటిని కొని తెచ్చుకోవడం కాదా- మళ్ళీ పెళ్ళి చేసుకోవడమంటే?''

''నీది పొరపాటు శారదా... నాణానికి రెండు వైపులున్నట్లే చెడ్డవాళ్ళతోపాటు మంచివాళ్ళూ వుంటారు కదా?''

''కాదనను... కానీ నూటికోటికి ఎక్కడో వుంటారు. అయితే అలాంటి వ్యక్తి కన్పించాలిగా''

''కన్పిస్తే చేసుకుంటావా?''

''గాల్లో మేడలెందుకు? అప్పటి సంగతి అప్పుడు చూసుకోవచ్చుగానీ... ఔనూ... వచ్చే సంవత్సరం ఏం చేద్దామని? ఉద్యోగం ఏమైనా...?''

''ఆс... నాకోసం స్వాగతం పలుకుతూ కూర్చున్నారు ఉద్యోగమిచ్చేందుకు?! ఉద్యోగానికై నిరీక్షిస్తూ నిరుద్యోగినని గొంతు చించుకునే బదులు ఈ టైలరింగ్‌లోనే ఇంకా నైపుణ్యం సంపాదించి, ఓ షాప్ తెరిస్తే? ఏంకాదా... ఎట్లా వుంటుంది?''

''బాగుంది... తప్పకుండా పెట్టు'' అంది శారద.

★ ★ ★

అన్నపూర్ణ, నరసమ్మ వచ్చి వెళ్ళిన వారంరోజులకి- సాయంత్రం నాలుగవుతుండగా రాధ సీతని స్నానం చేసిరమ్మని హుకుంజారీచేసింది. ఉదయం చేసినా కిమ్మనకుండా మళ్ళీ చేసింది.




''ఆ చీరొద్దు- ఈ చీరకట్టుకుని, ఈ పూలు కూడా పెట్టుకో'' అన్నది రాధ సీతకో ఖరీదైన చీర అందిస్తూ.

సీతకి రాధని ఎందుకు, ఏమిటి అని ప్రశ్నించే అలవాటు లేదు. అక్కకి ముక్కుమీదే కోపం వుంటుందనుకుని ఆమేం చెప్పినా కిమ్మనకుండా చేస్తుంది. ఏదైనా సినిమా ప్రోగ్రాం కాబోలనుకుంది.

''ఈరోజు ఆదివారమేగా. పెద్దపిన్ని రమ్మంది. తొరగా తయారవ్వు'' అంటూ విషయం చెప్పి సీతసందేహాన్ని చిటికలో తీర్చేసింది.

అంతా అయ్యి చెప్పులు వేసుకుంటుంటే ''ఇది నేను పెంచిన సీతేనా? దేవకన్యలా వుందే'' అనుకుంది రాధ ఒక్కక్షణం.

''ఆ కళ్ళకొక్కాస్త కాటుక పెట్టుకోరాదూ?''

ఆమె గొంతులో రోజూ మాదిరిగా కాఠిన్యం లేదు. వీలైనంత సౌమ్యంగా అంది రాధ.

'ఇది కలా? నిజమా? ఈరోజేదో తుఫాను వచ్చేట్టుందే?' అనుకుంటూ కాటుక పెట్టుకుని వచ్చింది సీత.

రాధ, సీత- అన్నపూర్ణ ఇల్లు చేరేసరికి అప్పటికే నరసింహమూర్తి మాస్టారు, ఆయన భార్య జానకి, పెద్దకొడుకు పరమేశం, రెండోకొడుకు కోటేశ్వరరావు, ఇంకా నరసమ్మగారు సకుటుంబసపరివారంగా వచ్చివున్నారు. ఇల్లంతా కోలాహలంగా వుంది.

సీత నరసింహమూర్తిగారిని అక్కడ చూసి ఆశ్చర్యపోతూ ''నమస్తే... మీరు... ఇక్కడ... ఎంతసేపైందండీ వచ్చి?'' అన్నది.

''ఆс... రా... రావమ్మా... ఏమే... యేంచ్చదువుతున్నావేం?... ధ్ధా కూర్చో'' అన్నారు.

''బియస్సీ ఫైనలియరండీ''

''మ్మ... మ్మంచిది... వ్వి...వ్వి... వీడు తెల్సా? ...మ్మా... మా... పె్ప... పెద్దబ్బాయి... రెండో బ్బాయి... ఏలూరులో చదువుకున్నాడు'' అంటూ ఇంకేమో చెప్పబోతుంటే, అది గ్రహించిన పెద్దకొడుకు పరమేశం, తండ్రి అవస్థలు కాకపోయినా, ఆ నత్తిగోల వినడం విసుగ్గా అన్పించి, ''నాపేరు పరమేశం, వీడు నాతమ్ముడు వైజాగ్‌లో జాబ్‌చేస్తున్నాడు. మీరు మా నాన్నగారి స్టూడెంట్‌లా వున్నారు... అవునా?''

అంటూ నవ్వాడు.

"ఔనండీ... నాపేరు సీత. ఆ ఎర్రచీరావిడ మాఅక్క. అనుకోకుండా మాస్టారూ, మీరంతా రావడం, మేమూ రావడం... బావుంది. ఈ రోజు ఆదివారం కావడమేమో చిన్నపిన్నివాళ్ళు ంతా కూడా వున్నారు" అంటూ అంతలో అటుగా వచ్చిన నరసమ్మని చూస్తూ తన సంతోషాన్ని వెలిబుచ్చింది సీత.

అప్పుడే అటుగా వచ్చిన చిన్నపిల్లలు ఇద్దరు ముగ్గురు "సీతక్కా" అంటూ వచ్చి చేతులు పట్టుకు లాక్కెళ్ళారు. ఆ రోజంతా సీత చిన్నపిల్లలతో ఆడుతూ, పాడుతూ జనసందోహంలో లేడిపిల్లలా ఉత్సాహంగా, చలాకీగా గడిపేసింది.

నరసింహమూర్తిగారి భార్య జానకి చిన్నకొడుకుతో – "ఎలా వుందిరా ఆ అమ్మాయి? పిల్ల బుద్ధిమంతురాలని మీ నాన్నగారు చెప్పారు. నీకిష్టమయితే కోడలిగా చేసుకోవాలనుంది" అంటే కోటేశ్వరరావు వెంటనే ఒప్పుకున్నాడు.

ఆ విధంగా ఆ సంబంధం కుదిరింది. బాబాయిలు మొగదిక్కుగా రాధకు సలహా సంప్రదింపుల్లో సహాయం చేశారు. కేశవమూర్తి లేనిలోటు కన్పించనివ్వకుండా పెళ్లి నిశ్చయం చేశారు.

అయితే సీతకి ఈ గోలేం తెలియదు. పెళ్లి కుదిరింది అనుకున్నాక్కూడా రాధ ఆమెకేమీ చెప్పలేదు. ఆమె మామూలుగా తన చదువుతో, కుట్లుతో, ఇంకా భావోద్రేకం కలిగినప్పుడు కవిత్వం రానుకుంటూ, ఎప్పటిలాగే కాలం గడుపుతోంది. సీత డిగ్రీపరీక్షలు అయిపోయింతరువాత-

ఒకరోజు అర్ధాంతరంగా- "నువ్వు నరసింహమూర్తిగారి చిన్నబ్బాయిని చూశావుగా!" అంది రాధ.

"చూశానక్కా.... అదే – ఆరోజు పెద్దపిన్నివాళ్లింటికి వచ్చారుగా" అన్నది సీత.

"ఆ అబ్బాయితో నీ పెళ్లి నిశ్చయమైంది. ముహూర్తాలు కూడా పెట్టేశారు. అగస్టు మూడున" అంది, అదేదో పిట్టకథ చెప్తున్నంత సులువుగా, సహజంగా. ఆమెకి పెళ్లంటే నూరేళ్లపంటని తెలియదు. కాలం మారింది, ఆచారాలు మారాయి, కేవలం పిల్లాడికి నచ్చితే చాలదు, ఆడపిల్ల అభిప్రాయం కూడా తెల్సుకోవాలని తెలియదు. కులం, గోత్రం, వంశం, సంప్రదాయం- ఇవే ముఖ్యం కాదు. ఇంతకంటే అతిముఖ్యమైన మనసులు అనేవి ఒకటుంటాయని అసలే తెలియదు.

ఆ వార్త విన్న సీత ఒక్కక్షణం స్థంభించిపోయింది. ఆమెకి భూమ్యాకాశాలు తల్లకిందులైనంత భయంకరంగా వినిపించిందామాట. దాన్నుంచి తేరుకుని- "అతనితో నాకు పెళ్లా?" అంది.

"నీక్కాకపోతే నాకా?!"

"నాకు ఇప్పట్లో పెళ్లొద్దక్కా?"

"ఆపాపు... నీ నక్కవేషాలు. ఇంతోటి సుందరాంగికి అంతకంటే గొప్ప సంబంధం వస్తుందా? పిన్ని పుణ్యమాని కుదిరింది. కుర్రాడు సలక్షణంగా వున్నాడు. ఇకనుంచీ నీ తిక్కతిరుగుళ్లు, అంటే అదే శ్రీహరిగాడింటికి పోవడం, వగైరాలన్నీ కట్టిపెట్టి బుద్ధిగా ఇంటిపట్టునుండు. నా సంగతి తెలుసుగదా, ఎక్కువ తక్కువ వేషాలేస్తే ఏం చేస్తానో? నీతో తర్కానికి టైమిప్పుడు కాదులే"- అని నాలుగు ముక్కల్లో చెప్పేసి వెళ్లిపోయింది రాధ.

సీతకి అప్పటికే పెళ్లంటే ఒక అవగాహన వుంది. త్వరపడి ఎవర్నో ఒకరిని పెళ్లిచేసుకోకూడదని, ఎంతకాలం అయ్యాకైనాసరే మనసుకి నచ్చినవాణ్ని చేసుకోవాలన్నదే ఆమె నిశ్చితాభిప్రాయం. కానీ ఈ ఆపదదాటడం ఎలాగో ఆమెకి తెలియడంలేదు. ఆలోచించినకొద్దీ కళ్లంట బొటబొటా నీళ్లు కారుతున్నాయి. అలాగే నిస్త్రాణగా పడుకుంది.

"ఏమేవ్... తిండికి తగలడు. నువ్వు ఏడుస్తూ కూర్చున్నందువల్ల ఆగేదేంలేదు. సలక్షణంగా పెళ్లిచేస్తుంటే సంతోషించక ఏమిటా ముణగదీసుకుని గదిలో కూర్చోవడం – లే,లే" అంది రాధ.

"నాకాకల్లేదు... నేను తినను" అంది సీత.

"ఏమ్మాయరోగం వచ్చింది?" అంటూ గదిలోపలికొచ్చింది రాధ.

"అక్కా! నీకు దణ్ణం పెడ్తానక్కా... నాకీ పెళ్లిచేయొద్దు"

"ఏం? ఏవొచ్చిందే? ఆ శ్రీహరిగాడితో తైతక్కలాడావా ఏంఖర్మ — చెప్పిచావు"

"లేదక్కా. శ్రీహరిమీద నాకలాంటి భావన లేదు"

"మరింకేం మాయరోగం? నిక్షేపంగా పెళ్లి చేసుకు తగలడు. నాన్న పోయినప్పటినుండి గుండెలమీద కుంపటిలా భరిస్తున్నాను. ఇక నావల్ల కాత్తల్లీ! నీ పెళ్లయితే నా భారం తీరిపోతుంది" అంది రాధ.

సీత మాట్లాడలేదు. అక్కకెలా చెప్పాలో తెలియలేదు. ఆమె అలాగే కూర్చుండిపోయింది.

"లే... నిన్ను బతిమాలి తిండిపెట్టేంత ఓపిక నాకు లేదు. ఆయనకుత్తరం రాయాలి. ఎప్పుడొస్తారో, ఎప్పుడీపెళ్లిపనులన్నీ చేస్తారో నాకర్థం కావడంలేదు" అని విసుక్కుంది రాధ.

"అక్కా! నేనతన్ని పెళ్లిచేసుకోను" నిశ్చయంగా అంది సీత.

"మరెవణ్ణి చేసుకుంటావే? నా మొగుణ్ణి చేసుకోవే, నా కొంప ఆర్పుదువు గాని" కోపంలో అనకూడని మాట అనేసింది రాధ.

"ఔనక్కా.... బావనే చేస్కుంటాను"

"ఓసి నీ కడుపుడకా! పెంచి పెద్ద చేసినందుకు నీ కడుపులో ఇంత విషముందటే? నా కొంపకే చిచ్చుపెట్టడానికి తయారయ్యావు. నీ మొహం మండా. నీకు పెళ్ళిచేసి అత్తారింటికి పంపుదామని నేనాలోచిస్తుంటే నాకే సవితిగా తయారవుతావా? ఇంక నేనెందుకూ, మీరూ మీరూ కలిసి చావండి. నేనేవిషమో మింగి చస్తాను. మీ కళ్ళు చల్లబడతాయి. హాయిగా పెళ్లిచేసుకుని ఊరేగుదురుగాని. ఆయన్నీకు ఉత్తరాలు రాయడం, నువ్వు ఆయనకుత్తరాలు రాయడం- ఇదటే మీరు చేస్తున్న గూడుపుఠానీ. హవ్వ... హవ్వ... ఎవరైనా వింటే నోట్లో వుమ్మేస్తారుగదే? చెట్టంత భార్యను నేనుండగానే నా మొగుణ్ని కట్టుకుంటావటే? చెప్తా... చెప్తా... నువ్వు చచ్చినా సరే — నీ శవానికైనా ఆ పిల్లాడిచేత పుస్తె కట్టిస్తా. రాధంటే ఏమనుకున్నావే? ఇప్పటిదాకా మీరే ఆట్లాడినా చూస్తూ ఊరుకుంటున్నా! ఆయన నిన్ను పెళ్లిచేసుకుంటానని రాశారా?" అనడిగింది రాధ.

"బావ నాకేం రాయలేదు"

"రాయకేం.... రాసేవుంటారు. పెళ్లైనప్పటి నుంచి నన్నెట్లా వదిలించుకోవాలా అనే చూస్తున్నారు. ఓరి భగవంతుడా — నేనెట్లా చచ్చేదిరోయ్? ఇటుచూస్తే భర్తా, అటు చెల్లెలు. ఇద్దరూ నా చావుకు ఎదురుచూస్తున్నారు నాయనోయ్. అత్తా! నువ్వయినా బతికుంటే నాకీ గతివట్టేదికాదుగదా. నేనేం చేసేదిరోయ్? గుండెలు మండిపోతున్నాయిరో దేవుడా!" అని శోకాలు సాగించింది రాధ. నేలమీద పడి దొర్లింది. కుళ్లికుళ్లి ఏడ్చింది. నిస్త్రాణగా అలా పడుకుని వుండిపోయింది. అప్పుడప్పుడు లేవడం, మళ్లీ చెల్లెల్నీ, భర్తనీ తిట్టిపోయడం, దేవుడికి మొరపెట్టుకోవడం, మళ్ళీ ఏడ్వడం- ఇలా ఆ రాత్రంతా సాగిపోయింది. ఇద్దరూ అన్నం తిన్లేదు, కంటికి కునుకు లేదు.

సీత మనసు కల్లోలితమై పోయింది. మొదటిసారిగా అక్కంటే సానుభూతి కలిగింది. తన మీద తనకి రోత కలిగింది. తన ఆలోచనల్లోని వికృతత్వం తనకు గోచరమవసాగింది. తనేం చేస్తున్నది? బావను కోరి అక్క సంసారం విచ్ఛేదనం చేయదలిచిందా? ఏ స్త్రీ అయినా తన భర్త పక్కన మరో స్త్రీని ఊహించగలుగుతుందా? తనకు సవితిని కోరుకుంటుందా? అక్క తనని ఇంతగా పెంచి, పెద్ద చేసినందుకు తను బాగా ఋణం తీర్చుకుంటున్నది. ఆమె కొంప నిలువునా తీయాలని వచ్చిన తన భావుకతను నిందించుకుంది. ఆలోచనల్లో, భావుకతలో బావను తన అందాల ప్రియుడిగా, తన ఇష్టదైవంగా ఊహించుకోవడంలో వున్న అందం, ఆనందం వేరు. వాస్తవికతతో ఆ భావనే వికృతంగా, ఘోరంగా ఏహ్యంగా వుంది. బావ తన్నెప్పుడైనా పెళ్లిచేసుకుంటానని బాసలు చేశాడా? ఆశలు రేపాడా? అదో బండరాయి. ఎన్ని నివేదనలు చేసినా కరగని కఠినశిల. బావకు తన హృదయం తెలీదా? తెలిసే ఊరుకున్నాడా?

 

# ఏ కుక్కర్ ఇవ్వలేని, మెజెస్టిక్ మాత్రమే ఇచ్చే అతి ముఖ్యలక్షణం...

**మనశ్శాంతి**




**కేవలం**

మెజెస్టిక్‌లో పటిష్ఠమైన నిర్మాణం
అదనపు ఏర్పాట్లు
అందుకే రోజంతా చికాకులున్నా
మెజెస్టిక్‌తో వంట ... చింతలేని అనుభూతి.



మూడు రకాల ఖచ్చితమైన రక్షణ: గాస్కెట్ విడుదల ఆవిరి విడుదల అధిక ఒత్తిడి విడుదల.



లోపల మూతలు గల గిన్నెలు చట్రంలో పొందికైన అమరికవలన పదార్థాలు పొంగవిక.



ఎంపిక సౌలభ్యానికి ఎనిమిది పరిమాణాల్లో లభ్యం!



**మెజెస్టిక్**®

మనశ్శాంతినిచ్చే ప్రెషర్ కుక్కర్

అయినా అక్క భర్తను వాంఛించడమేమిటి? ఇంతకంటే దుర్మార్గం ఏమైనా వుందా? అక్క జీవితాన్ని హరించే రాక్షసా తను? ఆమె భర్తను తను ఎత్తుకుపోతే అక్కేం చేస్తుంది? ఆమె అలా గోలపెట్టడంలో అర్థం వుంది. తన కొంప కాలిమసైపోతుంటే ఇంకెవరు మాత్రం ఇలా రొమ్ములు బాదుకుని హృదయవిదారకంగా శోకించకుండా వుంటారు? తనదే తప్పు. బావని ఆశించడం శుద్ధ తప్పు.

ఒంటరితనంలో ఆమెకి ఆశ్వాసం ఇచ్చిన బావ భావన ఇవాళ ఆమెని కాల్చేస్తోంది. తనని తాను అసహ్యించుకునేట్లు చేస్తున్నది. ఆమెకిక జీవితంలో ఆశల్లేవు. ఏది ఎలావుంటే అలా జరుగుతుంది. పట్టుబట్టి సిగ్గులేకుండా ఇంకా దిగజారలేదు. అక్క ఎదుట ఆమాట అనడం ఆమెకిప్పటికీ రోతగా, అసహ్యంగా భాసించసాగింది. తనకేం పట్టనట్టుగా వుండి పోయింది సీత.

రాధ మర్నాడు కోలుకుంది. జరగబోయే ప్రమాదాన్ని పసికట్టింది. భర్తకు ఈ విషయం తెలిస్తే ఈ సంబంధాన్ని పాడుచేస్తాడు. తన కొంప కూలుస్తాడు. తనే అన్నీ సంభాళించుకోవాలి.

అన్ని ప్రయత్నాలూ ఆమే చేయసాగింది. ఉన్న మూడెకరాల్లో ఒక ఎకరం బేరానికి పెట్టింది. ఆమె, సీత కలిసివెళ్ళి పొలాన్ని అమ్మేశారు. వచ్చిన డబ్బుతో సంబారాలు కొనడం, చీరెలు, సారెలు, నగలు- అన్నీ తనే అయి, అన్నపూర్ణ- నరసమ్మల సహాయం తీసుకుని చేయసాగింది. అయితే నరసమ్మా, అన్నపూర్ణలు పసిగట్టేశారు. తమ మేనల్లుడికి తెలియవర్చకుండా ఈమే అన్నీ ఎందుకు సంభాళిస్తున్నదా అని. ఒకసారి చిన్నమేనత్త అడగనే అడిగింది.

"ఏవే... వాడికి ఉత్తరం రాశావా? పెళ్ళిపన్లు చేయడం నీఒక్కదానివల్ల ఔతుందా? వాణ్ణి రమ్మని రాయి'' అని.

"రాశాను, చిన్నపిన్నీ! నీకు తెలీన్దేముంది? ఆయన ఇంటివిషయాలు పట్టించుకుంటే నాకీ తిప్పలన్నీ ఎందుకు? పెళ్ళైనప్పట్నుండీ అన్ని సంగతులూ నేనే చూసుకోవాల్సి వస్తోంది'' అని గోడ పెట్టినట్లు అబద్ధమాడేసింది రాధ.

చెల్లెల్ని బయటకుపోరాదని ఆంక్షపెట్టింది. ఇంట్లో కూడా నిరాశతో ఏదైనా తిని ఛస్తుందేమోనని ప్రతిక్షణం కనిపెట్టి చూడసాగింది. అయితే చెల్లెలు ఇంకే మొరాయింపూ లేకుండా నోరు మూసుకునివుండటం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. "ఇదేవన్నా ఉడాయించే ప్రయత్నంలో లేదుకదా?!'' అని ఒకోసారి అనుమానించింది.

శుభలేఖలు అచ్చయ్యాయి. పెళ్ళింకా నాలుగురోజులుందనగా బయటవాళ్ళకు పంపినట్లు శుభలేఖ పంపుతూ సంబంధవివరాలూ, కట్నకానుకలూ అన్నీరాసి, పెళ్ళికి రమ్మని ఉత్తరం రాసింది రాధ. వచ్చి భర్త ఏవంటాడో, ఆయన్నెలా ఎదుర్కోవాలో అని అంతరంగంలో భయపడింది.




పెళ్ళి రేపనగా వచ్చాడు కేశవమూర్తి. అతను వచ్చేటప్పటికే పెళ్ళి పనులన్నీ పూర్తయ్యాయి. బంధువులూ వచ్చారు. రాగానే భార్యతో ఎక్కువ మాట్లాడకుండా, వెళ్ళి నరసింహమూర్తి కొడుకుని చూసి వచ్చాడు. కుర్రాడు బాగానే వున్నాడు. ఇంట్లో బంధువులూ, వాళ్ళందరూ వుండటంవల్ల అతనితో మాట్లాడ్డం పడలేదు. అతను మనిషి ఎలాంటివాడో, భావాలు ఎలాటివో కేశవమూర్తికి తెలియలేదు.

భర్త వచ్చి, తననేమీ అనకపోవడం, వచ్చీరాగానే పెళ్ళివారింటికెళ్ళి పెళ్ళికొడుకుని చూసిరావడం రాధకు ఆశ్చర్యం కలిగించాయి. ఆరోజు మధ్యాహ్నం భోజనాలైంతరువాత, బంధువులు లేకుండా చూసి భార్యని అడిగా




డు కేశవమూర్తి-

"అహ... నా సలహా సంప్రదింపులు తీసుకో లేదని కాదుగానీ, ఇంత హడావిడిగా సంబంధం నిర్ణయించడం, [illegible] పెట్టుకోవడం ఎందుకు చేశావిదంతా?"

"ఎందుకు చేసేదేముంది? నా చెల్లెలి పెళ్ళి విషయంలో నాకు తొందరపుండదేమిటండీ?! దాని పెళ్ళి చేసేస్తే నా భారం వదిలిపోతుంది" అంది శాంతంగా రాధ.

"ఎవరు ఎవరికి బారం? పెళ్ళి చెయ్యగానే ఆమె నీ చెల్లెలు కాకపోతుందా? ఆ బంధంతో బాటు భారం మాత్రం వుండదా?"

"మీ మాటలన్నీ చోద్యాలుగానే వుంటాయి. ఆడపిల్ల పెళ్ళిచేసి బరువు తీర్చుకోవడం సహజం"

"నామాటలు కాదు చోద్యం. నీచేతల్లోనే చోద్యం వుంది. మనకెప్పటినుండో మొహమాటం లేకుండా మాట్లాడుకోవడం అలవాటు. ఇందులో పిల్ల పెళ్ళి విషయంలో- ఇంత ముఖ్యమైన విషయంలో రహస్యమెందుకు? నానుండి దాచి పెళ్ళి నాలుగురోజులున్నదాకా తెలియపరచకుండా వుంచడానికి కారణమేమిటి?"

"మీకుమాత్రం తెలీదా కారణం? నేనే నోరు విప్పి చెప్పాలన్నమాట?" అన్నది రాధ.

"మనకు పెళ్ళైనప్పట్నుండీ చెప్పాల్సినవీ, చెప్పకూడనివీ కూడా నోరు విప్పే చెప్తున్నావు. అందుకే నాకాశ్చర్యంగా వుంది. ఈ విషయంలో నోరుమూసుకుని ఎందుకు పని చేస్తున్నావా అని. అది నీ సహజగుణం కాదు. నోరువిప్పి చెప్పు, అసలు కారణమేమిటో" అన్నాడు.

"అవును. నాది సహజగుణం కాదు. మీది సహజగుణం. మీ మరదల్ది సహజగుణం. ఔనండీ... నేను నోరు తెరవడం పాపం. ఇంత కాలం నానోరు నొక్కే వస్తేశారుకదా! నోర్మూసుకునుంటే ఎన్ని ఘోరాలు జరిగిపోతాయో నాకర్థమైంది. అవ్వ... అవ్వ... చెప్పుకుంటే సిగ్గుచేటు. అది మీకు ఉత్తరాలు రాయడం, మీరు దానికి ఉత్తరాలు రాయడం ప్రేమ, పెళ్ళి వరకూ వచ్చింది. నాకు ఇంతేమైనా ముందుపెట్టి పీడా వదిలించుకుని దాన్ని కట్టుకుంటే పోయేది. నేనిప్పటికైనా కన్ను తెరిచాను. కాబట్టి బతికిపోయాను. ఇంట్లో జరిగే భాగోతం ఈశ్వ[illegible] అన్నారా?" అని [illegible] మొదలెట్టింది రాధ.

"నేను పాపని ప్రేమించాననీ, పెళ్ళి చేసుకుంటాననీ నీకు చెప్పానా?" అడిగాడు కేశవమూర్తి.

"మీరు చెప్పలేక దానిచేత చెప్పించారు. ఎవరు చెప్తే ఏముంది? నా కొంప తీద్దామనుకున్నారు"

"ఏమని చెప్పింది..." అడిగాడు కేశవమూర్తి.

"ఏమని చెప్పిందా? మీలాంటి సుందరాంగుడెక్కడా దొరకడని, మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటానని చెప్పింది".

"పిల్ల భావుకతతో ఏదో అని వుంటుంది. ఏవేవో ఊహించుకుని, వాస్తవికతను మర్చిపోయింది. చిన్నప్పటినుండీ ఆదరంగా చూస్తే అది ప్రేమ అనుకున్నది పిచ్చిది. కృతజ్ఞతే ప్రేమనుకున్నది. పోనీ నాకు రాయొచ్చుగా, నేను పాపకు సర్దిచెప్పేవాణ్ని" అన్నాడు కేశవమూర్తి.

"ఆ... సర్ది చెప్తారు, ఇద్దరూ కల్సి వుడాయించేవాళ్ళు"

భార్యను ఈసడింపుగా చూశాడు కేశవమూర్తి.

"స్త్రీ మూర్ఖత్వాన్ని ఆ భగవంతుడనేవాడు ఎవడైనా వుంటే వాడే తొలగించాలి కానీ నావల్ల కాదు" అన్నాడు.

"అవును భగవంతుడు కనికరించబట్టే ఇవాళికొంప నిలిచివుంది" అందామె ధీటుగా.

అటుగా పోతున్న సీతను చూసి గదిలోకి పిలిచాడు కేశవమూర్తి. అతను వచ్చినప్పటినుండి ఆమె తప్పుకు తిరుగుతోంది. అతని ముఖంలోకి చూడటానికి భయపడ్తోంది. తానేదో తప్పుచేసినట్టు సిగ్గుపడుతోంది. సీత గదిలోకి వచ్చింది. చూపులు నేలమీద వున్నాయి.

"ఇట్రా పాపా... ఏమిటలా తలొంచుకు నిలబడ్డావు? అది సిగ్గా? భయమా? తలెత్తమ్మా...

సిగ్గుపడాల్సినంతపని నువ్వేం చేయలేదు. అంత భావుకత పనికిరాదు. వాస్తవికతను గుర్తుంచుకోవాలి. బావే గుర్తుండి, అక్క గుర్తు లేకపోతే ఎలా? అక్కే ముందొచ్చి, బావ తరువాత వచ్చాడు. ఇహ బయట విశాల ప్రపంచంలోకి వెళ్తున్నావు. నీ సొంత లోకంలోకి వెళ్తున్నావు. ఇంక నువ్వు తలదించుకోకూడదు. సిగ్గుతో తలదించుకోవాల్సిన పని నీవెప్పుడూ చేయవు, అని నా ఉద్దేశం- వింటున్నావా?'' అన్నాడు కేశవమూర్తి.

నేలమీద కాలి బొటనవేలితో రాస్తూ తలడూపింది సీత.

''అదిగో- ఇంకా తలవంచుకునే నిలబడ్డావు. పెళ్లికొడుకుని చూసి వచ్చాను. బాగానే వున్నాడు. మాట్లాడటం పడలేదు. మన స్కూల్లో చదవలేదుకదా, తాత దగ్గరుండి చదువుకున్నాడట. మనం ప్రపంచంవైపు నవ్వుతూ చూస్తే ప్రపంచం మనని నవ్వుతూ చూస్తుంది. ఊఁ... తలెత్తు. తలొంచుకు నిలబడకు.

ఇవాళ నిన్ను చూస్తే నాకు పాడాలనిపిస్తోంది''- 'మా సీతమ్మ పెళ్లికూతురాయెనే!' అని కీచు గొంతుతో బావగారు పాట అందుకోగానే సీతకు ఉక్కిరిబిక్కిరి అయ్యేంత నవ్వొచ్చింది.

''ఆఁ... అదే... నవ్వాలి... నవ్వాలీ... నవ్వులు పంచాలీ'' అని మళ్లీ పాటందుకున్నాడు కేశవమూర్తి. బావమరదళ్లు పకపకా నవ్వుతున్నారు. ఇన్నిరోజుల తర్వాత సీత మనసు స్వచ్ఛంగా, హాయిగా, మనోహరంగా వుంది.

వాళ్లిద్దర్నీ చూసి రాధ ఆశ్చర్యంలో కొయ్యబొమ్మలా నిలబడింది. తేరుకుని ''మీక్కూడా బుద్ధుందండీ'' అంది.

''ఔనేయ్! బుద్ధివుండబట్టే ఇన్నాళ్లుగా నీతో కాపురం చేస్తున్నాను'' నవ్వుతూ అన్నాడు కేశవమూర్తి.

రాధకు కళ్ళు చెమర్చాయి. ''నాదే పాపం, నేనే దుర్మార్గపుదాన్ని'' అంది కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ.

''నువ్వు నిజంగా దుర్మార్గపుదానివైతే, మేమెప్పుడో ఉడాయించేవాళ్లం. అంటే నువ్వింరాక అన్న అర్థంలో కాదనుకో. మాట్లాడే మనిషినిబట్టి మాటకు అర్థాలు మారతాయి. ఇన్నాళ్లూ కాపురంచేశాక నీ మాటల అర్థం నాకు తెలీదా?'' అన్నాడు కేశవమూర్తి.

రాధకి ఈరోజు భర్తలో ఏదో కొత్త వ్యక్తిని కనుగొన్నట్లనిపించింది.

''సరేలెండి... నాకవతల చచ్చేంత పనుంది'' అని బయటకు వెళ్లిపోయింది.

కేశవమూర్తి స్వచ్ఛంగా, తెల్లగా నవ్వాడు.

''బావా! ఇంత మధురంగా, హాయిగా నవ్వడం నువ్వెక్కడ నేర్చుకున్నావు?'' అడిగింది సీత.

''నిన్ను చూసేనమ్మా'' అన్నాడు కేశవమూర్తి.

''నేనెప్పుడూ ఏడుస్తూ వున్నట్టే గుర్తు''

''ఔను. పిల్లవాడు బొమ్మను చూసి ఆడుకుంటాడు. విరగ్గొడతాడు. విరిగిపోయిందే అని ఏడుస్తాడు. తల్లి అదిలిస్తే ఏడుస్తాడు. తండ్రి ఆదరిస్తే నవ్వుతాడు. పిల్లవాడి ఆటలు, ఏడుపు, నవ్వు పెద్దవాళ్లకి నవ్వు తెప్పిస్తాయి''
అన్నాడు కేశవమూర్తి.

ఈయన తను రోజూ చిన్నప్పటినుండి చూస్తున్న బావేనా అన్నట్లు చూస్తుండిపోయింది సీత.

మర్నాడు రాత్రి ఎనిమిదిన్నరకి ముహూర్తం. ఒకరోజులో వీలైనంతమందికి శుభలేఖలు పంచిపెట్టాడు కేశవమూర్తి. పెళ్లికోసం తీసుకున్న హాలంతా బంధువులతో, ఆహ్వానితులతో నిండిపోయింది. ఒకపక్కన భోజనాలు అవుతున్నాయి.

మంగళసూత్రధారణ అయి, స్థాలీపాకం జరుగుతోంది.

''ఆలశ్యమైపోయింది సీతా! ఈ మధ్యనే ఊళ్ళోలేను. బిజినెస్ మొదలెట్టాలని మా నాన్న స్నేహితుడు బొంబాయిలో వుంటే వెళ్లాను. ఇంతకు గంటక్రితమే వచ్చాను. నీ పెళ్లని తెలిసింది, పరుగెత్తుకొచ్చేశాను'' అన్నాడు అప్పుడే వచ్చిన శ్రీహరి- సీతకు అభినందనలు తెలుపుతూ. ఎప్పటిలా వెలిగే మొహం కాదతడిది. దీపం ఆరిపోయినట్టు మొహంలో అలసట, అది పట్టించుకోక తిరుగుతున్నట్టు అన్పించింది.

మొదటిసారిగా తనేదో రత్నాన్ని జారవిడుచుకున్న అనుభూతి కలిగింది సీతకి. అదేమీ కన్పించనీయకుండా ''అవును... నువ్వెప్పుడు సమయానికొచ్చావు గనక? నేనెక్కిన రైలుబండి ఒక జీవితకాలం లేటని- అలా వచ్చావు'' అంది నవ్వుతూ.

''మాస్టారికి కనబడి వస్తాను'' అని నవ్వి వెళ్లిపోయాడు.

''ఎవరే అతడు?'' అడిగాడు కోటేశ్వరరావు.

గంటక్రితం తాళికట్టిన భర్త 'ఏవే' అన్న చనువుతో పలకరించటం సీతకి ఎబ్బెట్టుగా అన్పించింది. ఒకవేళ తానే పొరపాటుగా విన్నదేమోనని సమాధానపడ్డది.

''మా ఫ్రెండ్'' అన్నది సీత మెల్లగా.

''అంటే'' అర్థంకాక అడిగాడు భర్త.

''మా క్లాస్‌మేటొ''

''ఓహో...'' అని భుజాలెగరేశాడు కోటేశ్వరరావు.

అప్పగింతలైపోయాయి. రాధ చెల్లెలు వెళ్ళిపోతున్నందుకు వెక్కివెక్కి ఏడ్చింది. సీతకూ ఎంతో దిగులనిపించింది. తను పెరిగి అలవాటైన వాతావరణంనుండి వెళ్ళిపోతుంటే మనసు రోదించింది. అక్కాచెల్లెలూ పరస్పరం కావలించుకు ఏడ్చారు.

"బాగానేవుంది లేవండి... పాప ఎక్కడికి పోతోంది? పాపని ఓదార్చాల్సిందిపోయి, నువ్వే ఏడిస్తే, ఎట్లారాధా? ఏం బాలేదు. ఏయ్ పాపా! ఏంటది? లేలే" అని ఇద్దర్నీ మందలించాడు కేశవమూర్తి. సీత బావఎదమీద తలపెట్టి ఏడ్చింది. కేశవమూర్తి సముదాయిస్తున్నాడు. కోటేశ్వరరావుకు ఇదంతా దుర్భరంగా వుంది.

"ఏమిటదీ... ఎవరో పోయినట్లు, పద పద" అన్నాడతడు.

కేశవమూర్తి అతనికేసి వింతగా చూశాడు.

అత్తవారింటికి వెళ్లేందుకు ఆటో పిల్చారు. సీత, కోటేశ్వర్రావులు ఒక ఆటో ఎక్కారు.

"వస్తామండీ! అన్నగారూ!" అని ఆటోలో కూర్చున్నాడు కోటేశ్వరరావు. ఆటో కదిలిన తరువాత భార్యతో- "ఏమిటది? మరీ సిగ్గూఎగ్గూ లేకుండా మగవాళ్లమీదపడి ఏడ్వడం?" అన్నాడు.

"ఆయన మా బావండీ" అంది సీత.

"ఔను మీ బావతో బాగా చనువున్నట్టుందే?"- అని భార్యతో జోక్‌చేసినట్టు నవ్వాడు.

"అఁ వుంది... అక్కతో, బావతో చనువుంది"

"కానీ బావమీదే ఎక్కువ ప్రేమున్నట్టుంది?"

సీత ఏంమాట్లాడలేదు. "ఏమిటీ మనిషి?" అనుకుంది మనసులో. పెళ్లికిముందు అందరూ అతణ్ణి పొగిడేవాళ్లే. అన్నపూర్ణ పిన్ని అక్కతో చెప్పడం తను విన్నది. కోటేశ్వర్రావు బుద్ధిమంతుడు ఒక్క చెడు అలవాటు లేదు. సిగరెట్టు తాగడు. అక్కడిదాకా ఎందుకు?, కాఫీనే తాగడు" అన్నది. 'ఏమీ అలవాటు లేని ఈయనకు ఈ అలవాటు వుంది కాబోలు' అనుకుంది సీత.

అలా అనుకున్న మరుక్షణంలోనే తనను తాను సర్దుకుంది. తనే నిన్న మొన్నటిదాకా భ్రమలో వుంది. చిన్నప్పటినుంచి పెంచి పెద్ద చేసిన బావను తను కోరడమేమిటి? మరి లోకం అంతకంటే ఎక్కువేం ఊహిస్తుంది? భర్త అలా మాట్లాడ్డంలో తప్పేముంది?

పెళ్ళై, అత్తగారింట్లో మూడునిద్రలై మళ్లీ తమింటికి మూడు నిద్రలకొచ్చినప్పుడు భర్త విశ్వరూపం కనబడింది. కోటేశ్వర్రావు అలకపాన్పెక్కాడు. తనపాత్ర అద్భుతంగా నిర్వహించాడు. సంప్రదాయాలపట్ల అతనికున్న భక్తిచూస్తే నిజమైన సంప్రదాయికులెవరైనా వుంటే ఊరేసుకు ఛస్తారు. బైట తండ్రి గదిలో కొడుకు ఒకరికొకరు పోటీపడి అలకసాగించారు. అలకపాన్పుమీద అల్లుడు టీవీసెట్ కావాలన్నాడు.

కేశవమూర్తి, నరసింహమూర్తికి నచ్చజెప్పచూశాడు. "చూడండి మాష్టారు! ఇది మనం మాట్లాడుకున్నది కాదు. కట్నంకింద 20 వేలు చేసే ఎకరంభూమి రాసిస్తిమి. వున్నదాంట్లో ఖర్చుపెట్టి పెళ్లి చేయిస్తిమి. నా సంపాదన మీకు తెలును. ఏంబెట్టి టీవీ సెట్టివ్వాలో అర్థంకావడంలేదు. అనుకున్నది లేదనకుండా జరిపాం. మీరైనా మీ అబ్బాయికి నచ్చజెప్పాలి"- అని.

"య్యి య్యి ఇదిగో! క్కే క్కేశవమూర్తీ! అబ్బాయిని న్న న్న న్నమాధానపర్చవయ్యా. న్నా న్నాకేంపట్టింపులేదు. వావ్వాడు నరేనంటే నరే. ఏ. ఏదో ముచ్చటపడ్తున్నాడు జ.. జరిపిస్తే మంచిది" అన్నాడు.

అన్నపూర్ణ భర్త రామకృష్ణయ్య, నరసమ్మ భర్త జానకి రామయ్య నరసింహమూర్తికి నచ్చచెప్పాలని చూశారు కానీ ప్రయోజనం లేకపోయింది.

తండ్రివల్ల లాభంలేదని కోటేశ్వరరావే రంగంలోకి దిగాడు.

"అన్నగారూ... సంప్రదాయం అంటే సంప్రదాయమే. పోనీ అంతా మోడ్రన్ ఫాషనంటే అలాగే. నాకీ కలగలపు నచ్చలేదంతే. మీకు సరిపోయినంతవరకూ సంప్రదాయమా? పెళ్లేమో పురోహితులతో, వేదమంత్రాలతో, సంప్రదాయపద్ధతిలో జరగాలి. అలకపాన్పుమీద అల్లుడి ముచ్చట తీర్చడానికి వచ్చేటప్పటికి అభ్యుదయభావాలు కావాల్సివచ్చాయి. పోనీ

రిజిష్టరుమారేజీ చేసుకుని, కట్నం, లాంఛనా లూ మానేసి, దండలు మార్చుకుని, స్నేహితు లకీ, బంధువులకీ ఓ పార్టీ ఇస్తే సరిపోయేది. అలా అనుకున్నట్లయితే, మా మనసుకు నచ్చితే పెళ్లికి ఒప్పుకునేవాళ్లం, లేకపోతే లేదు. అంత్య నిష్ఠూరంకంటే ఆది నిష్ఠూరం మంచిదండీ. అన్నీ సంప్రదాయంప్రకారం చే సేవాళ్లకి పెళ్లికొడుకు అలకపాన్పు ఎక్కుతా డు, వాడికోర్కె తీర్చడం పిల్లనిచ్చిన మీ బాధ్య తని మీకు తెలియదండీ అన్నగారూ? పెద్దవా రు మీరు. మిమ్మల్ని కించపర్చడం నా ఉద్దే శంకాదు. వెధవది టీవీ మేం కొనుక్కోలే మండీ? నాలుగు వేలుపెడితే వస్తుంది. ఇంత ఖర్చుపెట్టి పెళ్లిచేసిన మా నాన్న వెనకాడ తాడా? మన సంప్రదాయాలమీదవున్న భక్తి తప్పితే మాకు మరో పట్టింపేంలేదు. ఇవాళ ఇది కాదనుకుంటాం, రేప్పొద్దున భార్యాభర్తల సంబంధమే కాదనుకునేస్థితికి వస్తాము. కాంట్రాక్ట్ మారేజీలు, సౌలభ్యాల పెళ్లిళ్లు, రోజు రోజూ వ్యవస్థ పతనమవుతోంది. ఇవాళ ఒకటి సంప్రదాయం కాదనుకుని వదిలేస్తే, రెండోది మన చేతిలోంచి జారిపోతుంది. అందువల్లే ఈ పట్టుదల. టీవీ లేకపోతే టీవీఎస్ కొని వ్వండి. మా ముచ్చట తీర్చడం ప్రధానం. నేను అన్నదాంట్లో తప్పేవన్నా వుంటే, చెప్పుచ్చుక్కొ ట్టండి అన్నగారూ నేను పడతాను'' అన్నాడు కోటేశ్వర్రావు. 'డెవిల్‌కోట్స్ స్క్రిప్చర్స్' అన్న ట్టుంది అతని పద్ధతి. అలా వితండవాదం చేస్తున్న మనిషితో, మూణ్ణిద్దర్లలోనే చెప్పుచ్చు క్కొట్టు అన్న సిగ్గులేని వ్యక్తితో ఏం మాట్లాడాలో అర్థంకాలేదు కేశవమూర్తికి.

''పోన్లేరా కానీ, అబ్బాయి ముచ్చటపడుతు న్నాడు, కానీ'' అన్నారు మేనత్తలూ, వారి భర్తలూ. పెళ్లని వ్యవధానం లేకుండా తెలియ డంతో ప్రావిడెంట్‌ఫండ్ ఆఫీస్ చుట్టూ తిరిగి, తన ఫండులో పదివేలరూపాయలు పట్టుకొ చ్చాడు కేశవమూర్తి. వాళ్ల ఎత్తు ఎత్తు మర్యాద లకీ, అనుకోని కోర్కెలు తీర్చడానికీ డబ్బంతా ఖర్చయ్యింది. భార్య ఎకరం పొలం అమ్మగా వచ్చిందాంతో పెళ్లి జరిపిద్దామని రాస్తే, తను ఎందుకైనా వుంటుందని ఆ డబ్బు తెచ్చాడు.

జీవితంలో మొదటిసారిగా మూడురూపాయల వడ్డీకి 5 వేల రూపాయలు అప్పుతెచ్చి, కోటేశ్వ ర్రావుకు టీవీ కొనిచ్చాడు కేశవమూర్తి.

జరుగుతున్న సంఘటనలన్నీ అపశ్రుతు ల్లాగే కన్పించాయి కేశవమూర్తికి. సీత జీవితం ఎలా వుంటుందో అన్న భయం అతనికి పట్టు కుంది. అయితే తన భయాలేవీ ఆమెముందు వెళ్ళబుచ్చలేదు కేశవమూర్తి. రాధ ఇదంతా ఊహించలేదు. వీళ్లింత గోలచేయగలరని ఆమెకు తెలియదు. భర్తకు తెలియకుండా చేసినందుకు మొదటిసారిగా పశ్చాత్తాప్ప డిందామె. ఏమీ తెలియదని తననుకునే భర్తకు తెలియందేమీలేనట్టు తెలిసి ఆమె మనసు వినమ్రమైంది. సీత జీవితాన్ని ఊహించుకుని భయపడసాగింది.

కాపురానికి వెళ్లేముందు అక్కకిచెప్పి, బావకు చెబ్దామని వెళ్లిన సీతతో అన్నాడు కేశవమూర్తి.

''పాపా... ఇది చివరిపాఠం. చిన్నప్పట్నుంచీ నీకు చెప్తూనే వున్నాను కదమ్మా పాఠాలు! భవిష్యత్తును భయంకరంగా ఊహించుకోకు. పరిస్థితి మన ఊహల్లో వుండేంతఘోరంగా వాస్తవానికి వుండదు. మనుషుల్ని వక్రించి చూడకు. జీవితంతో రాజీపడవద్దని చెప్పడంలే దు. అయితే మన స్వాతంత్ర్యానికి, ఆత్మగౌర వానికి భంగంకల్గించేరాజీ పడకు. తనని తా ను గౌరవించుకోలేని మానవుడు ఇతర్లను గౌర వించలేడు.

తన్ను హీనపరచుకునేవాడు ఇతర్లను హీ నంగానే చూస్తాడు. వద్దు ఆ పతనం వద్దు. ఏ బంధనాలైనా మనం కల్పించుకునేవే. ఇవేవీ సహజం కావు. అందువల్ల సహజంగా, స్వే చ్ఛగా, మనసుకు ఆనందం కలిగేవిధంగా బతకాలి. ఆ ప్రయత్నం చేయి. నీ బతుకు నువ్వు బతకబోతున్నావు. అందుకని ఇన్ని మాటలు చెప్పాను'' అని ఒకక్షణమాగి సందే హిస్తూ చివరకు అన్నాడు- ''కాపురానికెళుతు న్న ఈ చివరిక్షణంలో మీ అక్కమీద కోపంతో తిట్టిందనీ, కొట్టిందనీ బాధతో వెళ్లకు. అవన్నీ మనసులో పెట్టుకోకు. మీ అక్కకు పుట్టిన ఒక్క నలుసూపోయి, ఇక పుట్టరనే అక్కను, ఏమీ చేయలేని నిస్సహాయత, తన గర్భవాసంలో పుట్టనివారిని తన బిడ్డలుగా భావించలేని




Phones : 6054, 5542, 7755, 7720

# KORA



## Institute of Medical Engineering Entrance Coaching

Near Z.P.Office Nellore-3



**EAMCET**

మెడికల్ ఎంట్రన్స్‌లో
మొదటి ర్యాంక్

## సౌజన్య

**1988 EAMCET** మెడికల్ ఎంట్రన్స్‌లో **1,4,5,8,18,22,22,25,26,28,30,30,43,47,51, 56,66,72,79,81,82,84,86,91,** లాంటి ఉత్తమ ర్యాంకులను మరియు ఇంజినీరింగ్ ఎంట్రన్స్‌లో **12,42,61,67,71,72** లాంటి ఉత్తమ ర్యాంకులను సాధించిన మా విద్యార్థినీ విద్యార్థులకు

★ మా హృదయపూర్వక అభినందనలు! ★

**1989 EAMCET** పరీక్షలకు LONG TERM శిక్షణా తరగతులు ఆగస్టు నెలలో ప్రారంభించబడును.

వివరములకు సంప్రదించండి :

ARCHANA ADS.

బలహీనత, అందుకే ఒక్కోసారి అలా ప్రవర్తించింది. తిట్టింది, కొట్టింది, కానీ నీ మంచికోసమే. పెళ్లి చేయాలని తాపత్రయపడ్డది. అర్థంచేసుకో. ఆమెపట్ల ఎలాంటి ఉదాసీనభావమూ మనసులో వుంచుకోకు. లివ్, జస్టిఫయింగ్ ది వేస్ ఆఫ్ మాన్ టు మాన్" అని నిట్టూర్చాడు.

సీత అతని కాళ్లకి వంగి దణ్ణం పెట్టపోయింది. "వద్దు అది నాకిష్టం లేదు, నీకు తెలును ఒక మనిషి మరో మనిషికి వంగి దణ్ణం పెట్టాల్సిన అవసరంలేదు. మనిషిమనిషిగా బతకాలి. పరిస్థితులను ఎదిరించైనా బతకాలి. చివరిపాఠం అయిపోయింది. ఇక మీ ఇంటికి వెళ్లు" అన్నాడు కేశవమూర్తి.

సీతకు కళ్ళంట నీళ్లొచ్చాయి. "ఇది నా ఇల్లు కాదు, మా ఇంటికి వెళ్లాలి కాబోలు" గొణుక్కుంది.

ముందు గదిలో నుండి భర్త మాటలు విన్న రాధకు తన ఆలోచనలెంత కృతకాలో, ఎంత అబద్ధపు జీవితం గడిపిందో కళ్ళకు కట్టినట్లైంది. ఆమె మనను బాధపడింది. 'ఈ మనిషిని అర్థం చేనుకోకుండా నేనింతకాలం కాపురం చేశానేం'- అనుకుంది. జీవితమంతా పావ తన బిడ్డ కాదనుకుంటూనే ఉందిగానీ తన మనసు చెప్పే సత్యం తనెప్పుడూ గుర్తించలేదేం? పావలో కూతుర్ని చూశాడు భర్త. చేతనావస్థలోని మనసులో ఆమె తన బిడ్డ కాదంటూనే ఉంది. ఈ విడిపోయే క్షణంలో అంతః చేతనలోని నిజం పావను తన కూతురని తనకు తెలీకుండానే భావించిన నిజమామెను విచలితం చేసింది. ఆ భావనే- పావ ఎక్కడ చెడిపోతుందో, ఎవరు చెడగొడ్తారో, అన్న ఆలోచనతో తను తప్పులు చేసింది. భర్త పట్లా, పావ పట్లా ఘోరాపరాధం చేసింది.

ఆటో వచ్చింది. సీత, కోటేశ్వర్రావులు వెళ్ళిపోయారు. కేశవమూర్తి వారికి స్టేషనులో వీడ్కోలు చెప్పివస్తాని వెళ్ళిపోయాడు. రాధ తన ప్రపంచాన్ని కోల్పోయినట్టు నిరామయంగా చూస్తూండిపోయింది.

* * *

వైజాగ్ వచ్చి భర్త తమకోసం తీసుకున్న ఇల్లు చూసి నీరుకారిపోయింది సీత. ఆ ఇంట్లో ఎన్నో పోర్షనులు కామన్ బాత్రూం, లావెటరీ-లు ఓ మూల ఓ చిన్న వంటిల్లు, ఇంకో చిన్నగది. అది వాళ్ళ ఇల్లనే స్వర్గం. ఆ స్వర్గాన్ని చూసి సీత హతాశురాలయ్యింది. సామాన్లన్నీ ఇంట్లో దించిన తరువాత సీత కోటేశ్వర్రావుతో "ఏవిటండీ ఈ ఇల్లు... మనుమల కోసమేనా?" అంది.

"ఇక్కడుండేవాళ్ళందరూ మనుమలు కాదూ? జంతువులా? మీ వాళ్ళని డబ్బేమైనా ఉంటే పంపమను, ఇంతకంటే మంచి ఇల్లు తీసుకుందాం" అన్నాడు కోటేశ్వర్రావు.

"మా వాళ్ళెందుకివ్వాలి? ఇచ్చేదేదో ఇచ్చేశారు. ఇంకేం ఇవ్వాల్సిన పనిలేదు" అంది సీత.

"ఏవిచ్చారే? ఆమాత్రం తమ పిల్లలకోసం అంతా చేస్తున్నారు. బోడి మీ అక్కా, బావల గొప్పేంలేదు"

"ఔను వాళ్ళ గొప్పేంలేదు. ఇంకా కావాలి, ఇంకా కావాలి అనడంలోనే మీ గొప్ప బాగా వ్యక్తమౌతోంది" అన్నదామె.

"ఇదిగో... ఇలా నా మాటకు ఎదురాట్టంనే సహించలేను. నాకెదురు జవాబులు చెప్పొద్దు. మనజీతంలో ఇంతకంటే అద్దెపోయలేం, ఇంతకంటే పెద్దిల్లురాదు" అన్నాడు కోటేశ్వర్రావు.

"మీ జీతమెంత?" అడిగింది సీత.

"నీకాబోడి ఆరాలన్నీ అనవసరం. కుక్కిన పేనులా పడివుండు" కోపంగా అన్నాడు కోటేశ్వర్రావు.

అలాంటి నరాగాలతో, సరసాలతో మొదలయింది వారి కొత్తకాపురం. అన్నపూర్ణమ్మ చెప్పిన మాట నిజం. కోటేశ్వర్రావు సిగరెట్టు తాగడు, చివరికి కాఫీ కూడా తాగడు. పాడు అలవాట్లేంలేవు. పొద్దున్నేలేచి, బుడుంగుమని చన్నీళ్ళతో స్నానంచేసి, పూజ, పునస్కారాలు శ్రద్ధతో కానిచ్చి, చద్దన్నం తినేసి, తొమ్మిదిన్నరకు ఆఫీసుకెళ్ళిపోతాడు. ఆఫీసెంతో దూరంలోలేదు. మధ్యాహ్నం వంటిగంటకు మళ్ళీ భోజనానికి వస్తాడు. సాయంత్రం కాఫీలూ, టిఫెన్లు అక్కర్లేదు. మళ్ళీ రాత్రి భోజనమే. నిజంగా భర్తకోసం సీత చేయాల్సిన పన్లేమీ

లేవు. వేణ్ణీళ్ళు కాచనక్కర్లేదు. కాఫీ, టిఫెన్లు చేయనవసరంలేదు. అయితే భోజనంలోకి అన్నీ సుష్టుగా కావాలి. ఏమాత్రం లోపం జరిగినా అతడు సహించడు. ఇంటిక్కావాల్సిన వెచ్చాలు, కూరగాయలు అతనే తెస్తాడు. సీతకేం పనిలేదు. ఆమె మాత్రం అర్థంలేని కోరికలు కోరుకోకూడదు. వెధవ కాఫీ లేకపోతే ఏంబోయె? సినిమాలవసరం ఏవుంది? వాటిల్లో రేపుసీన్లు, అర్ధనగ్న దృశ్యాలు, బరితెగించిన ఆడముండలు, బోడి స్వాతంత్రం వెలగబెట్టడం, సమాన హక్కులట- ఆడవాళ్ళను చెరిచేందుకు వచ్చిన సినిమాలు- చూడకపోతేనేం? పైగా డబ్బు దండగ. షికార్లకెళ్ళడం, భార్యకు పూలు తేవడం వగైరా కూడా కోటేశ్వరావుకు ఇష్టంలేదు. వాటివల్ల ఏంలాభం? "ఆడది తిరిగి చెడిందని" సామెత ఉండనే ఉంది. పువ్వులా ఉన్న భార్యను నలిపేయడమే తెల్సుగానీ, పువ్వులు కొనిపెట్టడం తెలీదు కోటేశ్వరావుకు. పూలు పెట్టుకుంటే వంటికేమన్నా బలమా? పాడా? ఆఁ సీతను మాత్రం చక్కగా భోంచేయాలని శతపోరి చెప్తాడు 'పాడు మొహంది, తిని చావలేదు' అని ప్రేమగా అనుకుంటాడు భార్యను గురించి.

ఆరోజు మధ్యాహ్నం లంచ్అవర్లో భోజనానికి వచ్చినప్పుడు అన్నం తింటూ- "కూరలో ఇంత కారం తగలెట్టావేమే? నీ బొందవంట నీ బోలె వంట, మిరపకాయలు ఊరికే వస్తున్నాయా" అన్నాడు.

సీతకు భర్తగారి సరాగాలు కాపురానికొచ్చిన కొద్దికాలంలోనే బాగా అలవాటైంది. ఉప్పు తక్కువైందనో, ఎక్కువైందనో, అన్నం మెత్తనైందనో, బిరుసైందనో- ఏదో వంక చూపనిదే, లోపం చూపనిదే, భోజన కార్యక్రమం ముగించేవాడుకాదు.

"అరగంటలో అరిగిపోయేదానికి ఇంత నసపెడ్తారేం?" అన్నది సీత.

"ఇదిగో, ఈ తలతిక్క జవాబులు చెప్పొద్దు. వంట తిన్నగా చేయని ఆడదేం ఆడదంట. అసలు మీ పుట్టింట్లో నువ్వు వంట నేర్చుకున్నావా? మీ అక్క నిన్ను కూర్చోబెట్టి రాణీగా ఠీవీగా మేపినట్టుంది. మీ బావ ఆడ, మగ తేడా లేకుండా తిరగడం నేర్పాడు నీకు" అన్నాడు

"మా అక్కా, బావల సంగతి మీకనవసరం. మీరేవన్నా అనదల్చుకుంటే నన్నునండిగానీ వాళ్ళననకండి" అన్నది సీత.

"నోర్మూసుకో, చెప్పొచ్చావు. బోడి చదువు చెప్పించి, నా తలమీద డాన్సు చేయమని పంపాడు మీ బావ. వట్టి త్రాష్టపు ముండాకొడుకు. వెధవ టీవీ ఇవ్వడానికి ఎంత ఇదైపోయాడు. తన సంపాదనంతా నేనేదో దోచుకున్నట్టు ఏడ్చిచచ్చాడు. మీ నాయన సొమ్ము ఎంత తిన్నారో వాళ్ళు, నీకేమన్నా లెక్కతెలుసా? ఎన్నెకరాలు అమ్మారో, ఎంత స్వాహా చేశారో చివరకు నువ్వొచ్చేటప్పటికి ముష్టి ఎకరం కట్నంగా చదివించడానికి కూడా కష్టమయింది" అన్నాడు కోటేశ్వరావు. భార్య ఆస్థినంతా న్యాయంగా తన హక్కుగా రావాల్సిందంతా, వాళ్ళే మింగేసి, తనకు ఒట్టిచెయ్యి చూపారన్న ఆక్రోశంతో.

"మా బావ దేవుడండీ! ఆయనన్నేం అనకండి. మిగిలిన మూడెకరాల్లో ఒక ఎకరం మీకు కట్నంకింద చదివించారు. ఒక ఎకరం పొలం అమ్మితే వచ్చిందాంతో పెళ్ళి చేశారు. అదే చాలకపోతే మా బావ ప్రావిడెంట్ ఫండ్లో పదివేలు అప్పుచేశాడు" అంది సీత.

"ఈ వెధవ కబుర్లన్నీ నాకు చెప్పకు. అప్పుగా వచ్చిందాంట్లో తినకుండా ఎవడూ ఏంచేయడు. ఇక ఆదేవుడి సంగతి నా దగ్గరెత్తకు. నా చెవిలోనూ పడ్డాయి మాటలు. మీ అక్కకి పిల్లలు కలగనందుకు, మీ బావ నిన్ను కట్టుకోవాలని చూశాడట. మీ అక్కే పడనీకుండా నీ పెళ్ళి చేసిందంట" అన్నాడు కోటేశ్వరావు.

"ఎవరు చెప్పారు మీకు?" అనడిగిందామె.

"ఎవరు చెప్పేది? లోకం కోడై కూస్తుంటే. మీ అక్క వద్దన్నా నీకు చదువు చెప్పించడం, ఇష్టమొచ్చినట్టు తిరగనీటం - ఇదంతా ఎవరికోసం చేశాడే తప్పుడు ముండా?! నీక్కూడా మీ బావనే చేసుకోవాలనే వుందట. ఆఁ 'మజ్జిగ పోసి తగలడు" అన్నాడు కోటేశ్వరావు. అక్క తన బాధ ఇరుగుపొరుగులలో వెళ్ళబోసుకోవడం, అవి ఆనోటా, ఈ నోటాబడి చివరికి భర్త

చెవిలో పడ్డాయని అర్థమైంది సీతకి.

ఆలోచనల్లో వున్న సీత మజ్జిగ పోస్తుంటే కంచంలో చేయిపెట్టుకున్న కోటేశ్వర్రావు చేతి మీదపడ్డాయి. దాంతో అతడు ఉగ్రమూర్తయ్యాడు.

"పాడుముండా... మొగుడు ముండాకొడుక్కి శ్రద్ధగా తిండి పెట్టాలన్న ధ్యాసకూడాలేదు. ఏమాలోచన్లే? మనసు ఆ బావగాడిదకొడుకు దగ్గరికెళ్ళిందా? ఛీ... నా కూడు తిని, నేనిచ్చింది కట్టుకుని, ధ్యాసంతా వాడిమీదటే భ్రష్టపు మొహందానా?" అని కాలితో కంచాన్ని ఒక్క తన్ను తన్నిలేచి, వంటింటి గట్టుదగ్గర చెయ్యికడుక్కుని, హడావిడిగా ఆఫీస్‌కి వెళ్ళిపోయాడు.

మజ్జిగన్నం వంటింట్లో గిన్నెలమీదా, నేలమీదాపడి వంటిల్లు అల్లకల్లోలమైంది. తనింకా భోజనం చేయలేదు. భర్తలాగా చద్దన్నం తినే అలవాటు తనకులేదు. ఇంట్లో ఫలహారాలు చేయడం నిషిద్ధం. అసలు అలాంటివి చేయడానికి కావాల్సిన వస్తువులు ఇంట్లోకి తీసుకురాడతను. తను అతనికంటే ముందు భోజనం చేయడానికి వీల్లేదు. అది పతివ్రతా లక్షణం కాదట. అతనితోనూ కలసి భోంచేయవీల్లేదు. భర్తకు శ్రద్ధగా వడ్డించాలి. వినసక్రతో వినరాలి. చక్కటి కబుర్లుచెప్పి భర్త సుష్టుగా భోంచేసేట్టు చూడాలి. ఆ తరువాత భర్త తినేసిన కంచంలో తను వడ్డించుకు తినాలి. తనకలా ఇష్టంలేక అతను లేనప్పుడు ఆ కంచం కడిగేసి (ఇంట్లో ఒకటే కంచం) మళ్ళీ తనకు ఉపయోగించుకున్నా అతను ఇంట్లో వున్నప్పుడు మాత్రం అలా వీలయేదికాదు. భార్య ఏంచేస్తోందో పరామర్శించి చూస్తుండేవాడు. "అక్క, బావ పాలనలో చెడిపోయింది భార్య. తను మళ్ళీ జాగ్రత్తగా దోవలోకి తీసుకురావాలి"-- ఇలా సాగేవి అతని ఆలోచనలు. సీతకు నీరసం అన్పించింది. వంటిల్లు బాగుచేసి, అన్నం తినే ఓపిక లేదామెకు. అలాగే వెళ్ళిముందు గదిలో చాప పరచుకునిపడుకుంది.

సీతకి జీవితం శూన్యంగా కన్పించింది. ఏవిటిది? పెళ్ళి చేసుకుంటే స్వాతంత్ర్యం వస్తుందని తను అనుకుంటే పెళ్ళైనంత మాత్రాన స్వాతంత్ర్యం రాదని బావ అనడం గుర్తొచ్చిందామెకి. స్వాతంత్ర్యం సంగతలా వుంచి ఈ ఇల్లే తనకు జెయిలయింది. తను ఎక్కడకూ బయటకు వెళ్ళడానికి వీల్లేదు. ఎవరూ తమ ఇంటికి రావడానికి వీల్లేదు. పత్రికలూ, పుస్తకాలూ చదివేది బోగంముండలే గానీ సంసార స్త్రీలు చదవరు. అందువల్ల అవి ఇంటికిరావు. ఎంతసేపూ ఇంట్లో పని, వంట, తిండి తినడం, మధ్యాహ్నం వీలైతే ఒక కునుకు, మళ్ళీ రాత్రికి వంట, రాత్రికి భర్త చేతుల్లో హింసించబడటం ఇదే దినచర్య.




సీత ఇదివరకటిలా బేలకాదు. ప్రతి చిన్న విషయానికీ బాధపడటం మానుకుంది. ఈ పరిస్థితిలో మార్పు తేవాలి - అని నిశ్చయించుకుందామె. కాపురానికొచ్చినప్పటినుండి తన జీవితాన్ని ఒకసారి సింహావలోకనం చేసుకుని సమీక్షించుకున్నదామె. మొదట్నుండి భర్తననే అధికారంతో అతడెలా మాట్లాడినా, ఏంచేసినా సహించిందామె. తీసుకొచ్చి ఈ జైల్లో పెట్టాడు. నలుగురుతో కలసి తిరగనివ్వడు. 'తిరిగి ఆడది చెడిపోతుంది' అని అతడి ఉద్దేశం. తను భర్తతో రాజీపడిపోతోంది. ఇలా అయితే తను మరి లేవలేదు. పరిస్థితి నెదొర్కోవాలి. భర్తలో మార్పు తీసుకురావాలి. పాపం ఆయన్ది కూడా తప్పుకాదేమో. వాళ్ళూ, వీళ్ళూ మాటలు విని, తనకూ, బావకూ ఏదో సంబంధముందని అనుమానం ఆయనకు. ఆయన అనుమానాన్ని స్థిరపరిచేట్టు ఔతుందని మళ్ళీ వెళ్ళలేదు అక్కా, బావ దగ్గరకు. బావ మనిషినిచేసి, మనిషిగా బతక

మని తన్ను పంపిస్తే, తను చేస్తున్నదేంటి? జంతువులాగా బతకాలని ఆలోచిస్తున్నది. తనే ఈ పరిస్థితిని మార్చాలి అనుకున్నది సీత.

ఆ ఆలోచనతో ఉత్సాహం వచ్చిందామెకు. లేచివెళ్ళి వంటిల్లు బాగుచేసి, కంచం కడిగి అన్నం పెట్టుకుతిన్నది. బాగా పొద్దుపోవడంతో ఆమెకి తిండి సహించలేదు. సాయంత్రం భర్త ఆఫీస్‌నుండి ఇంటికి తిరిగి వచ్చేముందే తను వంటచేసి, వేణ్ణీళ్ళతో స్నానంచేసి ఉతికిన చీరె కట్టుకుని, శుభ్రంగా తయారైంది. ఇవాళ భర్తతో బయటికెళ్ళాలి. వీలైతే సినిమా చూడాలని నిశ్చయించుకుంది.

క్రమం తప్పని కోటేశ్వర్రావు ఐదున్నరకల్లా ఠంచనుగా ఇంటికి వచ్చాడు. భార్య అలంకరణ చూసి కళ్ళెగరేస్తూ- "ఏంటి బోగం ముండలా తయారయావు?" అన్నాడు.

"భార్యతో మాట్లాడే తీరు అదికాదు, మీరిలాంటి మాటలు మాట్లాడద్దు, వీటికి నేను అలవాటు పడలేదు" అంది.

"మరెలా మాట్లాడాలి ఆడదాంతో, పైగా పెళ్ళాంతో" అన్నాడు ఎకసెక్కంగా.

"పెళ్ళాం పెళ్ళామే, వేశ్యకాదు. ఈరోజు మనం బయటికెళ్తున్నాం"

"ఎక్కడికి?"

"బీచ్‌కి?"

"ఎందుకు?"

"ఎందుకేంటి... గాలి పీల్చుకోడానికి. ఈ జైల్లోంచి బైటపడ్డానికి"

"ఇల్లు జైలా? ఎవడే నీకు ఇన్ని మాటలు నేర్పింది?"

"ఎవరూ నేర్పఖ్ఖర్లేదు. నేనూ మనిషినే, నాకూ బుర్రవుంది ఆలోచించడానికి"

"ఆఁ వుంది... ఆడవాళ్ళ బుర్రలో మట్టితప్ప ఏముండదు" అని తన ఖచ్చితమైన అభిప్రాయాన్ని తెలియజేశాడు కోటేశ్వర్రావు.

"మీమాటలకు ఎదురుచెప్పి లాభం లేదుగానీ, బయల్దేరండి" అంది సీత.

"అంటే నా మాటలకర్థంలేదనా నీ ఉద్దేశం?"

"నాకే ఉద్దేశాలూలేవు, తయారై పదండి"

"నేను రాను"

"నేనెళ్తున్నాను"

"ఎక్కడికెళ్తావు?"

"చెప్పానుగా"

"చంపుతాను... నోర్మూసుకుని ఇంట్లో తగలడు"

"తగలడను... నేను బయటనుంచుంటాను. అయిదు నిముషాల్లో మీరు తయారై రాకపోతే, నేనొక్కతినే వెళ్ళిపోతాను" అని చెప్పేసుకుని బయటికి వెళ్ళి నిలుచుంది సీత.

బయట నిలబడ్డ భార్యతో వాదానికి దిగడం, తిట్టడం, కొట్టడం బయట అందరితో చాలా మంచివాడిలా, బుద్ధిమంతుడిలా చూడబడే తనకు కాని పని. ఏం చేయలేక గబగబా తయారయి, ఇంటికి తాళంవేసి తను బయలుదేరాడు.

బయటకు కాలుపెట్టి ఎన్నో ఏళ్ళు అయినట్టుంది సీతకు. మనసుకు ఎంతో హాయిగా అన్పించింది. తన జీవితాన్ని తనకు నచ్చినట్టు తీర్చి దిద్దుకోవాలన్న ఆలోచన వచ్చిందామెకు.

"ఓహెూహెూ... ఎటో బయల్దేరారు భార్యాభర్తలిద్దరూ?" అంటూ పలకరించాడు పరాంకుశం. తమింటి ఎదుటి పోర్షన్లో వుంటాడతను. ఆఫీసునుండి వస్తున్నాడు.

"ఏదోనండీ... అలా బీచ్‌కి బయల్దేరాం. ఇంట్లో తోచిచావడంలా" అన్నాడు కోటేశ్వర్రావు.

"మంచిది... మేమూ ఓ అరగంటలో తయారై అలా వస్తాంలెండి, అక్కడ కలుద్దాం" అని వెళ్ళిపోయాడు పరాంకుశం.

"ఇందుకనే నిన్ను బయటికితేను. ఆ త్రాష్టుడు చూడు ఎలా చూస్తున్నాడో నిన్ను?" అన్నాడు కోటేశ్వర్రావు.

"ఎలా చూస్తున్నాడు?" అందామె.

"అమాంతం మింగేసేట్టు, వాడి చూపులూ, చేష్టలూ. అసలు నీకు బుద్ధిలేదు. ఏవిటా అవతారం? ఆ సింగారం? సంసార స్త్రీ లక్షణాలేమైనా వున్నాయా నీకు?" అన్నాడు మెల్ల

గానే.

సీతేం మాట్లాళ్ళేదు. మాటకు మాట తెగు లు. ఏదో మాట్లాడితే అతను ఇంకేదో మాట్లాడి పెడర్థాలుతీసి రసాభాస చేస్తాడు. ఇద్దరూ నడుస్తున్నారు. దోవలో సినిమాహాలు కనబ డ్డది.

"పద సినిమాకు వెళ్దాం" అన్నాడు.

"బీచ్‌కన్నారుగా?!"

"వద్దు... మళ్ళీ ఆ వెధవ అక్కడికి తయారౌ తాడు" అన్నాడతను. సినిమాహాలు లోపలికి వెళ్ళారు.

"హాయ్! సీతా!" అని ఎవరో పిల్చారు. సీత ఉలిక్కిపడి, ఎదురుగా చూసింది. ఎదు రుగా వసంత. వసంతా వాళ్ళు ఆ ఊళ్ళో వున్నట్టు సీతకు తెలీదు. పెళ్ళైనప్పుడు ఆమె భర్త హైదరాబాదులో పనిచేస్తున్నాడు.

"నువ్వెప్పుడొచ్చావే ఇక్కడికి?" అడిగింది వసంత.

"ఎప్పుడు రావడమేంటి? ఇక్కడే వుంటు న్నాం. వీరు మావారు" అని భర్తని పరిచయం చేసింది సీత.

"నమస్కారమండీ... నేను మిమ్మల్ని పెళ్ళి లో చూసినట్టులేదు" అన్నాడు కోటేశ్వర్రావు.

"నేను పెళ్ళికి రాలేదు... వీల్లేకపోయింది" అంది వసంత.

ఇంతలో పిల్లవాణ్ణి నడిపిస్తూ, కూతుర్ని ఎత్తుకుని వసంత భర్త మోహన్రావు అక్కడికొ చ్చాడు. వాళ్ళకి చాక్లెట్లు కొనిపెట్టేందుకు వెళ్ళా డతడు.

వసంత భర్తను పరిచయం చేసింది. "బా బుకి నాల్గేళ్ళు. పేరు రమణ. పాప ఉష. రెండేళ్ళు" అని చెప్పింది.

మోహన్‌రావు కలుపుగోలు మనిషి. హైదరా బాదు నుండి ఈమధ్యే ఇక్కడికి ట్రాన్స్‌ఫర యింది. "డాబా గార్డెన్స్‌లో వుంటున్నాం, మీరె క్కడుంటున్నారు?" అని అడిగాడు.

కోటేశ్వర్రావు చెప్పాడు. "ఉండండి, టిక్కె ట్లు తీసుకొస్తా" అని మోహన్రావు కదిలాడు. కోటేశ్వర్రావు మాత్రం వసంతతో మాట్లాడుతూ టిక్కెట్ల విషయమే మర్చిపోయాడు.

"పదండి... ఆయన వెళ్తున్నారు. మీరెళ్ళి టిక్కెట్లు తీసుకురండి" అంది సీత.

"ఆయన తెస్తార్లేవే" అంది వసంత.

కోటేశ్వర్రావు నిమ్మకు నీరెత్తినట్లు వుండిపో యాడు. మోహన్రావు టిక్కెట్లు తెచ్చాడు. అంతా హాల్లోకి వెళ్ళారు.

వసంతా, సీతా ఎన్నాళ్ళకో కలియడంవల్ల పక్కల భర్తల నొదిలేసి, కబుర్లు చెప్పుకోసాగా రు.

"మిమ్మల్ని పెళ్ళిలో చూడటమే, మళ్ళీ కన్పించలేదుమీరు" అన్నాడు మోహన్రావు.

"మేమెట్లా కన్పిస్తామండీ బాబూ? ఆడవాళ్ళ మాయె మొగవాళ్ళ ఒద్దికలో బతకాల్సినవా ళ్ళం" అని నవ్వింది సీత.

"బాగుందిలెండి... మా కోటేశ్వర్రావుగారు అంత ఒద్దికలో పెడ్తున్నారా ఏం మిమ్మల్ని?" అన్నాడు మోహన్రావ్.

"ఈ ఆడవాళ్ళు ఇంతేనండీ అన్నగారూ! మనమెంత స్వాతంత్రమిచ్చినా, ఇంకా మనం వాళ్ళ స్వేచ్ఛని అరికట్టినట్టే అన్పిస్తుంది వాళ్ళ కి" అన్నాడు కోటేశ్వర్రావు.

"ఔనండీ... మీరన్నది నిజం. స్వేచ్ఛగానే వుంటారు. మనం నిర్బంధించి, బాధించినట్టు ఎద్దేవా చేస్తారు" అన్నాడు మోహన్రావ్.

"మీరేం స్వేచ్ఛ ఇచ్చారండీ? కూరలు తెచ్చుకోవడం, వెచ్చాలు తెచ్చుకోవడం, బట్ట లు కావలిస్తే నేనే వెళ్ళి కొనుక్కోవాలి. బాబుని నేనే వెళ్ళి స్కూల్లో దింపిరావాలి. ఇదేనా మీరిచ్చిన స్వేచ్ఛ? నాకీ రకపు స్వేచ్ఛ ఇచ్చేసి, మీరేమో పనేంలేకుండా రికామీగా తిరుగుతు న్నారు" అంది వసంత.

"నీపనే నయమే. బావగారు నీకాస్వేచ్ఛ అయినా ఇచ్చారు. ఇంటిపనంతా మావారే చేస్తారు..." అంది సీత.

"అంటే ఇల్లూడవడం, అంట్లు తోమడం, వంటచేయడం...." అంటూ నవ్వింది వసంత.

"ఛీఛీ... అది కాదే సరుకులు తేవడం, కూరలు తేవడం... వగైరా పనులు" అంది సీత.

"కోటేశ్వర్రావుగారు అయితే మా మరదల్ని



బాగానే సుఖపెడ్తున్నారన్నమాట" అన్నాడు మోహన్రావు.

"అయితే ఏంలాభం అన్నగారూ! ఈ ఆడ వాళ్ళకు తృప్తిలేదుకదా. ఎంత చేసినా ఇంట్లో వుండబుద్ధికాదు వీళ్ళకు. బయటపడాలి, సినిమాలు కావాలి, షికార్లు పోవాలి. మీకు తెలీందేముందిలేండి? ఏం మీరు మాత్రం భరించడంలా ఇవి?" అన్నాడు కోటేశ్వర్రావు.

"ఎందుకు భరించరు? చచ్చినట్లు భరిస్తారు. భరించువారు భర్త అన్నారు. చూడండి, ఆయన భుజాలెట్లా వంగిపోయాయో భరించీ భరించీ" అంది వసంత నవ్వుతూ.

అంతలో సినిమా మొదలుపెట్టారు. సినిమాహాల్లో కోటేశ్వర్రావు భార్యని జాగ్రత్తగా వేరే మగ గాలి తగలకుండా ఒక పక్క వసంతని కూర్చోబెట్టి, రెండో పక్క తను కూర్చున్నాడు. తన పక్కన ఆడవాళ్ళు కూర్చున్నా తనకేమిటి? మగమహారాజు.

ఇంటర్వెల్లో కూల్డ్రింక్‌లు తెప్పించడం, డబ్బివ్వడం మోహన్రావే చేశాడు. మొహమాటానికి కూడా తానిస్తానన్లేదు కోటేశ్వర్రావు. సినిమా అయిపోయాక వాళ్ళింటి ఎడ్రసు ఇచ్చి, దంపతులిద్దరినీ తమింటికి ఆహ్వానించారు మోహన్రావు; వసంత. వాళ్ళ ఇంటి అడ్రను అడిగితే "మీర్రావడం కష్టమండీ! మేమొచ్చి మిమ్మల్ని తీసుకెళ్తాంగా" అని తప్పించేశాడు కోటేశ్వర్రావు.

సినిమా వదలగానే వసంత, మోహన్రావులు రిక్షా కుదుర్చుకొని ఇంటికి వెళ్ళిపోయారు. కోటేశ్వర్రావుకు ఒక్క రిక్షావాడూ సరైన రేటుకు రిక్షా కట్టలేదు. "ఈ గాడిదకొడుకుల రిక్షా ఎక్కడం కంటే హాయిగా నడిచి వెళ్ళడం మంచిది" అని భార్యను నడిపిస్తూ జోరుగా, హుషారుగా ఇంటికి చేరుకున్నాడు.

ఇంటికొచ్చిన తరువాత కోటేశ్వర్రావు గౌరవాల గుడ్డలను విప్పేసి, వంకీకి తగిలించి అసలు రూపంలో భార్యకు సాక్షాత్కరించాడు. "ఏవే తప్పుడుముండా! నాకిష్టంలేని పని నాచేత చేయిస్తావా? మళ్ళీ ఎప్పుడన్నా కొంప కదులుతానను, ఒళ్ళు వాయగొడతాను. ఆ మోహన్రావు గాడిద ఎప్పుడూ ఆడవాళ్ళనే చూడనట్టు నీవంకే చూడటం, వాడి బోడి జోకులకు నువ్వు పగలబడి నవ్వడం. ఇవే భోగం టక్కులు! జాగ్రత్త! ఎప్పుడైనా పరాయి మగవాళ్ళతో మాట్లాడావని తెలిసిందా, ఏం చేస్తానో చూస్కో" అన్నాడు.

"మీవి పచ్చకామెర్ల కళ్ళు. మీరు అందర్నీ అలాగే చూస్తారేమో. అందుకే అందరూ మీ భార్యని అలా చూస్తున్నట్లు అనిపిస్తుంది" అంది సీత.

"నోర్మూసుకో.. అర్థంలేని వాగుడువాగకు. నేను మొగమహారాజుని, చూస్తాను. నీకూనాకూ పోలికేంటే, చెప్పింది విని, చచ్చినట్టు పడుండు" అన్నాడు కోటేశ్వర్రావు.

"చచ్చిపడి ఉండాల్సిన ఖర్మ నాకేం పట్టలా. నేనట్లా ఉండను" అంది సీత.

"ఏంటీ పిచ్చివాగుడు? అన్నం వడ్డించు..." అన్నాడు కోటేశ్వర్రావు.

"నాకు ఓపిక లేదు, మీరే వడ్డించుకు తినండి" అంది సీత.

"సిన్మాలు చూడ్డానికి ఓపికుందిగాని, కట్టుకున్న వాడికి తిండిపెట్టడాన్కి ఓపిక లేదన్నమాట" తీక్షణంగా అన్నాడు కోటేశ్వర్రావు.

"ఓపిక లేక్కాదు. నా మనసు బాగోలేదు. మీరు ముండలు రండలని తిట్టకుండా ఉంటే చాలు, పదివేల దణ్ణాలు... మీరు పెట్టుకుతినండి" అంది సీత.

"లే.. లేచిపెట్టు.. నాక్కోపం వస్తోంది. ఎదురుగా పెళ్ళాం ఉండగానే పెట్టుకుతినాల్సిన కర్మ నాకేంపట్టలా. నువ్వు లేచి అన్నం పెట్టాల్సిందే, నేను తినాల్సిందే" అన్నాడు మొండిగా కోటేశ్వర్రావు.

"నేను పెట్టను... మీరు తింటే తినండి, లేకుంటే మానుకోండి" అంది అంతకంటే మొండిగా సీత.

అన్నంమానుకొమ్మనేటప్పటికి కోటేశ్వర్రావుకి ఎక్కడలేని కోపం వచ్చేసింది. సీతని జుట్టుపట్టి లేవదీయ ప్రయత్నించాడు. ఆమె మొండిగా అలాగే కూర్చుండిపోయింది. కూర్చున్నదాన్ని అలా కాలితో ఓ తన్ను తన్నాడు. ఆమె తల గోడకు కొట్టుకుంది. ప్రాణం ఆర్చుకుపోయినట్లయిందామెకి. భర్తమీద విప




రీతమైన ద్వేషం, అసహ్యం వేసింది. మాట్లాడ కుండా అలా గోడకు చేరగిలపడిపోయింది. మళ్ళీ జుట్టుపట్టుకు లేవదీయ ప్రయత్నించా డు. ఆమె అతన్ని విదిలించి కొట్టింది.

"చావు పాడుముండా... మొగుడికి అన్నం కూడా పెట్టలేని ఆడజన్మెందుకు? ఛస్తే పీడా పోను. నీకు విడాకులిచ్చి సంసారం చేసే ఆడదాన్ని కట్టుకుంటాను" అని తనే గిన్నెలూ అవీ తెచ్చిపెట్టుకుని, కంచం, మంచినీళ్ళు పెట్టుకుని అరగంటసేపు కూర్చుని కడుపారా భోంచేశాడు.

సీత గోడనానుకుని కళ్ళు మూసుకుపడు కొని ఉండిపోయింది. కోటేశ్వర్రావు చాప పర చుకుని, పరుపేసుకుని లైటార్పి పడుకున్నా డు. మాట మాత్రానికైనా ఆమెని అన్నం తిను అని అడగలేదు.

పడుకున్న పావుగంటకు అతనికి వేరే ఆకలి మొదలైంది. భోజనానికి భార్య సహక రించకపోయినా గడిపేసుకున్నాడు గాని ఈ ఆకలి తీర్చడానికి భార్య కావాలి. ఆమె సహాయం కావాలి. మెల్లగా ఆమెను సమాధాన పరచ ప్రయత్నించసాగాడు.

"ఏవేఁ లే... లేచి అన్నం తిను. ఎంతసేపు అట్లా మొగుడు చచ్చిన ముండలా పడేడు స్తావు" అన్నాడు. భార్యముందు అతని భాష ఎలాంటి దుస్తులూ లేకుండా దిగంబరంగా, స్వేచ్ఛగా, నిరాడంబరంగా వుంటుంది.

ఆమె ఏం మాట్లాడకుండా అట్లాగే పడు కుని ఉండిపోయింది. లేచివెళ్ళి ఆమెని పక్క మీదికి లాక్కొచ్చాడు. "చెప్పిన మాట విని, లేచి అన్నం తిను" అన్నాడు సానునయంగా.

"నాకాకల్లేదు... నేను తినను" అందామె.

"సర్లే... నాకాకలి వేస్తోంది, నా ఆకలి తీర్చు ముందు"

"ఛీ... మీకు సిగ్గులేదు. నన్నంటకండి....." అంది సీత ఏడ్పు గొంతుతో.

"చెప్పిన మాటవిని చావు. అన్నం లేకపో యినా బతకచ్చు గాని ఇది లేకపోతే బతకడం కష్టం... అందులోనూ ఆడదానికి కామం ఎక్కు వన్నారు. ఏం? నేనా మోహన్రావుగాడి పాటి లేనా?" అన్నాడు.

సీత ఆశ్చర్యపోయింది. "ఇప్పుడా మోహ న్రావు ప్రస్తావనెందుకు? నా మనసు బాలేదు, నేనిప్పుడు రాను..." అంది.

"ఎట్లా రావో చూస్తాను" అని ఆమెని పరు పుమీదికి లాగాడు. ఆమె అతన్ని వదిలించుక వాలని ప్రయత్నం చేసింది. అతను ఆమె రెండు చేతుల్నీ ఒక చేత్తో పట్టుకుని ఈ చెంపా, ఆ చెంపా వాయించాడామెను. ఆమె అతని చెయ్యిపట్టి కొరికింది. "చెయ్యి కొరుకుతావటే ముష్టిముండా" అని వంకెన వేళ్ళాడుతున్న బెల్టు తీసుకొని ఇష్టంమొచ్చినట్లు కొట్టాడు. ఆమె అతన్ని వదిలించుకోడానికి గదంతా తిరిగింది. బెల్టవతల పారేసి మళ్ళీ ఆమెని జుట్టుపట్టుకు లాక్కొచ్చి పక్కమీద పడేశాడు. ఆమె ఒంట్లో సత్తువ పూర్తిగా నశించిపో యింది. అతన్ని మీదకు రానివ్వకుండా ఒంట్లో శక్తి ఉన్నంతవరకూ పెనుగులాడింది. చివరకు లొంగిపోయింది. అతడామెను పూర్తిగా ఆక్ర మించుకున్నాడు. ఆమెను నలిపి, నలిపి, పిండి, పిండి, తేనెను పిండినట్టు పిండాడు. ఇంత గోల చేసి ఓడిపోయినా ఆడదానిపై విజయాన్ని సాధించిన మగధీరుడిలా గర్వంగా అహంకారంతో, కసితో, ఇంకా ఇంకా హింసించాడామెను.

"ఏవే? ఇప్పుడేమంటావే? ఆడదంటే ఏవిటి... మొగుడి చెప్పుకింద తేలులా పడి ఉండాలి. ఇంకెప్పుడైనా పక్కలోకి రానన్నావో చెమడాలెక్కదీస్తా జాగ్రత్త... థూ, ఫో జెష్ట ముండా..." అని పని అయిపోగానే పరుపు మీద నుండి ఆమెను కిందికి తోశాడు.

"పశువా... ఎందుకు జన్మెత్తావురా?... థూ" అందామె.

పనికిమాలిన ఆడది. వాక్కోనీ, తిట్టుకోనీ, తన నిద్ర చెడగొట్టుకోవడమెందుకు అని హాయిగా పడుకుని నిద్రపోయాడు కోటేశ్వ ర్రావు.

సీతకి తిండి తినని నీరసంతో, దెబ్బలు తిని హింసించబడిన శరీరం రోదిస్తుండగా కునుకు పట్టలేదు. ఆమె మనసు వ్యభిచరించి నంతగా కుంగిపోయింది. పెళ్ళైన అర్నెల్లకు మొదటిసారిగా భర్త చేతిలో దెబ్బలుతిన్న సీత దీనికి పరిష్కారమేమిటా అని ఆలోచించసా




గింది. 'అన్ని సమస్యలకూ పరిష్కారాలు ఉన్నాయి' అన్న శిక్షణ ఆమెని ఆలోచింపచేస్తున్నది. ఎంత ఆలోచించి బుర్ర బద్దలు కొట్టుకున్నా ఆమెకి ఆలోచన తట్టలేదు. లేదు, తను ఇలాంటి జీవితాన్ని ఊహించుకోలేదు. ఇటువంటి జీవితం గడపలేను అనుకుంటూనే ఉంది. ఎప్పుడో తెల్లవారుజామునకు ఆమెకు కునుకుపట్టింది.

రాత్రి పట్టిన సైతాను కిందకు దిగాడు కోటేశ్వర్రావు మీదినుండి ఆమెను లేపకుండా తన స్నానం, పూజ పూర్తిచేసుకుని, రాత్రి భార్య తినకుండా ఉంచేసిన అన్నం కంచంనిండా తోడుకుని, సర్దుకుపోయే మనిషి కాబట్టి కూరలు లేకపోతేనేం లెమ్మని భార్యపై కనికరం గలిగినవాడై పచ్చళ్ళతోనే సరిపెట్టుకుని పెరుగు వేసుకుని తిని తొమ్మిదిన్నరకల్లా తయారయి ఆఫీసుకు బయల్దేరాడు కోటేశ్వర్రావు.

సీత ఇదంతా గమనిస్తూనే ఉంది, గానీ తాను మాత్రం లేవలేదు. ఒళ్ళంతా నుగ్గునుగ్గైనట్లుంది. తల పగిలిపోయేంత నొప్పిగా ఉంది. సీతకు ఏడ్వాలని ఉందిగానీ బిగపట్టుకూర్చుంది. భర్త ఎదురుగుండా ఏడవడం కూడా ఇష్టంలేదామెకు. అతను ఆఫీసుకు పోయిన తరువాత తనివితీరా ఏడ్చింది. ఏడ్చీఏడ్చీ మనసు ఉపశమించింది. పద్దకొండుకు లేచి మళ్ళీ వంట ప్రయత్నం మొదలుపెట్టింది మళ్ళీ ఆఫీసునుంచి వచ్చి ఏం రాద్ధాంతం చేస్తాడో ఏమోనని. ఒకటింబావుకల్లా ఠంచనుగా ఊడిపడ్డాడు కోటేశ్వర్రావు. ఆమె అప్పటికే కంచంలో అన్నం పెట్టి, అన్నీ వడ్డించింది. అతడు ఆమెవైపు తలెత్తి కూడా చూడకుండా భోంచేసి, తనక్కావాల్సినవన్నీ అడిగి వేయించుకుని, ఆమె తిన్నదో లేదోనని కూడా అడక్కుండా ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

"ఆ మాత్రం బెట్టుగానే ఉండాలి, లేకపోతే ఈ ఆడలంజలు నెత్తినెక్కి పిండి దంచుతారు"- అని అతని పరిపూర్ణమైన విశ్వాసం. అతనెళ్ళిపోయిన తరువాత ఎంగిలి పడాలని చూసింది గానీ ఆమెకు సహించలేదు. వంట్లో జ్వరం వచ్చినట్లుగా ఉంది. ఎలాగో ఓపిక చేసుకుని వంటిల్లంతా సర్ది వచ్చి చాపపరచుకుని పడుకుంటే భర్త వచ్చి అయిదున్నరకు తలుపు తట్టిందాకా ఆమెకు మెలకువ రాలేదు.

"ఎవడిని పెట్టుకు కులుకుతున్నావే? తలుపు తట్టినా తీయకుండా ఇంతసేపు" అని జోక్ చేశాడు కోటేశ్వర్రావు.

భార్యేం మాట్లాడక పోయేటప్పటికి 'ఈ ఆడవాళ్ళు ఒట్టి మూర్ఖపు మొహాలు. సరసం, సరాగం తెలిసి ఏడిస్తేగా?"- అనుకున్నాడు.

మొహమదీ కడుక్కుని, కూరలు తేవడానికి సంచి తీసుకుని వెళ్ళిపోయాడు. బయటికెళ్ళి ఇంటికి తిరిగొచ్చేటప్పటికి ఎనిమిది గంటలయింది. అతను బుడుంగుమని చన్నీళ్ళ స్నానం చేసి తిరిగొచ్చేటప్పటికి సీత వేడి వేడిగా అన్నం వడ్డించింది. పనులన్నీ మూకీగా జరిగిపోతున్నాయి. కోటేశ్వర్రావుకు మాత్రం చాలా సంతోషంగా ఉంది. "అప్పుడప్పుడు దేహ శుద్ధి అవుతుంటేనేగానీ ఈ ఆడముండలు బుద్ధిగా ఉండరు" అనుకున్నాడు.

లైటార్పి పడుకునేటప్పటికి పదిగంటలయింది. రెండో ఆకలి కూడా తీరకపోతే అతనికి నిద్రపట్టదు. సైతాను ఆవహిస్తాడు. వంట్లో ఓపిక లేకపోయినా, ఇష్టంలేకపోయినా ఇంకోసారి వ్యభిచరించింది సీత. ఇలా రోజూ రోజూ, ఎన్నో రోజులు వ్యభిచరించగా సీతకు తను నెలతప్పినట్లు తెలిసి కుంగిపోయింది. ఇక తన జీవితానికి నిష్కృతిలేదు- అని భావించసాగింది. ఈ పిల్లో, పిల్లాడో పుడితే ఎలా సాకాలి? ఈ మనిషి వాళ్ళని సరిగ్గా పెరగనిస్తాడా? తనిట్లా ఎంతకాలం గడపాలి? ఈ దుర్భర జీవితం గడపటం కంటే చావడం మేలని ఆమె ఎన్నోసార్లు అనుకుంది. కానీ చావడానికి మనసు తెగింపు చేసుకోలేకుండా ఉంది. చావడానికి ఆమె సంస్కారం, శిక్షణా అనుమతించడం లేదు. ఇప్పుడు మళ్ళీ అక్కా, బావల దగ్గరికి వెళ్ళేందుకు మనస్కరించడంలేదు. వాళ్ళు పెంచి పెద్దచేసి, పెళ్ళి చేసి పంపిస్తే, మళ్ళీ ఈ కాపురం చేయడం నావల్లగాదని తిరిగి వెళ్ళడం ఇష్టం లేదామెకు. బావ మళ్ళీ తనని ఆదరించడని కాదు. అక్క సర్దుకుపోదని కాదు. వాళ్ళు తనని మనిషిని



చేసి పంపారు. ఇక్కడ జంతువు కన్నా హీనంగా బతుకుతోంది. పాశవిక జీవితం తన లక్షణం కాదు. మార్గం వెతకాలి. మనిషిని మార్చాలి- అని ఎన్నో ఆలోచనలు సాగినా, ఈ మనిషిని మార్చడం తన వల్ల కాదని హతాశురాలయింది ఆమె.

ఈ మధ్యకాలంలో భర్తలో దాగిఉన్న మరో కళ కూడా బయటపడింది. ఇది వరకు ఆమె ఎవరితో స్నేహం చేసినా, మాట్లాడినా కోపగించుకునే భర్త, ఆడవాళ్ళతో స్నేహం చేసుకోమనీ, తమ ఇంటికి ఆహ్వానించమనీ ప్రోత్సహిస్తున్నాడు. వసంత వాళ్ళింటికి కూడా ఇద్దరూ రెండుమూడుసార్లు వెళ్ళి వచ్చారు. వాళ్ళనీ తమింటికి పిల్చారు. వసంత వచ్చి- "ఇదేం ఇల్లే? ఇందులో ఎలా ఉంటున్నారు" అన్నా తను- "డబ్బు చాలదు, ఇంటికి ఖర్చు చాలాంది" అని సర్ది చెప్పేసింది.

ఇంటికొచ్చిన ఆడవాళ్ళ మీదా వాళ్ళు వెళ్లి

ంతరువాత భర్త కామెంట్లు విని ఆమెకొకోసారి ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది.

"మీ వసంత ఒళ్లూ అదీ పొంకంగా, దిట్టంగా వుంటుంది. మొగుణ్ణి రాత్రంతా నిద్ర పోనీదనుకుంటా" అనేవాడు.

"ఆ సుజాత (పరాంకుశం భార్య) బుగ్గలూ, పెదవులూ ఎంత నాజూగ్గా వుంటాయని? నిజంగా ముద్దుపెట్టుకోవాలన్పిస్తుందనుకో. నువ్వూ వున్నావు ఎందుకు?"

"కుడివైపు వాటా గజ్జలగుర్రం (బి.ఏ. చదువుకుంటున్న అమ్మాయి, కాల్టెన్స్ కంపెనీలో పనిచేసే పరంధామయ్యగారి కూతురు) అబ్బచూస్తే జన్మ తరించిపోతుందే. ఆ ఎత్తయిన ఛాతీ, బింకంగా, బిగువుగా వుండే ఆ పొంకం, పొడవాటి జడా, గంతులేస్తున్న పంచకల్యాణిలా వుంటుంది"

—ఇలాంటి వ్యాఖ్యానాలు చేసేవాడు. దీంతో సీతకు ఎవరినైనా కలవాలనీ, వారిని తన ఇంటికి పిలవాలి అనే ఇచ్ఛే నశించింది.

ఈ విధంగా భర్త వదునారువన్నెలూ, చిన్నెలూ, కళలూ మోస్తూ తొమ్మిది నెలలు నిండి, భర్త దయార్ద్రహృదయుడై గవర్నమెంటు హాస్పిటల్లో చేర్పించగా మగబిడ్డకు తల్లయింది సీత. అక్కకూ, బావకూ తన విషయం రాయమని ఆమె అడుగనూలేదు, అతడు రాయనూ లేదు. రాయాలన్నా ఆమె దగ్గర కార్డులూ, కవర్లూ చివరకు చిల్లికానీ కూడా వుండదు. పిల్లవాణ్ణి కన్న తరువాత ఆసుపత్రి నుంచి సీతని ఇంటికి తీసుకువచ్చింతరువాత కోటేశ్వర్రావు అన్నగారికి ఉత్తరం రాశాడు.

"కేశవమూర్తి అన్నగారికి,

చి॥ల॥సౌ॥ సీత ప్రసవించి మగబిడ్డను కన్నది. ఆమె, పిల్లవాడూ కులాసా. మీరు ఆదుర్దా చెంది రానవసరమేమీలేదు. ఇక్కడ మేమంతా ఆమె ఏమీ కష్టపడకుండా చూసుకుంటున్నాము. నేనే ఒక నెల తర్వాత సీతను, పిల్లవాణ్ణీ అక్కడకు పంపెదను. డబ్బు చాలా ఖర్చయింది మందులకు, ఆసుపత్రి ఖర్చులకు. మీరు ఒక రెండువేల రూపాయలు సర్దుబాటు చేయగలరు. చేతిలో డబ్బు మసలగానే తిరిగి పంపగలవాడను. ఇంతేసంగతులు. డబ్బు సంగతి మర్చిపోవద్దు. వదినగారికి నా నమస్కారాలు తెలుపగలరు.

ఇట్లు
మీ తమ్ముడు
కోటేశ్వర్రావు

ఉత్తరం అందిన వెంటనే కేశవమూర్తి రెండువేల రూపాయలు పంపాడు. ఆ తర్వాత డబ్బు అందిందని కూడా ఉత్తరం రాయలేదు కోటేశ్వర్రావు. డబ్బు మీ బావపంపాడని సీతకు కూడా చెప్పలేదు. పైగా "నీ పురిటికి, నీ మందులకు, ఆసుపత్రికి ఇంతైంది, అంతైంది, ఛస్తున్నాను. డబ్బు పుట్టించి తేలేక" అని గోలపెట్టేవాడు. అతని తల్లీ, తండ్రీ ఒకసారి వచ్చి చూసివెళ్లారు. వారు తిరిగి వెళ్లిందాకా కోటేశ్వర్రావుకు మనసులో మనసు లేకుండా పోయింది. ఇంట్లో డబ్బు ఖర్చు, పైగా లక్కపిడతలాంటి కొంపలో తనకు భార్యతో ఏకాంతం దొరక్కుండా పోయింది. ఏకాంతం లేక అతనుండలేడు. భార్య పురుడొచ్చి, ఆస్పత్రిలో వున్నకాలంలో కొంత బయటకాలక్షేపం చేసినా, ఇంట్లో వున్నంత హాయిగా లేదు. ఏంరోగాలు తగుల్తాయో అని భయం. పైగా ఇంట్లో తన్నులు తింటూ, తిట్లు భరిస్తూ, తన చక్కటి హాయిగొలిపే హింసని సహిస్తూ, ఒక్కోసారి తనకి అందక గదిచుట్టూ త్రిప్పి, గిల్లి, గిచ్చి, కొరికినా తప్పించుకోలేక శరీరాన్ని అప్పగించే రేప్ చేసినంత ఆనందం కలిగించే భార్య, తన మొగతనానికి తృప్తి కలిగించే భార్యలాగా బయటి భామామణులు కనిపించలేదతనికి. ఎలాగైనా "ఇల్లాలు ఇల్లాలే ఎంతమంది బజారు భామలు మాత్రం ఇల్లాలికి సాటి?" అనుకునేవాడు కోటేశ్వరరావు.

తల్లీ, తండ్రీ ఇంటికి వెళ్లిపోయిం తరువాత హాయిగా నిట్టూర్చాడు కోటేశ్వర్రావు. వచ్చి బాలింత అనైనా చూడటంలేదతను. భార్యంటే భర్త కోరికలు తీర్చే సాధనం. భర్త సేవలో భార్యప్రాణాలు పోతే మాత్రమేం? ఆమెకక్కడ స్వర్గ ద్వారాలు తెరుచుకుని వుంటాయి. పతివ్రతలా స్వర్గంలో తను వచ్చిందాకా నిరీక్షించి, మళ్లీ ఇద్దరూ ఈ భూప్రపంచానికి భారంగా భార్యాభర్తలై పుడతారు.




"ఏడేడు జన్మలకు నీవే నా భర్తవు కావాల అని మొక్కుకుంటారు ఆడవాళ్లు. ఇదేం జన్మో? నాకిట్టాంటి ఏ బ్రాసిమొహంది దొరికింది" అని అప్పుడప్పుడు భార్యపై జాలిపడ్తుంటాడు అతను.




కాలం బరువుగా సాగిపోతోంది. సీతకి జీవితం దుర్భరంగా అన్పించసాగింది. "ఛఛ... బతుకంటే ఇంతేనా, ఇంత ఘోరంగా తయారైందేం? ఉహూ, వీల్లేదు, దీన్నిలా కొనసాగనివ్వకూడదు. నా జీవితాన్ని అందంగా తీర్చిద్దుకోవాలి. కానీ దీనికి పరిష్కారం ఏమిటి? తనకింత చాదస్తపు భర్త దొరికాడేం? తను పట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదిస్తాడు తప్ప వేరే వాళ్లమాట వినడు. అతన్నెట్లా మార్చి మంచివాడిగా మలచుకోవాలి?" అని పదేపదే ఆలోచించుకునేది సీత.

కానీ ఆమెకేమీ తట్టేది కాదు. ఏడ్చుకోవడం, తుడుచుకోవడం, రాజీపడిపోవడం - ఇదే జరుగుతోంది ప్రతినిత్యం.

ఉదయం లేచింది మొదలు మధ్యాహ్నం ఒక అరగంట కునుకు మినహాయించి, రాత్రి వరకూ ఏదో పని సరిపోతూనే వుండేది.

స్నానానికి టవలు అందివ్వడం దగ్గర నుండి, భోజనం పెట్టి ఆఫీసుకు పంపించే వరకూ ఏలోపం జరగకుండా అడుగులకి మడుగులొత్తినట్లు చేసినా కోటేశ్వర్రావు ముఖంలో రవ్వంత తృప్తి కూడా కనిపించేది కాదు. ఇంకా తన పాదాలు కడిగి, తలమీద పోసుకోవాలన్నట్లు మాట్లాడేవాడు. చీటికీ మాటికీ చెయ్యి చేసుకొనేవాడు. అతడేం సీతని చిన్నపిల్లో లేక నోరులేని జంతువో అనుకోలేదు. భార్యగా భావించాడు కాబట్టే అట్లా ప్రవర్తించేవాడు.

కోటేశ్వర్రావు దృష్టిలో భార్యని కొట్టడం అంటే చాలా సహజం. కొట్టకపోయినా, అధికారం చెలాయించకపోయినా అసహజం.

సీత కొన్నిసార్లు ఎదురుతిరిగి అరిచేది. అకారణంగా తనని హింసించద్దని హెచ్చరించేది. కోటేశ్వర్రావు రెచ్చిపోయి ఇంకా బాదుతుంటే వాళ్లూ, వీళ్లూ వింటారని తమాయించుకునేది.

"పాలడబ్బా అయిపోయి రెండురోజులయింది, ఈరోజు అయినా మర్చిపోకుండా తెండి" అంది సీత.

"ఎన్నిసార్లు చెప్పాలి... నాదగ్గర డబ్బుల్లేవు" అన్నాడు కోటేశ్వర్రావు.

"అదేంమాట? నేనేం సినిమాలు, షికార్లు అంటూ విసిగిస్తున్నానా? కళ్లారా చూస్తున్నారుగా ... వాడు బిక్కపట్టి ఏడుస్తున్నాడు పాల్లేక" అంది సీత.

"అయితే నన్నేం చేయమంటావు? నావల్లకాదు, ఈ సంసారాన్ని భరించడం. ఏ బాంకుకో కన్నం వేయాలి. అంతకంటే గత్యంతరంలేదు, లేకుంటే పోయి ఏ సన్యాసిముఠాలోనో కలిసిపోవాలి"

"ఛీ... మీలాంటి మనిషిని నేనెక్కడా చూళ్లేదు. డబ్బుకీ, మీకూ లంకె. కూడబెట్టికూడబెట్టి ఏంచేస్తారు. కూలి చేసుకునేవాడు కూడా వున్నంతలో పెళ్లాం పిల్లల్ని సంతోషపెట్టాలని చూస్తాడు" ఆవేశంగా అంది సీత.

"నోర్మూయవే దరిద్రపు మొహమా! రాజాలాంటి సంబంధాలెన్నో వచ్చినా, అన్నిట్నీ వదిలి నీ శనిపీనుగముఖంతో కట్టబెట్టారు చూడు మా అమ్మా, బాబూ ... వాళ్లని వాళ్లనాలి. నువ్వు పుట్టింటినుంచి తెచ్చావయ్యా లవ్వ, అదంతా నేను కూడబెడ్తున్నా. పిల్లవాడిమీద అంత ప్రేమ ఏడిస్తే నీ బావని కొంత డబ్బు సర్దుబాటు చేయమని రాయి" అన్నాడు కోటేశ్వర్రావు.

"వాడు మీ కొడుక్కాదా? మీకు ప్రేమ లేదా? మా బావకేం పట్టింది? సొంత కొడుకుని పోషించడం మీకే బరువుగావుంటే ఎవరో మర

దలు కన్న బిడ్డకోసం ఆయనెందుకు డబ్బు పంపుతాడు? అసలెందుకు పంపాలి?''

''ఇదిగో నీ ప్లీడరు కబుర్లు కట్టిపెట్టు. నన్ను మరీ రెచ్చగొట్టకు. నేనసలే మంచివాణ్ణికాను. మర్యాదగా చెప్పినట్టుచెయ్యి. మీ బావని అర్జంటుగా కొంత డబ్బు పంపమని రాయి''

''నేను రాయను'' అంది సీత.

''అయితే నేనే రాస్తాను, నువ్వు పంపమన్నావని ... నీ ఇష్టం. నువ్వే రాస్తే ఏ పేచీవుండదు'' అనేసి ఒక కార్డు కూడా ఆమె ముందు పడేసి చరచరా వెళ్లిపోయాడు కోటేశ్వర్రావు.

సీత ఏమయితే అదౌతుందని మొదట బావకి ఉత్తరం రాయద్దనుకుంది. 'కానీ మొండివాడు, అన్నంత పనీచేస్తాడు. నిజంగానే నేను రాయమన్నానని రాసి డబ్బు రప్పించుకోగలడు, అంత సమర్థుడు. తనైతే మరీ పెద్దమొత్తంరాసి బావని ఇబ్బంది పెడ్తాడేమో అంతకంటే నేను రాయడమే నయం కదా అనుకుంది. ఎంత పంపమని అడగాలి? బావ పరిస్థితి తనకు తెలియనిదా? అందులో ఇప్పుడు తనపెళ్లి చేసి మరీ అప్పులపాలయ్యాడు' - అనుకుని చివరికి ఒక వంద రూపాయలు పంపమని రాసింది.

కేశవమూర్తి సీత పేరున ఒక మూడు వందలు పంపాడు. ఆమె ఆ డబ్బు చూసుకుని మురిసిపోలేదు, కన్నీళ్లు పెట్టుకుంది.

కోటేశ్వర్రావు అంతటితో ఆగిపోలేదు. 'తినమరిగిన కుక్క అల మొరిగిందన్నట్టు', తనకి అవసరమైనప్పుడల్లా డబ్బు పంపమని కేశవమూర్తికి ఉత్తరాలు రాసేవాడు. కేశవమూర్తి అతడు అడిగినంత అన్నిసార్లూ పంపలేకపోయినా, తన శాయశక్తులా కష్టపడి అప్పోసప్పో చేసి ఎంతోకొంత పంపుతూనే వున్నాడు. ఓసారి వుండబట్టలేక సీతకి ఒక ఉత్తరం రాశాడు-

''చిరంజీవి సౌభాగ్యవతి సీతని,

ఆశీర్వదించి వ్రాయు లేఖాంశములు. మేమిద్దరం కులాసా. మీరు కూడా క్షేమమని తలుస్తాను.

అమ్మా! సీతా! మన స్థితిగతులు నీకేం తెలియనివి కావు. నాకు ప్రస్తుతం మూణ్ణెల్లగా జీతంకూడా రావడంలేదు. డబ్బుకి మరీ కటువుగా వుంది. కాబట్టి ఈసారి తమ్ముడు కోటేశ్వర్రావుగారికి నేనేమీ డబ్బు పంపలేకపోతున్నాను. అయినా అయిదు వందలు పంపి తిన్నగా రెణ్ణెల్లు కాలేదు ... డబ్బంతా ఏం చేస్తున్నట్టు? ఆఫీసుకి వెళ్లడంలేదా? శెలవమీదున్నాడా? డబ్బు కొంచెం జాగ్రత్తగా వాడుకోండి.

నీ ఆరోగ్యం, బాబు ఆరోగ్యం జాగ్రత్త.

ఇట్లు
కేశవమూర్తి''

ఆ సాయంత్రం భర్తను అడిగింది సీత.

''మా బావకి ఉత్తరమెందుకు రాశారు?''

''డబ్బు కావాల్సొచ్చింది''

''తెలుసు... డబ్బూ, డబ్బూ, డబ్బూ అది తప్ప మరో మంచీ, మానవత్వం, మరోటేదీ లేదు. అయినా మీఉద్దేశం ఏమిటి? ఆయనకేం డబ్బుల చెట్టుందనుకున్నారా? అడిగినప్పుడల్లా అడిగినంత పంపడానికి? ఈ రోజుల్లో సొంత అల్లుళ్లు కూడా మీకు మల్లే అధికారం చెలాయించడంలేదు. ఆయన మీతోటి అల్లుడన్న సంగతి మర్చిపోవద్దు'' అంది సీత.

''అతిగా వాగకు... మీ నాన్న డబ్బు తిన్నవాడు పంపిస్తాడు. అదంతా ఇప్పుడు కక్కాలి. నాకు తిక్కరేగిందంటే ఏంచేస్తానో నాకే తెలీదు. నీ బావగాడు ఏవన్నా ఉత్తరం రాశాడా? స్వయంగా సందర్శించి, పరామర్శించి పోయాడా? ఏవుంది, లేకి వెధవ చిన్న సహాయం... చేయకపోగా ఆడంగిరేకులవాళ్ళా నీకు హితబోధలు చేస్తాడా? చూస్తా''

''ఏమిటి మీరు చూసేది... కదిల్తే మెదిల్తే అట్లా డబ్బడగడం మీకు సిగ్గుగా, చిన్నతనంగా అన్పించడంలేదూ?''

''సిగ్గు... హ్హా... హ్హా... హ్హా... నేనుకాదు, మీబావ సిగ్గుపడాలి. నేనేం దారేపోయే దానయ్యల్ని అడుగుతున్నానా? ఇక్కడ నాకు హక్కూ, అధికారం వున్నాయి కాబట్టి అడుగుతున్నాను''

''హక్కా... ఏ చట్టంలో రాసుందో ఇది మీ హక్కని. అయినా భార్యనీ, పిల్లణ్ణీ కూడా పోషించలేని మీరు... అసలు పెళ్ళెందుకు చేస్కోవాలి?''

''అరవకుండా అవతలికెళ్ళు అడ్డగాడిదా! నువ్వు మరీ కొవ్వెక్కి కొట్టుకుంటున్నావు. నోటికొ

చ్చినట్లు వాగకు. మీ బావ అంతు చూస్తాను. ఏమనుకున్నాడో నేనంటే?''

''మా బావ అంతు మీరే కాదు, ఆ బ్రహ్మదేవుడుకూడా చూళ్ళేడు. దేవుడైనా పొరపాట్లు చేస్తాడేమోగానీ, మా బావ మాత్రం ఏ తప్పూ ఎప్పుడూ చేయడు. ఆయన్ని అనేందుకు మీకు మనసెట్లా ఒప్పుతోంది?''

భార్య ఎదురు చెప్పటం అతనిలోని పురుషాహంకారం సహించలేకపోయింది. ఒళ్ళెరగని కోపంతో ఛెళ్ళు ఛెళ్ళున ఆమె చెంపలు వాయించాడు. సీత కళ్లలో నీరుకూడా ఇంకిపోయి ఏడుపుకూడా రాలేదు. ఓ మాదిరి నిర్లిప్తతతో అలాగే పడుకుని ఉండిపోయింది.

★ ★ ★

రోజూ ఉదయం అయిదున్నరా, ఆరుకల్లా ఠంచనుగా లేచే సీత ఆరోజు ఎనిమిది గంటలైనా లేవలేదు. అప్పటికే కోటేశ్వర్రావు ముఖ ప్రక్షాళన వగైరాలు పూర్తి చేసుకుని, భార్య లేచి పనీపాటలు మొదలు పెట్టదేమని ఎదురుచూస్తున్నాడు.

గడచిన రాత్రి ఆమెని చితకబాదాడు! అందుకు అది నిరసన వ్రతంకాబోలని అంత సేపూ ఊరుకున్నాడు. తన్నడం అతడికి కొత్తేంకాదు. కానీ మునుపెన్నడూ ఆమె ఈ విధంగా తన్నిపెట్టి పడుకున్న గుర్తు లేదు, ఏదో మొదట్లో ఒకటి రెండు సార్లు తప్పించి. ఇంక కోటేశ్వర్రావు సహనం చచ్చిపోయింది.

''ఏయ్! ఎద్దూ!! ఏంటా మొద్దు నిద్ర? టైం చూడు ఎంతైందో? వంట చేసేదుందా, లేదా?'' అంటూ సాధ్యమైనంత గట్టిగా రంకె పెట్టాడు కోటేశ్వర్రావు. సీత తుళ్ళిపడి లేచి అయోమయంగా చూసింది. గదిలోకి కిటికీ లోంచి ఉదయతపుని తీక్షణ కిరణాలు తనపై పడుతున్నాయి. గోడనున్న గడియారం ఎనిమిదీ అయిదు సూచిస్తోంది. భర్త అరుస్తున్నాడు. పిల్లడు వేణు పక్కనే నిద్రలో వున్నాడు. ఆమెకి ఒళ్ళంతా బరువుగా, నొప్పిగా తలదిమ్ముగా, తిరిగిపోతున్నట్లూ, కళ్ళు మండిపోతున్నట్లు మంటగా లోపలంతా ఏదో వికారంగా అన్పించింది. తననితను తడిమి చూసుకుంది. స్పర్శ మామూలుగా లేదు, మొద్దుబారినట్లుంది. ఒళ్ళంతా కుంపటిలా కాలిపోతోంది. నీరసంగా అన్పించింది. ఒక్క రాత్రి అన్నం తినకపోతే ఇదేమిటి ఇంత నీరసంగా ఉంది? అనుకుంది.

''నాకు ఒంట్లో బాలేదు, జ్వరమొచ్చింది'' అంది సీత పక్కమీద నుండి లేవకుండానే.

''జ్వరమా?'' అంటూ దగ్గరికొచ్చి చెయ్యేసి, చూసి ''మనుల్తోందే?'' అన్నాడు కోటేశ్వర్రావు.

తర్వాత ఒక క్రోసిన్ మాత్ర కొని తెచ్చిచ్చి వంట చేసుకుని భోజనం చేసి, ఆఫీసుకు వెళ్ళిపోయాడు. అంతే తప్ప, కనీసం ఆమెకి కాఫీ హొటల్నించయినా తెచ్చివ్వాలనే ఆలోచన కూడా అతడికి రాలేదు. సీత అతడి నుంచి అటువంటిదేమీ ఆశించలేదు గనుక అందుకు బాధపడనూ లేదు.

ఆరోజు సాయంత్రం కూడా ఆమెకి జ్వరం తగ్గలేదు. కోటేశ్వర్రావు మరో మాత్ర వేశాడు. తెల్లవారి చూస్తే జ్వరం ఇంకా తీవ్రమైంది. తప్ప తగ్గలేదు. అతడు ఒక్కసారి రెండు బిళ్ళలు వేశాడు. ఒక గంటలో జ్వరం తగ్గింది. పరాంకుశం భార్య సుజాత కాఫీ పెట్టి తెచ్చిచ్చింది. నిన్నంతా రెండు గుక్కల మంచినీళ్ళు తప్పమరేమీ లేని సీతకి ఆ కాఫీఅమృతంలా అనిపించింది. భర్తకి తోచనిది, ఎదురింటామెకి తోచడం.... సీత నీరసంగా లేచి తాగింది. తన కృతజ్ఞతని తెలియజేసింది. బాబుకి పాలు పట్టడం, ఫారెక్స్ కలిపి పెట్టడంలాంటివి కూడా సుజాతే చేసింది.

ఆ సాయంత్రం వరకూ జ్వరం రాలేదు. కానీ మళ్ళీ అర్ధరాత్రయ్యేసరికి తిరగబెట్టింది. అలా రెండ్రోజులు మొండిగా తన స్వంత వైద్యమే చేసి చివరకి అయిదో రోజున గత్యంతరం లేక డాక్టరు దగ్గరికి తీసికెళ్ళాడు. డాక్టరు పరీక్ష చేసి మలేరియా అని చెప్పి, మందులు రాసిచ్చాడు.

కోటేశ్వర్రావుకి అదివిన్నక్షణాన చెడ్డ చికాకేసింది. అతడికి రోగాలూ, మందులూ, పత్యాలూ, మూలుగుళ్ళూ ఇవన్నీ ఎలర్జీ. తనకి వచ్చినా భరించలేడు, వేరేవాళ్ళకైతే మరీ సహించలేడు.

ఆ జ్వర ప్రభావం సీతని మరో వారం రోజులు పక్కమీద నుండి లేవకుండా చేసింది.

అన్ని రోజులూ బాబు వేణుని, సీతని కూడా సుజాతే ఏ లోపం రాకుండా చూసుకుంది. కోటేశ్వరరావు మాత్రం అన్నం వండుకు తిని తన మానాన తను ఆఫీసుకు వెళ్ళిపోయేవాడు.

అసల్తే ప్రసవించింది మొదలు సీతా చాలా నీరసపడి వుంది. డాక్టర్ ఎనీమిగ్గా వుందని మందులూ, టానిక్కులూ రాసిచ్చినా కోటేశ్వర్రావు వాటిలో ఒక్కటీ కొని తెచ్చిన పాపాన పోలేదు. అయితే ఈ జ్వరం ఆమెలో వున్న కొద్దిపాటి శక్తిని కూడా హరించింది. ఆమె కూర్చుంటే నిలబడలేక, నిలబడితే కదల్లేకపోతోంది. చేతుల్లో సత్తువ లేకుండా పోయింది. ఏ వస్తువు పట్టుకున్నా పట్టు తప్పి పడిపోతోంది.

ఆ పరిస్థితుల్లో సీత సుజాత ఇంట్లో చేసే పనిమనిషిని మాట్లాడుకోక తప్పలేదు. దానికి కోటేశ్వర్రావు పూర్తిగా అభ్యంతరమే తెల్పాడు. పైసాకి గడ్డితినే అతని మనస్తత్వం పనిమనిషిని పెట్టడం అనవసరం అన్పించిందే తప్ప భార్య దీన పరిస్థితిని అర్థం చేసుకోలేకపోయింది. గొణిగీ సణిగీ, విసుక్కునీ, కసురుకునీ, చివరికి 'సరే' అనక తప్పలేదు. అయితే-

పనిమనిషిని చూసిన తరువాత మాత్రం ఇంక సనగలేదు కోటేశ్వరరావు. ఫరవాలేదు ఫిగరు బాగానే వుంది. అవసరానికి ఆదుకోవచ్చుననుకున్నాడు. రోజూ ఉదయం అయిదున్నర కంతా వచ్చేసేదామె.

సీత అంత నీరసంలో, నిస్సత్తువతో కొట్టుమిట్టాడుతుంటే కోటేశ్వరరావు ఆమె పరిస్థితికి సానుభూతి ఓదార్పు ప్రకటించి ప్రేమానురాగాలు చూపకపోగా విసుక్కోవడం, తిట్టడం చూసిన సుజాత మనసు చివుక్కుమనేది. సీత మీద జాలిపడేది. తన భర్తతో చెప్పి అతడి పశుత్వాన్ని అసహ్యించుకునేది.

ఎవరైనా సీతకి సహాయం చేస్తుంటే కోటేశ్వర్రావుకి కారం పూసుకున్నట్లుంటుంది. వాళ్ళు అవతలికి వెళ్ళగానే భార్యని ఇంకా క్రూరంగా మాటలతో హింసించేవాడు. సీత ఆ నీరసంలో అతడితో వాదించే ఓపికలేక అలా అనవద్దని బతిమిలాడేది.

సీత కుదుర్చుకున్న పనిమనిషి పేరు జయమ్మ. బట్టలు ఉతకడం, అంట్లు తోమడం, ఇల్లూ, వాకిలీ ఊడవడం ఆమె పన్లు. నాలుగయిదు ఇళ్లలో ఆమె పనిచేసేది. అన్నిళ్ళ వెట్టిచాకిరీ చేసినా ఆమెలో లేశమాత్రంగా అయినా అలసటా, విసుగూ ద్యోతకమయ్యేదికాదు. నవ్వుతూ, తుళ్ళుతూ పనిచేసేది.

సీతకి తినబోతే ఎక్కక, తిన్నకాస్తా కూడా మానసిక దుస్థితి కారణంగా వంటబట్టకా ఇంకా బలహీనమవ్వసాగింది. కోటేశ్వర్రావు ఇదేమీ గమనించేవాడుకాదు. పొరపాటున "ఏంటి మరీ పుల్లలా తయారవుతున్నావు?"- వంటి మాటలు నోరుజారినా అందులో సానుభూతికానీ, తానేం చేయాలనే ప్రశ్నకానీ, ఎందుకలా ఔతుందనే సందేహంకానీ, దానికి పరిష్కారమేమిటనే ఆలోచనగానీ కనబడేవికావు. ఆమె అలా చిక్కిపోవడం తన సౌఖ్యానికి ఆటంకంగా భావించేవాడతను.

జయమ్మ సహజంగా మంచిమనిషి అని చెప్పింది సుజాత. ఆమెకి చాలామంది పనివారిలో వుండే దుర్లక్షణం- దొరికిన గిన్నెలూ గట్రా దొంగిలించడం చాతకాదు. తనది కాని సొమ్ము బంగారం అయినా, వెలిగారమైనా ఒకటే ఆమెకి. ఏపని చేసినా వంక పెట్టేందుకు వీలులేకుండా శుభ్రంగా చేసేది. ఎవరో మహానుభావుడు అంటారు- "నీ పని ప్లాట్‌ఫాం ఊడవడమే అయినా, చిన్న దుమ్ముకణం కూడా కన్పించనంత శ్రద్ధాసక్తులతో చెయ్యి"- అని. బహుశా ఈ కొటేషన్ ఆమె ఎక్కడా వినివుండదు. తాను కూడా ముచ్చటగా ముడి పెట్టుకుని, ఉతికిన చీరకట్టుకొని పరిశుభ్రంగా వచ్చేది. ఆమెని చూసినా ఎవరూ చప్పున పనిమనిషి అనుకోరు. ఆ ఇంటావిడే అనుకుంటారు. అయితే అటువంటి జయమ్మలో ఒకే ఒక లోపంవుంది. అదేమిటంటే అతిగా వాగడం. ఆమె చెప్పిన సోదంతా యజమానురాలు విధిగా వినితీరాలి. ఏదైనా మొదలుపెట్టిందంటే కామాలు, ఫుల్‌స్టాపులూ గుర్తొచ్చినప్పుడు ఎక్కడో పెడుతూ నాన్‌స్టాపుగా ఆ సొంతం చెప్పేస్తుంది.

సీతకి ఇదంతా రెండుమూడ్రోజులు ఇబ్బందిగా అన్పించినా, సరిపెట్టేసుకుంది. కొన్ని వినేది, కొన్ని వినేదికాదు. ఓపికుంటే ఈ




కొట్టేది, లేకుంటే ఊరికే కళ్ళప్పగించి ఊరుకునేది. సీతకి ఒక్కోసారి జయమ్మని చూస్తే నవ్వు కూడా వచ్చేది. 'అవతలి వ్యక్తి వింటున్నదీ, లేనిదీ కూడా పట్టించుకోకుండా ఎందుకట్లా మాట్లాడి అలసిపోతుంది?' అనుకునేది. టేప్ రికార్డర్ని ఆన్‌చేస్తే ఆ కాసెట్ అయిపోయేవరకూ అది మోగుతూనే వుంటుంది తప్ప, పెట్టిన వ్యక్తి వింటోంది లేనిదీ దానికనవసరం. అట్లాగే ఈ జయకూడా. అయితే ఈ టేప్ రికార్డర్‌కి ఆన్, ఆఫ్-లు, తన యజమానురాళ్ళని చూడటం- అనే దగ్గర కంపోజ్ చేయబడి వుంటాయి.

''మీరేం సదూకూన్నారమ్మా?'' అడిగింది జయ.

''ఆఁ....డిగ్రీ'' అంది సీత.

''అదే పెద్దసదువాండి''

''కాదు... ఇంతకంటే చాలా పెద్దచదువులున్నాయి... ఎందుకు?''

''ఏంలేదు... నాకో బిడ్డుంది'' అంది జయ.

''ఊహూ''

''దాన్ని బాగా సదివించాలనుందమ్మా. మీరు బాగా సదువు కున్నవారని మా సుజాతమ్మగారు చెప్పారు. మీరు సదివినంత సదువు నేను చెప్పించగల్నాండి సీతమ్మగారు?'' అంది జయ.

సీతకి ఆ విషయమై ఆమెకి విపులంగా చెప్పాలన్పించినా, చెప్పే ఓపికలేక ''ఉ'' అని ఊరుకుంది. ఆ తరువాత జయ తన కూతురి పుట్టు పూర్వోత్తరాలు అన్నీ ఏకబిగువునా చెప్పింది. ఆ పిల్ల చొల్లుకార్చడం దగ్గర్నుండి, వెలగబెడుతున్న చదువు అప్పర్‌కేజీ కాబోలు అంతవరకూ చెప్పింది. ఆ పాప ఈ మధ్య 'ఇంగిలీసు' దంచేస్తోందట. తనని ''మమ్మీ'' అని పిలుస్తుందట. తనని అస్తమానం ''చెటప్'' అంటుందట. మురిపెంగా చెపుతుంటే సీతకు నవ్వొచ్చింది.

జయమ్మ ఒక రోజు తన మొగుడి కథంతా చెప్పింది. ''నాకో పనికిమాలిన వాణ్ణి కట్టాడమ్మా మాఅయ్యా... ఆడు పగలు కూలికి పొయ్యేవాడు కానీ నా చేతికి పైసాఇచ్చేవాడుకాదు. అన్ని డబ్బులూ తాగుడికే తగలేసేవాడు తప్ప తాగొచ్చి తిండి పెట్టమనేవాడు. నాకొల్లు మండిపోయేది. అరిచేదాన్ని, తన్నేవాడు. ఆడి తన్నులతోనే నా ఒల్లంతా హూనమయ్యేది. ఆడి దగ్గర్నుంచి ఒచ్చేశాకే మామూలు మనిషినయి ఇట్టా ఒల్లు చేశానండి... అయితే ఓపిక పట్టీ పట్టీ ఇనుగుపుట్టి వాడి దగ్గర్నుంచి మా అమ్మకాడికి వచ్చేశానండి. మాయమ్మ నాలుగు రోజులు ఊరుకుని, అట్టా వచ్చేయకూడదని నీతులు చెప్పి మళ్ళీ వెళ్ళిపొమ్మందండి. అందుకు నాకు మనసొప్పక దాన్దగ్గర్నుండి ఎల్లిపోయి గుడిసె ఒకటి అద్దెకి తీసుకొని నాలుగిల్లలో పనిచేసుకు బతుకుతున్నానండీ! అందుకే నా పిల్ల నాకు మల్లే దిక్కుమాలింది కాకూడదని సదివించుకోవాలననుకున్నానండీ!... నేను చేసిందాంట్లో తప్పుందా అమ్మా?... మీరు సదువుకొన్నవారిని అడుగుతున్నా చెప్పండమ్మా'' అంది జయ.

సీత అదంతా ఆశ్చర్యంగావిని ''లేదు'' అంది.

జయ పూర్వచరిత్ర క్లుప్తంగా అంతే. అయినా దాన్ని సమయం చిక్కినప్పుడల్లా మక్కీకిమక్కీ కళ్ళకుకట్టినట్లు వర్ణిస్తూ, చమత్కారంగా చెప్పేది.

జయ మాటలు అనేకసార్లు సీత బాధని మరపించే టానిక్‌లా పనిచేసేవి. సీత అనుకునేది ''అటుపై తరగతివాళ్ళూ ఇటు క్రిందితరగతివాళ్ళూ కూడా హాయిగా, యదేచ్ఛగా జీవించగలరు కానీ తనలాంటి మధ్యతరగతి వాళ్ళు మాత్రం ప్రతి చిన్న విషయానికీ ముందూ, వెనకా ఆలోచిస్తూ, అందరికీ వెరుస్తూ, అటు నింగీ ఇటు నేలా కానివిధంగా వేళ్ళాడుతూ, పాకులాడుతూ పనికిమాలిన జీవితాలు గడపాలికదా!'' అని.

అయితే జయమ్మ పనిలోకొచ్చిన కొద్ది రోజుల్లోనే కోటేశ్వర్రావు జబ్బును పసిగట్టేసింది.

''ఏవమ్మో! మీ ఆయన అట్టా చూస్తాడేంది... కరిచేసేటట్టుగా? మేం పని చేయడానికొచ్చాంగానీ, తప్పుడు పన్లకురాలేదు''- అని నిర్మొహమాటంగా చెప్పేసింది ఓనాడు సీతతో.

ఓరోజు సీత వంటగదిలో ఉంది. జయమ్మ అంట్లు తోముతున్నది. కోటేశ్వర్రావు మొహం

కడుక్కోడానికొచ్చి "ఏమేవ్... చెంబుతో నీళ్ళు తీసుకురా, మొహం కడుక్కోవాలి" అన్నాడు.

జయమ్మ మాట్లాడకుండా తనపనితను చేసుకుపోసాగింది.

"చెప్పేది నీకేనే, చెంబుతో నీళ్ళియ్యి" అన్నాడు మళ్ళీ.

"ఎవరికయ్యా నువ్వు చెప్పేది?" అందామె.

"నీకే"

"ఏమేవ్ ఏంది... పనిమనిషి అంత తక్కువైనాది? సరిగ్గా మాట్లాడు" అంది జయమ్మ.

"పనిమనిషిని ఏమేవ్ అనక ఏవండీ అనాలా?"

"పనిమనిషైతే నువ్వేం ఊర్కే పెట్టిపోషించటల్లా. నీ పెళ్ళాంని అనుకో ఏమేవ్, గీమేవ్ అని నన్నంటివా జాగర్త" అంది.

ఆ దెబ్బతో కోటేశ్వర్రావుకు పరువు పోయింది. అయితే పట్టువదలని విక్రమార్కుడతను. దీన్ని ఎలాగైనా సాధించాలనుకున్నాడు. ఓ రోజు ఆదివారం భార్య వసంత ఇంటికి వెళ్తానంటే, పంపించి జయమ్మకోసం ఎదురు చూడసాగాడతను.

సాయంత్రం నాలుగ్గంటలకు జయమ్మ అంట్లు తోమడానికి వచ్చింది. తీరిగ్గా ఆమెతో కబుర్లకి దిగాడు.

"నీమొగుడేం చేస్తున్నాడు?" అని అడిగాడు. జయమ్మకి అమ్మలేకుండా అయ్యతో మాట్లాడ్డం ఇష్టంలేదు.

"తప్పతాగి తందనాల్దొక్కుతున్నాడు" అంది జయమ్మ.

"అదేంటి... ఎప్పుడూ తాగే ఉంటాడా?"

"ఏంభస్తాడో?! వాణ్ణొగ్గేసి ఏడాదయింది"

"మరిప్పుడు ఎవర్తో ఉంటున్నావు?"

"ఎందుకయ్యోవ్? నీకీఆరాలన్నీ?"

"నీ యోగక్షేమం మాకు తెలియొద్దా ఏం?"

"ఏం జేస్తవు నువ్వు? నన్ను కూడా సాకుతావా? ఏంది?"

"ఔను... నువ్వు మాత్రం ఎంతకాలం ఒంటిగా ఉంటావు? వయసులో ఉన్నావు. కాలం గడవొద్దా?" అన్నాడు కోటేశ్వర్రావు.

అంతే, జయమ్మ తోముతున్న గిన్నె గిరవాటేసి కొట్టింది అతని మొహాన. అతడి నుదుటి మీద ఇంత బొప్పి కట్టి, గిన్నె కిందపడి సొట్టపడింది.

"ఏందయ్యోవ్? నువ్వు సాకేది నన్ను? నీ పెళ్ళాం నేలుకో సరిగా చాలు. మొగోడొచ్చాడు... మొగోడు, నన్నేలుకుంటాడట. ఇదిగో, నీబోటోళ్ళని సవాలచ్చమందిని చూశా, నా మొగుణ్ణే లెక్కచేయలేదు, నీబోటోడు నాకు లెక్కా? ఆయమ్మను జూసి నీ కొంపలో పన్జేస్తున్నాకానీ నిన్ను జూసికాదు. అయ్యో సుంద రాంగుడు దొరికిండు. ఆ యమ్మగాబట్టి నీతో కాపురం జేస్తోందిగానీ, ఇంకోర్తైతే ఎప్పుడో పారిపోయేవోరు. జాగర్త- ఇంకెప్పుడూ నా జోలికి రాక, దరిద్రపు ముకపోడా!" అని తనపని చేసుకుపోసాగింది.

ఆ దెబ్బతో కుక్కిన పేనయ్యాడు కోటేశ్వర్రావు. గప్‌చిప్‌గా లేచి వెళ్ళిపోయాడక్కడి నుండి. ఆమె పెళ్ళాంగాదాయె తన మొగతనం చూపడానికి.

జయమ్మ దాంతో ఊరుకోలేదు. సీత వచ్చింతరువాత చక్కగా అరగంటసేపు పూస గుచ్చినట్లు చెప్పింది.

భర్త నుదుటిమీద బొప్పి, గిన్నికి పడ్డచొట్ట ఎవరూ చెప్పకనే సీతకు విషయాన్ని బోధించాయి.

"ఇంట్లోనే మొదలెట్టారా మీ సరసాలు? అది పెళ్ళాంకాదు పనిమనిషి. మొహంమీది బొప్పితో తేల్చేసింది, మంచిమనిషి కాబట్టి సిగ్గెలాలేదండీ మీకు?" అంది సీత.

"నోర్మూసుకోవే... మగవాడు పదిమందిలో తిరుగుతాడు. మగవాడు తిరక్కచెడ్డాడన్నారు. అదొట్టి గయ్యాళిముండ. డబ్బివ్వలేదని గోల చేసి చచ్చింది" అన్నాడు కోటేశ్వర్రావు.

"తిరగడమంటే కనిపించిన ఆడదాని వెంటపడ్డంకాదు. ప్రపంచాన్ని చూడటమని అర్థం. దాన్ని అనవసరంగా అనకండి. మంచి మనిషి కాబట్టి అంతటితో పోనిచ్చింది" అంది సీత.

"సర్లే... నోర్మూసుకో"- అని తలుపు విసురుగా వేసేసి వెళ్లిపోయాడు కోటేశ్వర్రావు.

ఇంటి గుట్టు లంకకి చేటు అంటారు.





అందుకే సీత అనేకసార్లు భర్త ప్రవర్తన ఎట్లా వున్నా ఎదురుచెప్పక తననితాను నిగ్రహించుకునేందుకే ప్రయత్నించేది. తాము గొడవ పడుతుంటే చుట్టుపక్కలవాళ్ళు వింటారనీ, ఆ తర్వాత తమని చులకనచేస్తారనీ, తమకే మాత్రం విలువ, పరువు మిగలవనీ తలపోసేది.

మార్చడం చాతకానప్పుడు కనీసం తనయినా ఏతేడా రానంత జాగ్రత్తగా మసలుకోవాలని ప్రయత్నించేది సీత. కానీ పాపం కోటేశ్వరావుకి నిష్కారణంగానే ఆగ్రహం ముందుకొచ్చేసేది.

సీతని కోటేశ్వర్రావు తిట్టీ, కొట్టినందుకు కలిగే బాధకంటే అది ఇతర్లు చూస్తున్నారనే సిగ్గు కృంగదీసేది. ఒక్కోసారి తన జీవితం ఇంక ఇంతేనా? తన బతుకిలా అథోగతిపాలు కావలసిందేనా అని మథనపడేది.

కోటేశ్వర్రావు నిత్యం పూజ చేస్తాడు. అయితే కొబ్బరికాయలు కొట్టడంలాంటి వెర్రి ఖర్చు దండగ పనులు చేయడు. మనసారా అర్చిస్తే అదే పదివేలు అనేది అతడుద్దేశం. కేవలం తనుచేసి ఊరుకోడు, భార్య సైతం చేయాలి.

ఆనాడు శుక్రవారం. సీత తలంటిపోసుకుని, ఇంటివారిదొడ్లో కోసుకొచ్చిన రకరకాల పూలతో మందిరాన్ని సుందరంగా అలంకరించీ, దీపం వెలిగించీ, చేసే పూజ ముగించేసరికి కోటేశ్వర్రావు భోజనానికి కొద్దిపాటి ఆలశ్యం అయ్యింది. అంతే చిందులూ, శివాలూ మొదలు.

"ఏయ్! జెష్టముండా... తెల్లవారిందటే నీకు? పూజాపునస్కారాలకు? యేం... మొగుడు తొరగా చావాలని మొక్కుకుంటున్నావా? ఆ రోజూ వస్తుందిలే. అప్పుడు నెత్తిన చెంగేసుకు, వూళ్ళేలుదువుగాని. రోజూ ప్రొద్దున్నించీ సాయంత్రందాకా గానుగెద్దులా పన్జేసేమొగుడు ముండాకొడుక్కి ఇంత తిండి పెడదామన్న ధ్యాస ఉండి చావదేం?" అని అడ్డమొచ్చిన కూరల బుట్టని తన్నాడు. పక్కనే వున్న కత్తిపీట తగిలికాలు తెగింది.

ఒక్క నిముషం కోటేశ్వర్రావుకి రక్తప్రసారం ఆగిపోయినట్లు అన్పించింది. కాలు గతి తప్పి పడబోయి, గోడపట్టుకుని పడకుండా నిలబడగలిగాడు.

అప్పటికే హడావిడిగా పూజ దగ్గరనుండి వచ్చిన సీత అతనికి రక్తం కారుతూండటం చూసి కంగారుగా- "అయ్యయ్యో, అదేంటి? అదిరిపాటే తప్ప ఆలోచన వుండదు... రక్తం పోతోంది, వేలైనాపెట్టండి అడ్డు, ఈలోపు పసుపుతెచ్చి అద్దుతాను" అంటూ పరిగెత్తింది.

"నోర్మయ్యి... చేసిన నిర్వాకంచాల్లే... కత్తిపీటకో స్థానం ఏడవలేదా? ఎక్కడపడితే అక్కడ పెట్టడం. పనైపోవడమే నీక్కావాల్సింది, అంతే తప్ప ఒక పొందికాసందికాలేదు. ఎందుకు ఆడజన్మెత్తగానే సరిపోదు..."

"అవుతారా మహానుభావా? మీకు నన్ను తిట్టకపోతే తోచదా? అయిందానికీ, కానిదానికీ కూడా నామీదెందుకు విరుచుకుపడ్తారు? రోజూ తిట్టేతిట్లే కదా! మళ్ళీమళ్ళీ శ్రమపడ్డమెందుకు, ఒకసారి టేప్‌చేసి, మాటికీ రివైండ్ చేయండి చాలు... ఏం? సరేనా?... అప్పుడు వాల్యూమైనా తగ్గించుకోవచ్చు, వేరేవాళ్ళకి వినబడకుండా..." అని నవ్వి, "కాలిటుపట్టండి, పసుపు అద్దుతాను" అంది సీత.

"ఇదిగో నాకీ బోడి జోకులంటే పరమ చికాకూ, కంపరం. నువ్వేదో చదువు వెలగబెట్టానని, నీ అహంకారమంతా ప్రదర్శించబోతావు... ఎన్ని చదువులు చదివినా ఆడది ఆడదే. అణకువగా, నమ్రంగా వుండాలి, వినయ విధేయతలతో మసలుకోవాలి. ... అద్సరే పూజ చేయడానికి ఇంతసేపా? అశ్వమేథ యాగం చేస్తున్నట్లు?" అన్నాడు కోటేశ్వర్రావు.

సీత ముఖం నల్లగా మాడిపోయింది. తనెంత సర్దుకుపోయినా, ఇంకా తల కొట్టేసినట్లు ప్రవర్తిస్తాడేం? ఈ సంస్కారహీనుడితో ఎట్లా మాట్లాడినా తప్పే అయితే అసలేం చేయాలి?" అనుకుంది. అమె ముభావంగా- "ఈరోజు శుక్రవారం... అందుకే తలంటూ అదీ... కాస్త లేటైంది" అని పసుపు సీసాతో వెళ్ళిపోయి, భోజనం వడ్డించింది.

ఆ గాయం కాస్త బరువు చేసింది. ఇంజక్షన్ చేయించుకుని, ఏన్టీబయోటిక్ టాబ్లెట్లు కొన్ని రోజులు వాడినమీదట తగ్గింది.

కోటేశ్వర్రావుకి తగ్గిందోలేదో వేణుకి తీవ్ర




జ్వరం పట్టుకుంది. ఆ జ్వరంలోనే వాంతులు. ఏంతినిపించినా, ఆఖరికి మంచినీళ్ళు తాగించినా తక్షణమే వెళ్ళిపోయేది. పిల్లాడు నాల్గయిదు రోజుల్లోనే పూర్తిగా చిక్కిశల్యమైపోయాడు. సీతకి పిల్లాణ్ణి ఆ స్థితిలో చూస్తుంటే అన్నమే సహించడంలేదు. ఆమె కుమిలికుమిలి ఏడుస్తోంది.

కోటేశ్వర్రావు తాముండే సందులోనే ఓ చిన్న గదిలో ప్రాక్టీసుపెట్టిన ఓ ఆరెమ్మెస్ డాక్టరు దగ్గరికి తీసికెళ్ళాడు, అక్కడయితే ఫీజు తక్కువని. ఆ డాక్టరు కొత్తవాడు. ఇప్పుడిప్పుడే రోగులమీద ప్రయోగాలుచేసి, వైద్యం నేర్చుకుంటున్నాడు. ఆ డాక్టరేవో మందులు రాసివ్వడం లేదా తక్కువ డబ్బులకి తన దగ్గరుండే శాంపిల్స్ ఇవ్వడం- ఇలా చేస్తున్నాడు.

కానీ వేణుకి జబ్బేమిటో నిర్ధారణ కాలేదు, తగ్గుముఖమూ పట్టలేదు. బాబు మాటాపలుకూ లేకుండా సొమ్మసిల్లి పడుకోవడం స్పృహలో వుంటే అతిసన్నగా నూతిలోంచి వచ్చినట్లు ఏడుస్తున్నాడు.

"ఏమండీ... నాకేదో భయంగా వుంది. వేణుని మరో మంచి డాక్టరుకి చూపించండి. పెద్దప్రాణమైనా కాదు తట్టుకోడానికి, పసికందు... నాకా డాక్టరుమీద గురి కుదరడంలేదు..." అంది సీత.

"ఆపవే, ఏడుపుగొట్టుమొహమా! నీకెప్పుడూ కీడు శకించడమే చాతనౌతుందా? ఔనాను నీకీ సందుల్లో గొందుల్లో డాక్టర్లెక్కడ నచ్చుతారు? నువ్వెక్కడ? నీ లెవెలెక్కడ? సూటూ, బూటూ వేసుకుని, నీటూగోటూగా వుంటే తప్ప మంచి డాక్టరు కాదయ్యే..." అన్నాడు కోటేశ్వర్రావు ఉగ్రరూపందాల్చి.

"అన్నిటికీ వితండవాదమైతే ఎట్టా వచ్చేది? ఇది మరోటీమరోటీకాదు. కన్నకొడుకు చావుబతుకులమధ్య కొట్టుమిట్టాడుతుంటే, ఇప్పుడు కూడా మీకు తోచిందే తప్ప, నా మాటలెక్కచేయరా?... మీకు పుణ్యముంటుందండీ! ఏ స్పెషలిస్టుకో చూపండి" అంది సీత ప్రాధేయపూర్వకంగా.

"నీబోడి సలహాలు నాకక్కర్లేదు. నాకు తెల్సు నేనేం చేయాలో. ఆడముండల మాటలువింటే బాగుపడ్డట్టే... నా కాలు నయం చేసింది ఈ డాక్టరు కాదూ?గురి కుదర్లేదట... గురి..."

"అదీఇదీ ఒకటా? దానికేమందులు వేసుకోవాలో, ఏ ఇంజక్షన్ చేయించుకోవాలో నాకూ తెలును, డాక్టర్ దగ్గరికే వెళ్ళనవసరంలేదు. ఇదసలు జబ్బేమిటో తేలకుండా వుంది. ఇంక సరైన మందులేమిస్తాడా డాక్టరు?" ఆవేశంగా అంది సీత.

"పిచ్చికుక్కలా మొరక్క అవతలికెళ్ళు. వాడు నీ ఒక్కతికే కాదు, నాకూ కొడుకే. ఏదో నీకే ప్రేమ కారిపోతున్న కబుర్లు చెప్పకు" అనేసి వెళ్ళిపోయాడు.

సీతకేమీ పాలుపోలేదు. గుండెబరువు తీరేంతవరకూ తనివితీరా పిల్లవాణ్ణి కౌగిలించుకుని ఏడ్చింది. వేణు కళ్ళు కూడా సొంతం తెరవలేనిస్థితిలో వున్నాడు. సగం తెరుస్తూ, మూస్తూ, తల్లి శరీరాన్ని తడుముతూ, అటూఇటూ మెసుల్తూ అతిపేలవంగా ఏడుస్తున్నాడు. వాడి దీనస్థితికి ఆ మాతృహృదయం కంపించిపోయింది.

సీత ఏదో పూనకం వచ్చినట్లులేచినిలబడింది. చీర మార్చుకోవడంగానీ, కనీసం తల దువ్వుకోవడంగానీ కూడా చేయలేదు. ఇంటి తాళం మాత్రం తీసుకుని పిల్లవాణ్ణి చంకనేసుకుని, ఇంటికి తాళంపెట్టి, తాళం చెవులు సుజాతకిచ్చి, రోడ్డుమీదికొచ్చింది. వెంటనే కన్పించిన ఓ ఖాళీ రిక్షా మాట్లాడుకుని వసంత ఇంటికి చేరింది. రిక్షాకి డబ్బులు కూడా వసంత దగ్గరే తీసుకుని ఇచ్చింది.

"అదేంటే సీతా? అట్లావున్నావేం? వేణుకేమైంది... జ్వరమా?" ఆతృతగా అడిగింది వసంత.

క్లుప్తంగా పరిస్థితి వివరించింది సీత.

అంతావిని ఎంతో జాలిపడింది వసంత.

"ఆయన పనిమీద ఎక్కడికో వెళ్ళారు, కాసేపట్లో వస్తారు, కూర్చో. నువ్వు దిగులుపడకు, మంచిడాక్టరుకి చూపిద్దాం" అందామె. సీత వసంతని వాటేసుకుని ఏడవసాగింది.

"ఊరుకో సీతా!... ఏడ్పు మంచిదికాదు, కొంచెంసేపు ఓపికపట్టు... బాబుకి తగ్గిపోతుంది" ఓదార్చింది వసంత.

కొద్దిసేపటికే మోహన్రావు వచ్చాడు.

"అరరే సీతగారా... బొత్తిగా శీతకన్నేశారే మామీద?" అన్నాడు బూట్లు విప్పుతూ.

"మీ ఛలోక్తులు తర్వాతగానీ, ముందీ బాబుని డాక్టర్ శంకరంగారి దగ్గరికి తీసుకెళ్ళాలండీ" అంది వసంత.

"ఏమైంది వేణుకి? అరే! ఎందుకిలా అయ్యాడు?"

"జ్వరమూ, వాంతులూ, విరేచనాలు వారంపైనుండి. ఏవో మందులు వాడ్తున్నాడో డాక్టరు, కానీ తగ్గలేదు" చెప్పింది సీత.

వసంత పిల్లలిద్దరూ పైన డాబామీద ఆడుకుంటున్నారు. పైకెళ్ళి కొంతసేపట్లో వచ్చేస్తాము, కంగారుపడకండని చెప్పి వచ్చిందామె. వేణుని తీసుకుని ముగ్గురూ డాక్టర్ శంకరం డిస్పెన్సరీకి వెళ్ళారు. అతని హస్తవాసి మంచిది. ఎటువంటి రోగాన్ని అయినా ఇట్టే తీసేసినట్టు తగ్గిస్తాడనే పేరుంది.

డాక్టర్ వేణుని పరీక్షచేశాడు.

"ఎన్నిరోజులనుండి పరిస్థితిలా వుంది?"

"వారం రోజులనుండీ డాక్టరుగారూ!" అంది సీత ఆదుర్దాగా.

"ఇంకోవారంరోజులు ఇంట్లో పెట్టుకోకపోయారుటమ్మా? అప్పుడు డాక్టరు అవసరమే వుండదు" అన్నాడాయన కటువుగా.

"ప్లీజ్ డాక్టర్... ఎంత డబ్బు ఖర్చయినా పర్లేదు. మీరెలా అయినా కాపాడాలి బాబుని" మోహన్రావు డాక్టరు చేతులు పట్టుకుని బతిమిలాడాడు.

"చూద్దాం... నేనిప్పుడే ఏమీ చెప్పలేను. రేపటికైనా ఈ వాంతులూ, విరేచనాలూ తగ్గితే పిల్లడు బతికిబట్టకట్టినట్టే. చూద్దాం, ఆ పైన మీ అదృష్టం" అన్నాడు డాక్టరు.

మళ్ళీ ఒకగంట తరువాత "ఇక్కడ నావల్లకాదు, వెంటనే గవర్నమెంట్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళండి. పిల్లవాడికి మగతకూడా వస్తున్నది. బాగవుతే వాళ్ళ చేతుల్లోనే బాగవాలి" అన్నాడు డాక్టర్ శంకరం.

సీత బాబును ఎత్తుకురాగా, వసంత, మోహన్రావులు తీసుకెళ్లి కాజుయాల్టీలో చూపించారు. వాళ్ళు పరీక్షలుచేసి పిల్లవాణ్ణి ఇంటెన్సివ్‌కేర్ వార్డులో చేర్చారు. రేపటికిగానీ ఏసంగతీ చెప్పలేం" అన్నారు డాక్టర్లు.

ఆ మాటలు వింటూనే సీతలో చలనం లేకుండాపోయింది. జీవితంలో ఒకే ఒక్క ఆసరా వుంటుందో, వూడుతుందో తెలియని పరిస్థితిలో నిస్త్రాణగా వార్డు బయటబల్లమీద కూలబడిపోయింది. వసంత పక్కన కూర్చుని ధైర్యం చెబుతోంది. మోహన్రావు కోటేశ్వర్రావును పిల్చుకురావడానికి వెళ్ళాడు. ఒంటిమీద చివరి గడ్డిపరక అది. "ఇహ ఐపోయింది, చాలు ఈ సంసారం. తనీ పశువుతో ఇంక సంసారం చేయలేదు. బతకాలనే ఇచ్ఛకూడా పోయింది తనకు..." అనుకుంది సీత. భర్తను తలచుకున్నకొద్దీ ఈ మూడేళ్ళనుండి మనసులో దాచుకున్న కోపం కట్టలు తెగిపొంగుతోంది.

అప్పుడు వచ్చాడు కోటేశ్వర్రావు మోహన్రావుతో. సీతకు భర్తను చూడగానే ఆగ్రహం పెరిగిపోయింది. రౌద్రంగా, కాళికలా లేచింది. అతనిచొక్కా కాలరుపట్టి కుదిపేసింది. "కళ్ళు చల్లబడ్డాయా? రాక్షసుడా!... కన్న కొడుకన్న మమకారం కూడా లేకుండా పైసాకోసం గడ్డి తింటావా? నువ్వు... నువ్వు... మనిషివికావు, దున్నపోతువి. వాణ్ణి... వాణ్ణి నా ప్రాణం కంటే ఎక్కువగా చూసుకున్నానే. ఇప్పుడు వాడక్కడ నాకు దక్కుతాడో, దక్కడో, దిక్కు తెలీకుండా, ఒంటిమీద స్పృహలేకుండా పడున్నాడు. నువ్వే... నువ్వే... ఇదంతా చేశావు. భార్యనే రేప్‌చేసే త్రాష్టుడివి... వెళ్ళు... వెళ్ళు ఏముఖం పెట్టుకువచ్చావు? ఇక నేను నీ భార్యనికాదు, నువ్వు నా భర్తవీకాదు. వాడు బతికినా, చచ్చినా ఇక నేను నీతో సంసారం చేసేదిలేదు. పో... ముందు పో" అంది సీత.

"ఏమిటీ ఈ పిచ్చి నీకు?" అని ఏదో చెప్పబోయాడు కోటేశ్వర్రావు.

"వెళ్ళు... వెళ్ళమని చెప్పానా? మళ్ళీ నా జోలికి రాకు. ఇంకోసారి నాకు కన్పించావా, నిన్ను చంపనైనా చంపుతాను, లేకపోతే నేను ఛస్తాను అని కోటేశ్వర్రావుని ఒక్కతోపు తోసింది. కొంచెముంటే పడిపోయేవాడే కానీ మోహన్రావు అతన్ని పట్టుకు ఆపాడు. అతన్ని తీసుకుని




మీ సస్యాలకు రక్షణ... అన్నదాత

మీ పశుపోషణలో శ్రీరామరక్ష... అన్నదాత

మీ ఆర్థిక స్థోమతకు పునాది... అన్నదాత

మీ పంటలకు జపం జీవం... అన్నదాత

చీడపీడలపై బ్రహ్మాస్త్రం... అన్నదాత

రైతులకు, సంస్థలకు వారధి... అన్నదాత

---

## బోనస్ బుక్

నెలనెలా ఇచ్చే వార్తలు, వ్యాసాలు, వివరాలు సలహాలేకాక, వ్యవసాయ రంగానికి, దాని అనుబంధ రంగాలకి చెందిన ముఖ్యమైన ఒక్కొ అంశాన్ని కూలంకషంగా చర్చిస్తూ పూర్తి వివరాలతో, ఫోటోలతో కూడిన సప్లిమెంట్‌ను ఒక క్రమపద్ధతిలో ఇచ్చే 'బోనస్‌బుక్' 'అన్నదాత' పాఠకులకొక అమూల్యమైన కానుక.

**నెలనెలా అన్నదాత చదవండి!**
**మీ పురోభివృద్ధికి మీరే మార్గంవేసుకోండి!!**

సంవత్సర చందాకై రు. 30/- అన్నదాత పేరిట డి.డి.ని అన్నదాత, ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్‌కి పంపండి.

బయటకు వెళ్ళిపోయాడు.

వేణుకి మర్నాటికి కొంచెం నెమ్మదించింది. అక్కడినుంచి తీసుకొచ్చి పిల్లలవార్డులో చేర్చారు. పిల్లవాడి దగ్గరే సీత వుంటున్నది. వసంత సీతకు రెండుపూటలా అన్నం తీసుకు వస్తున్నది. కోటేశ్వర్రావు కోపం వచ్చి ఇటుతొంగి చూడనేలేదు. నాలుగు రోజులకు పిల్లవాణ్ణి డిశ్చార్జి చేస్తూ పొడుగాటి ప్రిస్క్రిప్షను చీటీ ఆమె చేతిలో పెట్టారు. ఆమె చేతిలో చిల్లిగవ్వ లేదు. "ఇవ్వాళ డిశ్చార్జి చేస్తారు. బాబుని తీసుకుని నేను ఇంటికి వస్తాను, నువ్వు రావద్దు" అని వసంతకు చెప్పింది సీత క్రితంరోజే.

పిల్లవాణ్ణి డాక్టర్లువచ్చి చూసి డిశ్చార్జి చేసేటప్పటికి మధ్యాహ్నం పన్నెండుగంటలైంది. ధర్మానువత్రివాళ్ళ పాలు పిల్లవాడికి పట్టింది. తను పొద్దుట్నుంచి ఏమీ తినలేదు. పిల్లవాణ్ణి భుజానవేసుకువస్తూ దారిలో బంగారు నగల షాపులో తన మెళ్ళోవున్న ఒకే ఒక్క సువర్ణాభరణం - పసుపుతాడుకు కట్టిన మంగళసూత్రపు బిళ్ళలు అమ్మేసిందామె. రెండొందల రూపాయలు వచ్చాయి. దగ్గర్లోనే మందులషాపులో మందులుకొన్నది. నడవడం కష్టమనిపించి, రిక్షా తీసుకుని వసంత ఇంటికి వెళ్ళింది.

ఇంటికెళ్ళగానే వసంత అడగనే అడిగింది.

"మంగళసూత్రాలేం చేశావే?" అని.

"అమ్మేశాను" అని చెప్పింది సీత నిర్వికారంగా.

"వట్టిపాడుపనిచేశావు. ఎంత అమంగళం? రేపు మీ ఆయన అడిగితే ఏంచెప్తావు? అయినా నాదే పొరపాటు, నీచేతిలో డబ్బేమైనా పెట్టి రావాల్సింది" అని నొచ్చుకుంది వసంత.

"నేను చేసింది పాడు పనికాదు. జీవితంలో చేసిన మంచి పనేదయినా వుంటే ఇదే. ఇహ ఆయన సంగతి... ఆయన్తో నాకిక పడదు. ఈసాని జీవితాన్ని నేను గడపలేనే వసంతా. ఇంక ఆయన దగ్గరకు వెళ్ళేప్రసక్తి లేదు". అంది నిశ్చయంగా సీత.

"అదేవిటే? మొగుణ్ణొదిలేసి ఎలా బతుకుతావే? ఈలోకం బతకనిస్తుందా?"

"బతికే వాళ్ళని బతకనివ్వక ఏంచేస్తుంది? నేను చావను, ధైర్యంగా బతకాలనే నిశ్చయించుకున్నాను" అంది సీత.

"పోనీ మీ అక్కకూ, మాష్టారికీ తెలియబరిస్తే?"

"ఇప్పుడా అవసరం లేదు. మీరు నాకింత సహాయం చేశారు. నేను ఆజన్మాంతం కృతజ్ఞురాలిని. నాకింకో సహాయం చేసిపెట్టండి" అంది సీత.

వసంతకు కళ్ళంట నీళ్ళొచ్చాయి. "ఒసే సీతా... నేనెప్పుడయినా నువ్వు భారమని అనుకున్నానా? మనం చిన్ననాటి స్నేహితురాళ్ళం. నేను నీకు సహాయం చేయడం ఏమిటీ? నేన్నీకు ఏమన్నా సాయం చేశానని నీవనుకుంటే అది నాకు నేను చేసుకున్నదే. నన్ను వేరుగా చూడకు" అంది వసంత.

"నేను మిషను కుట్టుకు బతకాలని నిర్ణయించుకున్నాను. బాంకులో స్వయం ఉపాధిపథకం కింద లోను ఇస్తారని విన్నాను, మీవారితో చెప్పి అది ఇప్పిచ్చే ఏర్పాటు చెయ్యి. ఓ చిన్నషాపు చూసి పెట్టండి, లోపల ఓ గది వుండేట్లు. నేనా గదిలో వుంటాను. ముందుగదిలో టైలరింగ్‌షాప్ పెట్టుకుంటాను" అంది సీత.

"బి.ఎ. చదివి టైలరింగ్ షాపేమిటి.. ఏదైనా ఉద్యోగం చేద్దువుగాని" అంది వసంత.

"వద్దు... ఉద్యోగాలేం బజార్లో పడేసి లేవు, మనం ఏరుకుని తెచ్చుకోడానికి. బాంకులో అప్పు ఇప్పించండి చాలు" అంది సీత.

"సరే... ఆయన్తో చెప్తాను. నువ్వు మాత్రం వేరే వుండడానికి వీల్లేదు. ఆ పక్కగదిలో నువ్వూ, బాబూ వుండండి. మీ ఆయన వట్టి త్రాష్టుడు. ఆయనేం గోల చేస్తాడో" అంది వసంత భయంగా.

"భయపడే రోజులైపోయాయి. ఇప్పటిదాకా భయపడ్తూ గడిపాను జీవితం. ఇహ నా వల్లకాదు. ఆయనేం చేయడు. పీడా వదిలిపోయిందని, ఇంకో పెళ్ళికి సిద్ధమవుతాడు" అంది సీత.

"పోనీ మాష్టారికి రాస్తే?" అంది వసంత.

"అఖ్ఖర్లేదు... బావ మనిషిగా బతకమని నన్నీలోకంలోకి పంపించాడు. నేను జంతువునై




తిరిగి వెళ్ళను. వెళ్తే మళ్ళీ మనిషినై వెళ్తాను'' అంది సీత.

సాయంత్రం మోహన్రావు వచ్చింతరువాత వసంత సీత నిర్ణయం భర్తకు వినిపించింది. తర్జనభర్జనలయాయి. సీత మళ్ళీ భర్త దగ్గరికి వెళ్ళేందుకు ఇష్టపడలేదు. ''సరే... రేపు లోను సంగతి కనుక్కుంటాను'' అన్నాడు మోహన్రావు.




మోహన్రావుకు తెలిసిన బాంకు మేనేజరు అతడి పూచీమీద రెండువేల రూపాయలు అప్పివ్వడానికి అంగీకరించాడు. కాగితాలు సంతకాలు చేసి దాఖలు చేశారు. రెండ్రోజుల్లో అప్పిస్తామన్నారు.

భార్య ఎంతకీ ఇంటికి రాకపోయేసరికి కోటేశ్వర్రావు వసంత వాళ్ళింటికి వచ్చాడు? భార్యని ఇంటికి రమ్మని పిల్చాడు.

''నేనింక ఆ గడప తొక్కను. నీకూ, నాకూ భార్యాభర్తల సంబంధం తప్పిపోయింది. నువ్వెప్పుడూ ఇక్కడికి రాకు, వెళ్ళు'' అని నిశ్చలంగా చెప్పింది సీత.

'ఒళ్ళు పొగరెక్కిందే నీకు. మొగుణ్ణొదిలేసి బతుకుతావటే?'' అన్నాడు కోపంగా కోటేశ్వర్రావు.

''మొగుడు మనిషైతే బతకొచ్చు. పశువుల దగ్గర బతకడం కష్టం. ఐనా నిన్నిప్పుడు నేనేం అనాల్సిన పన్లేదు. మనకు ఇష్టమున్నవాళ్ళ మీద కోపం వస్తుంది. ఏమాత్రం ప్రేమున్నా ఆ మనిషిని ద్వేషిస్తాం. నువ్వంటే ప్రేమలేదు. ఇష్టంలేదు నాలో. బజార్లో పోయేవాడెంతో నువ్వూ నాకంతే'' అంది సీత.

''బజార్లో పోయేవాళ్ళందరితో పోయే యోగ మొచ్చిందేనీకు, శని నెత్తిన తాండవమాడుతుంటే మంచిమాటలెలా వస్తాయి నోటంట?'' అన్నాడు కోటేశ్వర్రావు. సీతేం మాట్లాడలేదు.

''లేలే... బయల్దేరు'' అన్నాడు మళ్ళీ ఆమెని తొందరచేస్తూ.

''నేను రాను'' అంది సీత.

''తప్పుడు ముండా, రావా? ఎలా రావో చూస్తాను'' అని ఆమె జుట్టు పట్టుకున్నాడు కోటేశ్వర్రావు. సీత అతన్ని విదిలించి ఒక్క తోపు తోసింది.

''ఒరేయ్... ఇంక నా ఒంటిమీద చెయ్యేశావో నీరక్తం కళ్ళ చూస్తాను. ఫో... వెళ్ళిపో దరిద్రుడా. నాజీవితంలో శనిలా ప్రవేశించావు'' అంది రౌద్రంగా సీత.

''అయ్యా! కోటేశ్వర్రావుగారూ... ఇట్లా మాఇంట్లో సీన్లు క్రియేట్ చేయడం నాకేం బాగాలేదు. మీరెళ్ళండి'' అన్నాడు మోహన్రావు.

''ఏమిటయ్యా నువ్వు చెప్పేది. నాభార్యతో నేను మాట్లాడితే నీకేం వచ్చింది?'' అన్నాడు.

''ఆమె నీభార్య కానంటోంది. భార్యా, భార్యని పదిసార్లంటే భార్య అయిపోతుందా? తర్వాత సౌమ్యంగా మాట్లాడుకోవచ్చు. ఇప్పటికి మీరెళ్ళండి'' అన్నాడు మోహన్రావు.

''ఇంట్లో నీపెళ్ళాం చాలక, నాపెళ్ళాన్ని కూడా వేసుకు కులకాలని చూస్తున్నావురా నువ్వు. చూస్తాను, నీ అంతు తేలుస్తాను, అది నా కొంపకెలా రాదో చూస్తాను'' అని రొజుకుంటూ, రొప్పుకుంటూ వెళ్ళిపోయాడు కోటేశ్వర్రావు.

ఆ తరువాత నెలరోజుల్లో రెండుమూడుసార్లు వచ్చాడు కోటేశ్వర్రావు సీతని ఇంటికి తీసుకెళ్ళడానికి. ''నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటానే త్రాష్టపు మొహందానా! నాకేం మొగమహారాజుని. కో అంటే కోటిమంది పిల్లలనివ్వడానికి సిద్ధంగా వున్నారు. నువ్వు, పిల్లాడూ దిక్కులేనివాళ్ళైపోతారని చూస్తున్నాను'' బెదిరించాలని చూశాడు సీతని

''ఫో... చేసుకో పో నా జోలికీ, నాకొడుకు జోలికీ రాకు'' అంది సీత.

ఇలా తడవతడవా వచ్చి గొడవ, రభస



చేస్తుంటే కోటేశ్వర్రావు మీద మోహన్రావు పోలీస్ కంప్లైంట్ ఇచ్చాడు. పోలీసులంటే అతడికి చచ్చేంత భయం. పోలీసులు వచ్చి కోటేశ్వర్రావుని స్టేషనుకి తీసుకెళ్ళారు. "ఇష్టంలేని పెళ్ళాంతో కాపురమేం చేస్తావు? విడాకులు పుచ్చుకుని వేరే పెళ్ళిచేసుకో" అని ఇన్స్పెక్టర్ సలహా ఇచ్చిం తరువాత కోటేశ్వర్రావు ఇది పద్ధతి కాదని టాక్టిక్స్ మార్చేశాడు.

లోను శాంక్షనైంది. సీత ఒక కుట్టుమిషను కొని మోహన్రావు కిరాయికి కుదిర్చినగదిలో షాపు తెరిచింది. షాపు ఒక మోస్తరు సెంటరులోనే వుంది. రోజూ పొద్దున భోంచేసి పిల్లవాణ్ణి బేబీకేర్ సెంటర్లో వదిలి షాపుకు వెళ్ళిపోయేది సీత. మొదట్లో అంత ఉత్సాహకరంగా లేదు బిజినెస్. మెల్లమెల్లగా మొదలైంది. సీత బట్టలు కుట్టి ఇస్తానన్న సమయానికి సరిగ్గా ఇవ్వసాగింది. రేటు విషయంలో ఆమేం తగ్గించలేదు. బయట మామూలుగా అందరూ ఎంత పుచ్చుకుంటారో అంత తీసుకోసాగింది. డబ్బు విషయంలో నిక్కచ్చిగా వుండసాగింది. ఆమె ఏపనైనా నైపుణ్యంగా చేయగలదు. బట్ట పాడవకుండా సరైన ఆదికి కుట్టి, చెప్పిన సమయానికి ఇవ్వడం చేసేటప్పటికి మెల్లమెల్లగా కస్టమర్లు రాసాగారు. షాప్ తెరచిన రెండునెలలకు అద్దెకు సరిపోను డబ్బు రాసాగింది.

భర్తనుండి విడిపోయిన రెణ్ణెలకు సీత అత్త మామలు వచ్చి ఆమెను ఇంటికి రమ్మని బతిమిలాడారు. ఆమె నిర్ణయాన్ని స్పష్టం చేసింది. "ఇంక నేనా ఇంటికి రాను. ఆ బంధం తెగిపోయింది" అని.

"ఆడదానివి... నువ్వే కష్టపడతావు. మా వాడికేం? ఇంకో పెళ్ళి చేస్తాం" అని వాళ్ళూ బెదిరించారామెను. అయితే సీత బెదిరిపోలేదు. ఆమెకు ఎలా నచ్చచెప్పాలో తెలియక వాళ్ళు వెళ్ళిపోయారు. కొడుకును విడాకుల కేసు కోర్టులో వేయమని చెప్పి.

ఆ తరువాత 15 రోజులకు కేశవమూర్తి వచ్చాడు. ఆనాడు ఆదివారం. సీత ఇంట్లోనే వుంది. కేశవమూర్తిని చూడగానే ఆమెకి ఏడుపు వచ్చేసింది. అతని గుండెమీద తలపెట్టి ఏడ్చేసింది.

"ఏమైందమ్మా? ఎందుకేడుస్తావు? లే... లేచి కూర్చో" అని సీతను కుర్చీలో కూర్చోబెట్టాడు కేశవమూర్తి.

"అమ్మాయి! వసంతా!! కాస్త కాఫీ పెట్టు తల్లీ!" అని తనే చొరవగా ఇంట్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కువచ్చాడు"

"నీకెలా తెల్సింది, నేనిక్కడున్నానని?" అంది సీత.

"ఇదుగో, ఆ ప్రబుద్ధుడు రాశాడు. కానీ నేను మీ అక్కకు చెప్పలేదు. నిన్ను చూసి వస్తానని బయల్దేరాను"- అంటూ కోటేశ్వర్రావు రాసిన ఉత్తరం చూపాడు కేశవమూర్తి. ఆ ఉత్తరాన్ని సీత చదివింది. అందులో ఇలా ఉంది-

"కేశవమూర్తి అన్నగారికి!

చి॥ల॥సౌ॥ సీత ఇంట్లో నుండి లేచిపోయి, ఆ మోహన్రావు (వసంతమొగుడుట) ఇంట్లో వుంటున్నది. ఇది సంసారం చేసే స్త్రీ చెయ్యాల్సిన పనికాదు. నేనెళ్ళి ఎంత బతిమాలినా, ప్రార్థించినా ఇంటికి రావడం ఇష్టం లేదామెకు. సినిమాలు, షికార్లు తక్కువయ్యాయట. దాంతో మొగుడు పనికిరాకపోయాడు. వాడితో కాపురం పెట్టేసింది. మొగాడన్నవాడు ఇటువంటి ఆడదాంతో కాపురం చేయాలనుకోడు. పెద్దలు మీరైనా దానిక్కాస్త బుద్ధిచెప్తారని రాస్తున్నాను. కిందవాడి అడ్రస్సు రాస్తున్నాను. ఏం చేస్తారో ఇక మీ ఇష్టం. మీ పెంపకంలోనే దానికి అన్ని అవగుణాలూ అలవడ్డాయని నా ఉద్దేశం. మీరు బుద్ధి తెచ్చుకుని దానికి బుద్ధి చెప్తారని ఆశిస్తాను. లేకపోతే విడాకులు ఇవ్వడానికి కోర్టులున్నాయి. నాకేం బాధలేదు. మరో పెళ్ళిచేసుకుంటాను. మళ్ళీనాకు తెలియపరచలేదు అంటారని ఈ ఉత్తరం రాస్తున్నాను. ఇదే చివరి ఉత్తరం. ఇహ నేను మీకురాయను.

ఇట్లు
మీ తమ్ముడు
కోటేశ్వర్రావు"

కింద మోహన్రావు అడ్రస్సు రాసి వుంది.

"బావా... నువ్వేమనుకుంటున్నావు? నేను తప్పు చేశాననుకుంటున్నావా?" అడిగింది సీత.

"అసలు సొంతం విషయం నాకు తెలియందే నేనేం నిర్ణయాలు తీసుకోనమ్మాయ్! వున్న విషయమేంటో అంతా విపులంగా చెప్పు నా మీద నమ్మకం లేకపోతే, నేనింత దూరం రాను" అన్నాడు కేశవమూర్తి.

"మీరు మాట్లాడుతుండండి. నేనిప్పుడే వస్తాను" అని మోహన్రావు బయటకు వెళ్ళిపోయాడు. వసంత సీతకు, కేశవమూర్తికి కాఫీ తెచ్చి ఇచ్చింది.

"బావా... కాపురం చేసిన ఈ మూడేళ్ళలో నేను కాఫీ తాగిన రోజు లేదు. అయితే కాఫీ కోసం సంసారం విచ్ఛేదనం చేసుకున్నానను కోకు. ఈ మూడేళ్ళూ నేను మనిషిగా బతకలేదు. కనీసం ఇంట్లో కుక్కకైనా స్వాతంత్ర్యముంటుందేమోకానీ నాకు లేదు. ఈ మూడేళ్ళు నేను భార్యగా బతకలేదు. కనీసం వేశ్యగా బతకలేదు. నీ దగ్గర సిగ్గుపడను. దేవుడి దగ్గర సిగ్గుపడటమెందుకు? రోజూ రేప్ చేయబడే దిక్కూమొక్కూలేని అభాగ్యురాలైన ఆడదానిలాగా బతికాను. నేనో ఆడజంతువును, మనిషిని కాదాయనకు"- అని తన కథ చెప్పసాగింది సీత. ఆమెఏమీ దాచలేదు. సిగ్గుపడలేదు. ఉన్నది వున్నట్టు పూసగుచ్చి చెప్పింది.

"కనీసం కొడుకంటే ప్రేమ కూడా లేదాయనకు. మనిషిని మార్చాలని ప్రయత్నించాను, నావల్ల కాలేదు. నువ్వు కూడా ఆయన దగ్గరకు తిరిగివెళ్ళమని చెప్పకు, నేవెళ్ళలేను. నువ్వూ




ఆమాట అనేస్తే నాకు చావుతప్ప గత్యంతరం లేదు'' అని ముగించింది సీత.

కేశవమూర్తి మధ్యలో ఏమీ మాట్లాడలేదు. సీత కథనం ఆసాంతం విన్న తరువాత అతను, ''మనిషి మనిషిగా బతకాలమ్మాయి. మనం మనిషిగా బతకడానికి వీల్లేకుండా అడ్డొచ్చేట్టయితే ఆ దేవుడైనా సరే ఎదిరించాలి. సరే, అతని విషయం మనకి అనవసరం నాతో వస్తావా? ఇప్పుడెలా బతకాలనుకుంటున్నావు?'' అన్నాడు.

''ఇహ నీకు భారం కాదల్చుకోలేదు బావా! పిల్లలైనా ఎంతోకాలం తల్లిదండ్రులకు భారం కాలేరు. నేనో టైలరింగ్ షాపు తెరిచాను. ప్రస్తుతం అంత ఉత్సాహకరంగా లేకపోయినా, బిజినెస్ పెరుగుతుందని, నేనూ, నా కొడుకు బతగ్గలమని నాకు విశ్వాసముంది. ఇహ వాణ్ణి పెంచి, పెద్ద చేయడమే నా ధ్యేయం. ఈ జీవితంలో ఇంక నాకే కోరికలూ లేవు'' అన్నది సీత.

''అంతంత పెద్ద స్టేట్‌మెంట్లు ఇచ్చెయ్యక మ్మాయి. అప్పుడే ఏమైంది? జీవితం ఎంతో దీర్ఘమైంది... నువ్వు మళ్ళీ నావెంట రాకపోవడమే మంచిది. అలా అని నీకు సహాయం చేయడానికి వెరచి రావద్దనడంలేదు. నువ్వా బతకడం నేర్చుకోవాలిగదా! నావెంట వస్తే, నీ సమస్యలన్నీ నేనే తీరిస్తే, రేపు నేను పోయింత రువాతైనా మళ్ళీ మామూలు పరిస్థితే వస్తుంది. అందువల్ల నువ్వు తీసుకున్న నిర్ణయం నాకు చాలా నచ్చింది. కానీ, ఆచరణలో పెట్టు. ధైర్యంగా ముందుకుసాగిపో. చిన్నప్పుడు నీకు సైకిలు నేర్పేటప్పుడు సైకిలు ఎక్కినప్పుడు మాత్రం, నేను వెనకపట్టుకున్నానని చూసి భయంలేకుండా తొక్కడం మొదలుపెట్టాదానివి. కొంతదూరం నీతోబాటొచ్చి, తరువాత సైకిల్‌వదిలేసేవాణ్ణి. అది నీకు తెలీదు. నేనున్నానన్న ధైర్యంతో తొక్కుకుపోతుండేదానివి. అలా సైకిల్ నడపడం నేర్చుకున్నావు. అలాగే ఇప్పుడూ మేమందరం- నేనూ, వసంతా, మోహన్‌రావు, మీ అక్కా- నీ వెనకేవున్నాం. భయం లేకుండా ముందుకు పద. జీవిత చక్రాన్ని నైపుణ్యంఉన్న డ్రైవర్‌లా నడిపేస్తావు. నాకా నమ్మకముంది. చిన్నచిన్న దెబ్బలు తగిలితే భయపడకూడదు. సైకిల్ నేర్చుకుంటూ ఒక్కోసారి పడతాం. ఏమవుతుంది? మళ్ళీ ఎక్కడానికి ప్రయత్నించడంలా? అలాగే ఇప్పుడు కిందపడ్డావు. బాగానే దెబ్బలు తగిలాయి. అయితే రేపీ గాయాలు మానిపోతాయి. మచ్చ కూడా కన్పించదు. సైకిల్ ఎలాతొక్కితే దెబ్బలు తగలవో నేర్చుకున్నట్టే, దెబ్బలు తగలకుండా జీవితాన్ని గడవడం కూడా నేర్చుకుంటావు. మళ్ళీ పాఠం చెప్పేస్తున్నాను కదూ?...'' అని నవ్వేశాడు కేశవమూర్తి.

''మీ పాఠాలు విని చాలా కాలమైంది మాష్టారూ'' అంది వసంత.

''అమ్మాయి... మీరంతా పెరిగి పెద్దవాళ్ళయ్యారు. మాకే పాఠాలు చెప్పేస్థాయికి ఎదిగిపోయారు. నాకు నిజంగా భలే ఆనందంగా వుంది'' అన్నాడు కేశవమూర్తి.

మర్నాడు కూడా అక్కడేవున్నాడు కేశవమూర్తి. ఆమె షాపుకెళ్ళి అన్నీ పరికించాడు. వెళ్ళిపోయేముందు సీత చేతిలో ఒక వెయ్యి రూపాయలు పెట్టి ఇలా అన్నాడు- ''మోహనరావు, వసంతా! అమ్మాయిని, బాబుని జాగ్రత్తగా చూసుకోమని మీకు చెప్పడం మిమ్మల్ని అవమానించినట్లవుతుంది, వస్తాను-'' అని చెప్పి వెళ్ళిపోయాడు. కేశవమూర్తి కోటేశ్వర్రావును చూసేందుకు వెళ్లలేదు. అతనితో మాట్లాడాల్సిన అవసరం కేశవమూర్తికి కన్పించలేదు.

కేశవమూర్తి వచ్చి తనకు స్వాంతన కల్గించిన తర్వాత సీత మనసులో సంప్రదాయపరంగా వచ్చిన, ఏ మూలోదాక్కునివున్న అనుమానం కూడా వీడిపోయింది. తాను సరైన పనేచేస్తున్నాననే ధైర్యం కలిగింది. ఆమె మనసులోని కల్మషం తీసివేసినట్లు క్షాళనమైంది.

కేశవమూర్తి ఇంటికి వెళ్ళిన తరువాత రెండు నెల్లకు రాధకు సీత విషయం తెలిసి, భర్తను వదిలిపెట్టడం ఏ భారతనారీ చేయగూడదని, మళ్ళీ భర్తతో కలిసి సఖ్యంగా బతకమని తిడుతూ ఉత్తరం రాసింది చెల్లిలికి. కానీ సీత అక్క ఉత్తరానికి ప్రాముఖ్యత ఇవ్వలేదు.

సీత బిజినెస్ క్రమంగా పుంజుకుంటోంది. షాపు అద్దెపోను రెండు మూడు వందలు మిగులుతున్నాయి. కోటేశ్వర్రావు కోర్టులో విడాకుల కేసు వేశాడు. సీత తనూ లాయర్ని

పెట్టుకుని కోర్టువారిని విడాకులే కోరింది. కట్నంగా ఎకరం తన పేర రాయించుకోవడం, మాటిమాటికీ డబ్బుకోసం బావకి ఉత్తరాలు రాయడం, తనను ప్రేమగా చూసుకోకపోయినా కనీసం సాటిమనిషి అనే భావం కూడా లేకుండా హీనంగా చూస్తూ నీచమైన పదజా లంతో తిట్టడం, కొట్టడం, కొడుక్కి జబ్బు చేసినా మందులిప్పించకపోవడం, తను అత నితో విసిగిపోయి వేరే బతకాలనుకోవడం కోర్టు వారికి విన్నవించింది.

భార్యాభర్తలిద్దరూ అదే కోరుకోవడంతో కోర్టు విడాకులిచ్చింది. అయితే కోటేశ్వర్రావు భార్య అవినీతి ప్రవర్తన కింద ఆమెనుండి విడాకు లు కోరాడు. ఈ కేసంతా సాగేందుకు మూడేళ్ళు పట్టింది. బాబు కాస్త పెద్దవాడయ్యాడు. వాణ్ణి స్కూల్లో వేసింది. తనకూ, పిల్లవాడు ఆమె సంరక్షణలో ఉండటానికి కోర్టు ఉత్తరువు ఇచ్చింది. కాబట్టి, కోటేశ్వర్రావుని నెలకు మూ డువందల రూపాయలు కోర్టు పిల్లవాడి సంర క్షణకోసం ఇవ్వమని కోర్టువారు ఆదేశించారు. ఇది పెద్ద దెబ్బైంది కోటేశ్వర్రావుకి. కానీ సీత అతడి నుండి ఏమీ స్వీకరించడానికి నిరాక రించేసరికి సంతోషపడ్డాడు.

ఈ మూడేళ్ళలో సీత వ్యాపారం బాగా వృద్ధి ...దింది. ఇంకా నాలుగు కొత్తమిషన్లు కొన్నది. ...గ్గురు ఆడవాళ్లని, ఇద్దరు మగవాళ్ళని తన ...ద పనివాళ్ళుగా వేసుకుంది. ఇప్పుడు మగ ...ళ్ళబట్టలు కూడా కుట్టడానికి తీను కు...ంటోంది. బ్యాంకులోన్ మొదటి సంవత్స ర...లోనే తీర్చేసింది. కొలతలు మగదర్జీలు ...నుకుంటుంటే తాను ప్రస్తుతం కటింగ్ మాత్రమే చేస్తున్నది. ఇంటి నుండి పిల్లవాణ్ణి స్కూల్లో దింపడం, తీసుకురావడం, తాను మళ్ళీ స్కూలుకు రావడం- తిరుగుడెక్కువై ఓ మోపెడ్ కొన్నది. బావ తనకు ఎంత ముందు చూపుతో సైకిల్ నేర్పాడోకదా! అనుకుంది. ఇప్పుడామె తిరిగి కవిత్వం రాయడం మొద లుపెట్టింది.

ఈ లోపల సీత ఒకరోజు కేసు వాయిదాకు హాజరై కోర్టు నుండి బయటకు వస్తుంటే "ఎవరదీ?... సీతా!..." అన్న పిలుపు వినబ డ్డది. సీత వెనక్కి తిరిగి చూసింది. వెనక శ్రీహరి. అతన్ని చూడటం పెళ్ళిలోనే. మళ్ళీ కన్పించలేదతను. శ్రీహరిని చూడంగానే ఆమెకు ఎంతో ఆనందం కలిగింది. మళ్ళీ తన స్కూలూ, కాలేజీ రోజులు గుర్తొచ్చాయి.

"ఏవిటి... ఇక్కడేవుంటున్నారా మీరు?" అని అడిగాడు శ్రీహరి.

"అవును... నువ్వెక్కడుంటున్నావు?"

"రాజమండ్రిలో. ప్రస్తుతం బిజినెస్ పని మీద వచ్చాను" అన్నాడతను.

"అక్కబాగుందా... ఏం చేస్తోంది?"

"ఆహా, హాయిగావుంది. ఇప్పుడు నాతోనే వుంటోంది, రాజమండ్రిలోనే" అన్నాడతను.

"పిల్లలెంతమంది?"

"ఆలులేదు, చూలులేదు, కొడుకుపేరు సోమలింగం అన్నాడట, అలావుంది నువ్వుఅ డగడం"

"ఏం పెళ్ళి చేసుకోలేదా?" అంది సీత.

"పెళ్ళిచేసుకుంటారనుకున్న భామలు పారిపోయారు. నేనిక పెళ్ళి వద్దనుకున్నాను. ఇప్పుడు చేసుకుందామన్నా ముదిరిన బెండకా యవని ముందుకు రావడంలేదు ఎవరూ" అన్నాడు జోకేస్తూ.

'అదేం... నీకేమయింది, సలక్షణంగా ఉన్నావు. ముప్పై ఏళ్ళన్నా లేవు, ముదిరిపో వడం ఏమిటి?" అందామె.

"కనిపించడంలా తెల్లజుట్టు?" అని అక్క డక్కడా నెరసిన వెంట్రుకలు చూపించాడు శ్రీహరి.

"వ్యాపారంలో తల పండిపోయినట్లుందే? అవునూ ఎలావుంది బిజినెస్?"

"ఏదో అలా వుంది. అద్సరే కోర్టునుండి వస్తున్నావేంటి?"

"ఇక్కడ మన కేసొకటి వుందిలే"

"ఏమిటా కేసు?"

"బజార్లో రెండు ముక్కల్లో చెప్పే విషయం కాదులే, ఇంటికి పద ముందు" అంది సీత.

"ఇప్పుడు కాదు, రాత్రికి వస్తాను, అడ్రసు ఇవ్వు" అన్నాడు. సీత ఇంటి అడ్రసు రాసిచ్చింది.

"మీవారెలా వున్నారు పిల్లలెంతమంది?" అడిగాడు శ్రీహరి.




# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. అనేక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

డబ్బుకోసమేనా మీ చింత!
మార్గదర్శి ఉన్నది మీ చెంత!!



మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు
అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

బాబు పేరు వేణు, చూద్దువుగాని. మన వసంత కూడా అక్కడే ఉంటోంది. సాయంత్రం తప్పకరా. ఏదో వంకపెట్టి తప్పించుకునేవు?" అంది సీత.

"నేరం నాకు అంటగట్టకు. నువ్వు తప్పించుకున్నావు గానీ నేను నిన్ను తప్పించుకోవాలని చూడలేదు" అన్నాడు నవ్వుతూ.

"సరేలే... ఇప్పుడామాటలు కట్టిపెట్టు. పెళ్ళయిన ఆడవాళ్ళతో అవేం మాటలు?" అంది సీత.

శ్రీహరి వచ్చేటప్పటికి రాత్రి తొమ్మిదిన్నర అయింది. సీత ఇంకా షాపు నుండి రాలేదు. వసంతే అతన్ని ఆహ్వానించి ఆదరించింది. సీత వెళ్ళేటప్పటికి మోహన్రావు, శ్రీహరి మాట్లాడుకుంటున్నారు. ఆపూట సీతని వేరే వంట చేయనీయలేదు వసంత.

"ఎందుకే వసంతా... బాబుని చూడటం కూడా నీకే అంటగట్టి, నేను వెళ్ళిపోతున్నాను, మళ్ళీ ఇదొకటా?" అంది.

"నీ మొహం... శ్రీహరి నీకే కాదు, నాకూ క్లాస్‌మేటే" అంది వసంత. పిల్లలు "అంకుల్" అంటూ పిల్చారు శ్రీహరిని.

"వీడు నా కొడుకు, వాళ్ళిద్దరూ వసంత పిల్లలు" అంది సీత శ్రీహరికి చూపిస్తూ.

శ్రీహరి కేదో అనుమానం కలిగింది. అయితే ఆమెనేమీ అడగలేదు.

భోజనాలు అయ్యాయి. శ్రీహరికి ముందు హాల్లో పడక ఏర్పాటుజేశారు. పిల్లలు నిద్రపోయారు. వసంత, మోహన్రావు-లు కొంతసేపు మాట్లాడి నిద్రొస్తోందని పడుకోడానికి వెళ్ళిపోయారు.

"అవునుసీతా... మీవారేరీ? ఆయన్ని పరిచయం చెయ్యలేదు" అన్నాడు శ్రీహరి అప్పుడు.

"ఆయన ప్రస్తుతం కోర్టులో ఉన్నారు" అందామె.

"కోర్టులో పనిచేస్తారా? ఇంత రాత్రయినా కోర్టులు కట్టేయరాఏం?" అనడిగాడు శ్రీహరి.

"కోర్టులో పనికాదు. కోర్టులో విడాకులకు దాఖలు చేశాడు. నేనూ, బాబూ వేరే ఉంటున్నాం" అంది సీత.

"అదేం? నాకీ విషయాలే తెలీదు. మేం బందరు నుండి వెళ్ళిపోయి చాలా కాలమైంది. మాష్టారు కూడా నాకు ఉత్తరాలు రాయడంలేదు" అన్నాడు శ్రీహరి నొచ్చుకుంటూ.

సీత ఇహ తన కథ చెప్పసాగింది. స్త్రీవట్ల భర్తకున్న అమిత కాంక్ష తప్ప, మిగతావన్నీ చెప్పేసింది.

"జీవితం దుర్భరమైపోయింది. అందుకే వచ్చేశాను. ఇప్పటికి దగ్గర దగ్గర మూడేళ్ళయింది. అక్కదగ్గర నేర్చుకున్న టైలరింగే జీవితాధారమైంది. ఆమెకి నేనెంతో రుణపడిఉన్నాను. పిల్లవాణ్ణి స్కూల్లో వేశాను. ఇవాళ ఫైనల్‌హియరింగ్ అయిపోయింది. ఇంకోనెల రోజుల్లో తేలిపోతుంది కేసు" అని చెప్పింది సీత.

"సారీ... సీతా నువ్వు జీవితంలో ఇంతగా బాధలు పడతావని అనుకోలేదు" అన్నాడు శ్రీహరి.

"ఆం ఒకప్పుడు పడ్డాను. ఇతరుల సంరక్షణలో, ఎవరో నన్ను ఆదుకుంటారు, ఆసరా ఇస్తారు, ఇక వీళ్ళుతప్ప గత్యంతరం లేదు- అనుకున్న రోజుల్లో బాధపడ్డాను. మన జీవితాన్ని మనమే మలచుకోవాలన్న నిర్ణయం తీసుకున్నప్పటి నుండి రోజులు మారిపోయాయి. ఇప్పుడు హాయిగా, స్వేచ్ఛగా ఉన్నాను" అంది సీత.

"అతన్నుండి విడిపోయినందుకు నీకేం బాధగా లేదా?" అడిగాడు శ్రీహరి.

"అసలా బాధ ఉండేటట్లు అతను ప్రవర్తించలేదు. పీడాపోయినట్లు, శనిగ్రహం వదిలినట్లు ఉంది" అంది సీత.

"మరి కోర్టు విడాకులకి ఒప్పుకోక, నువ్వు భర్తతోనే కలసిఉండాలని తీర్పు ఇస్తే?"

"అది జరగదు. ఆయనా విడాకులే కావాలంటున్నాడు. నేనూ అదే కోరుకుంటున్నాను. కారణాలు వేరువేరనుకో. ఒకవేళ నేను ఆయన దగ్గరే ఉండాలని కోర్టు ఆదేశించినా, కోర్టులు స్త్రీకి ఇష్టంలేని భర్తతో కాపురం చేయించలేవు. ఇహ జీవితంలో ఆయన దగ్గరికెళ్ళడం కల్ల"





అంది సీత.

"మాష్టారికి తెల్సా ఈ విషయమంతా?"

"తెల్సు.... అందరికీ తెలుసు. బావ ఆశీర్వాదంతోనే, ఆయనిచ్చిన ఉత్సాహంతోనే బతకగలుగుతున్నాను" అంది సీత.

"సారీ సీతా... నీ కష్టాల్లో నీకేం చేయలేకపోయాను నేను" అన్నాడు శ్రీహరి.

"ఎవరి కష్టాల్లో ఎవరు పాలుపంచుకోగలరు? నువ్వు మంచివాడివి కాబట్టి అలా బాధపడుతున్నావుగాని. నాకు కష్టం కలిగినప్పుడు నన్నెవరూ ఆదుకోలేదు. నువ్వే అన్నట్టుగా పారిపోయారు" అందామె.

"ఏదో మాటవరసకన్నాను. సీరియస్‌గా తీసుకోకు"

"భలేవాడివే... నేనిప్పుడేమీ సీరియస్‌గా తీసుకోవడంలేదు. సరే... పడుకో, నువ్వు పొద్దున్నే వెళ్ళాలి. నాకూ పాపుంది" అని తన గదిలోకి వెళ్ళిపోయింది సీత.

★ ★ ★

సీత అనుకున్నట్టుగానే నెల రోజుల్లో విడాకులిచ్చేశారు.

శ్రీహరి బిజినెస్ పనిమీద వైజాగ్ వచ్చినప్పుడల్లా సీత ఇంటికి వస్తూనే ఉన్నాడు. వచ్చినప్పుడల్లా సీత కొడుక్కి, వసంతపిల్లలకి బట్టలూ, ఆటవస్తువులూ వంటి ప్రెజెంట్స్ పట్టుకువస్తున్నాడు.

"ఇదిగో, నువ్వివన్నీ పట్టుకొచ్చేటట్టయితే మా ఇంటికి రాకు" అని వార్నింగ్ ఇచ్చింది సీత.

"చెప్పడం నీవంతు, చేయడం, చేయకపోవడం నావంతు. ఇంటికి రావద్దనే అధికారం మాత్రం నీకు లేదు" అన్నాడు శ్రీహరి.

"ఎందుకు లేదు? నేనీ ఇంటి యజమానురాల్ని" అంది సీత.

"నేను ఇంటి యజమానురాలి చిన్ననాటి స్నేహితుణ్ణి ఆమెను ఊహించి కవితలు రాసుకున్నవాణ్ణి... ఇంకా రాసుకుంటున్నవాణ్ణి" అన్నాడు శ్రీహరి.

"ఇంకా కవితలు రాస్తున్నావా" అడిగింది సీత.

"జ్యోతి వెలిగింది. సూర్యుడు కనుమరుగైనా దీపాన్ని వెలిగించుకొని చీకట్లు పారదోలుకోవాలి గదా?"

"ఇటువంటి మాటలుమాట్లాడితే, నేన్నీతో మాట్లాడనబ్బాయి!"

"అమ్మాయితో మాట్లాడాల్సిన మాటలే మాట్లాడ్తున్నాను" అన్నాడతను.

"నేనేం చిన్న కూచినికాను. పెళ్ళయింది. విడాకులయింది. కొడుకున్నాడు. కవిత్వంతో కాలం గడిపేరోజులు పోయాయి. వాస్తవంలో బతకాల్సిన రోజులు వచ్చాయి" అంది సీత.

"వాస్తవం పెళ్ళిచేసుకోవద్దనడంలేదే?! మా అక్క విషయంలో సలహా ఇచ్చావు. మరి నువ్వు కూడా ఆచరణలో పెట్టాల్సినరోజు వచ్చేటప్పటికి వెనుకంజ వేస్తున్నావు" అన్నాడు శ్రీహరి.

"అవి అనుభవంలేని మాటలు" అంది సీత.

"అనుభవజ్ఞురాలైన అజ్ఞాన శిఖామణీ! ఒకసారి అక్కను తీసుకువస్తాను, నీ దగ్గరకు"

"అక్క దగ్గర కూడా కూశావా ఈ కూతలన్నీ?"

"కూత నేర్పింది అక్క. ఆమె దగ్గర కూయడానికి భయమెందుకు?" అన్నాడతను.

"మరీ సిగ్గు లేకుండా మాట్లాడుతున్నావు. నువ్వింక మాట్లాడకు" అని ఆమె వెళ్ళిపోయింది.

శ్రీహరి వెళ్ళిపోయిన తరువాత వసంత అంది, సీతతో-

"శ్రీహరి నిన్ను ప్రేమించబట్టే ఇంతకాలం పెళ్ళి చేసుకున్నట్టులేదు" అని.

"ఎవరు చెప్పారు నీకు?"

"నువ్వే చెప్పావు"

"నేనా?"

"నీఅంతర్మథనం నాకు తెలియదనుకోకు. అతనడిగిన దాంట్లో తప్పులేదు. ఎంతకాలమీ మోడువారిన జీవితం?"

"నోర్మూయవే. జీవితానికి పెళ్ళి, సంసారమే గమ్యమా?"

"అదే గమ్యంకాదు గానీ, అదీ ఒక గమ్యమే"

"నాజీవితంలో అద్దైపోయింది. ఆ గమ్యం చేరాను, చేదు మింగి బయటపడ్డాను. మళ్ళీ ఆ వంక చూడటం నాకిష్టంలేదు. అది ఈ జన్మలో అయ్యేపనికాదు"

ఆవంక నువ్వెలాగూ చూళ్ళేవు. ఇలా శ్రీహరి వంక చూడమంటున్నాను"

"చూడు... జరిగేమాటలేవన్నా వుంటే చెప్పు వింటాను. నేనో పిల్లవాడి తల్లిని, వాడిని చూస్తూచూస్తూ గాలికి వదిలేయలేను"

"వాణ్ణెవరు గాలికొదిలేయమన్నారు? నీ పిల్లాణ్ణి నువ్వే పెంచుకో"

"వాడు పెరిగి పెద్దవాడై నన్ను అనుమానంగా, అవమానంగా చూస్తే నేను భరించగలనా?"

"కాలం మారుతోంది. మనుషులు మారుతున్నారు. భావాలు మారుతున్నాయి. వాడు ప్రపంచాన్ని అర్థం చేసుకునేట్టు పెంచు"

"వద్దువద్దు... నువ్వింకేం చెప్పద్దు. నేను వినను"

"నేనింకేం చెప్పనుగానీ సంప్రదాయం కాదనిపైకి రావడానికి ప్రయత్నించే నీలో కూడా సంప్రదాయ భావాలే పాతుకున్నాయే?!"

"అవునే... గట్టునవుండి ఎన్ని మాటలైనా చెప్పవచ్చు. దిగే వాళ్ళక్కదా లోతు తెలిసేది"

"అలా ఆలోచించేవాళ్ళు గట్టునే వుండిపోతారుగానీ, లోతసలుందో లేదో, ఏరు దాటెయ్యడం తేలికో కాదో గమనించలేరు"

"ఏరు దాటకపోతే నాకేంమునిగిపోలేదు. ఈ గట్టే బాగుంది నాకు" అంది సీత.

"వరదలొస్తే పల్లంలో వున్న ఈ గట్టు మునిగిపోయే ప్రమాదముంది. అందుకే నువ్వు ఆ గట్టు చేరాలని నా తపన" అంది వసంత.

"వరదలొస్తే మునిగి చస్తాగానీ అటు మాత్రంపోను"

"సరేలే... మాష్టారుకి రాసి కనుక్కుంటాను. ఆ గట్టుకెళ్తావో, ఈ గట్టుమీదే వుంటావో?!"

"సిగ్గులేని పనిచేయకు... నీకు తెలిసిందనే నామొహం సిగ్గుతో వాలిపోతోంది. ఆయనకక్కూడా తెలియబర్చి నన్నింకా సిగ్గుపడేట్లు చేయకు"

"సిగ్గుపడు... ఆ బుగ్గలు ఎరుపెక్కాలి. ఆс... అలా... రాగరంజితమైన ఆ బుగ్గలు చూసి మేం ఆనందించాలి. ఆ బుగ్గల్లో గులాబీలు పూయించు, శ్రీహరికి భక్తిపురస్సరంగా ఇద్దువుగాని" అంది వసంత నవ్వుతూ.

"నీమొహంలే పద" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది సీత.

శ్రీహరి అంతటితో వదలలేదు. ఉత్తరం రాశాడు. "రేపు, ఆదివారం సాయంత్రం నేనూ, అక్కా అక్కడికి వస్తున్నాం" అని. సీతకేం దిక్కుతోచలేదు. వాళ్ళిలా తనవెంట పడుతున్నారేం అని కోపమొచ్చిందోసారి. వాళ్ళు వచ్చేలోపుగానే వేణును తీసుకుని అక్కా బావా దగ్గరకు పారిపోవాలనుకుంది. అయినా శ్రీహరి అడిగేదాంట్లో మాత్రం తప్పేముంది? అతను తన ప్రేమలో పెళ్ళే మానుకు కూర్చున్నాడే. అతన్ని పెళ్ళి చేసుకుంటేనేం? అయినా మన సొప్పలేదు. తనకు పిల్లవాడున్నాడు. వాడు పెద్దవాడై, తన తల్లి మరో పెళ్ళి చేసుకుందని తన్ను ఏహ్యంగా చూస్తే, ఆమె మనసు ద్వైదీభావంలో పడిపోయింది.

సీత ఇలా వుండగా శారద, శ్రీహరి వచ్చారు. వారెందుకు వచ్చారో సీత మోహన్రావుకు చెప్పినట్టుంది. మోహన్రావు వీళ్ళను వియ్యానికి వచ్చిన వాళ్ళకిచ్చే మర్యాదంతా చేశాడు.

శారద పడుకోబోతూ సీతతో అంది-

"నిన్ను బలవంతపెట్టాలని రాలేదు సీతా! వాడు నీకోసం పెళ్ళి మానుకు కూర్చున్నాడు. నా సంసారం సక్రమంగా వుంది. ఈ పరిస్థితి రాకపోయినట్లయితే వాడసలు పెళ్ళే చేసుకునేవాడు కాదేమో. నీకోసారి పెళ్ళయ్యిందని, తక్కువగా చూస్తాడని అనుకోకు. వాడు అమృతహృదయుడు. నేను చెప్పాల్సిన పనిలేదు. చిన్నప్పటినుండి పరిచయమే నీకు. తండ్రి వున్నా లేనట్టున్న వేణుకు తండ్రి ఏర్పడతాడు... నీకు కుట్టు నేర్పాను కదా?! దానికి ఈమాత్రం గురుదక్షిణ అడగ్గూడదా నేను? బలవంతమేంలేదు. నువ్వే నిర్ణయించుకో. వాడు మాట్లాడుతాడట నీతో, వెళ్ళి మాట్లాడు.




మాట్లాడినందువల్ల నష్టమేంలేదు. కాలం ఇలా మారి నీపరిస్థితే నాదైతే, నేను తప్పక చేసుకునేదాన్ని''

సీత బయటకు వచ్చేటప్పటికి శ్రీహరి సిగరెట్టు తాగుతూ కూర్చున్నాడు డ్రాయింగ్ రూంలో.

''ఇదెప్పటినుండి అలవాటైంది?'' అడిగింది సీత.

''సీత శ్రీహరిని దాటి, వెళ్ళిపోయినప్పట్నుండి''

''అంత బలహీనులేం మగవాళ్ళు?''

''ఔను... ప్రేమించిన వడతికోసం జీవితమంతా నిరీక్షించేటంత బలహీనులు''

''మీరెంత చెప్పినా, నాకు మనసొప్పడంలేదు''

''ఎందుకు మనసొప్పడంలేదో కారణాలు చెప్తాను''

''చెప్పు''

''ఒకటి- నీకు ఒసారి పెళ్ళైంది. ఒకసారి సంసార సుఖం అనుభవించిన స్త్రీ మరొకరికి తన తనువు అర్పించడానికి ఇష్టపడదు''

''ఔను, నిజమే... నాలో ఏముందిప్పుడు? నువ్వనుకున్న అందాలన్నీ పోయాయి'' అంది సీత.

''అందం శరీరంలోలేదు సీతా! మనసులో వుంది

శారీరకవాంఛలమీద నాకు ఇచ్ఛలేదు

వాటికోసమే పెళ్ళయితే నేనెప్పుడో పెళ్ళి చేసుకుని వుండేవాణ్ణి'' అన్నాడు శ్రీహరి.

''అంత మోహం పనికిరాదు శ్రీహరీ! నాలో ఏముంది?''

''అది నీకు తెలీదు. నన్నడుగు చెప్తాను. బంగారంలాంటి మనసుంది. గులాబీ రేకుల్లాంటి పెదవులు పలికే మాటలున్నాయి...''

''ఆగాగు... నువ్వింక వర్ణించనక్కర్లేదు''

''ఇవాళైనా తృప్తిగా వర్ణించనీ. ఒకప్పుడు మాటపైకి చెప్పలేని నిస్సహాయత, చెప్పలేకపోవడం, ఆచరించలేకపోవడంవల్ల కలిగిన బాధ నీకు తెలియదు''.

''నాకెందుకు తెలీదు?... తెల్సు''

''మరి ఇంత నిర్దాక్షిణ్యంగా వదిలేశావేం నన్ను?''

''అప్పుడు నామీదే నాకు జాల్లేదు''

''ఇప్పుడూ వున్నట్టు లేదు''

''ఇప్పుడు జాలిపడాల్సిన స్థితిలో లేం మనం''

''నేనలానే వున్నాను''

''సరే... ఐతే నేను జాలిపడ్తాను. నాకను మానం, నువ్వు నా పరిస్థితికి జాలిపడి నన్ను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నావేమోనని''.

''జాలి కాదు సీతా! ఇది... ఎన్నాళ్ళనుండో పడే మధన. దీన్ని అపహాస్యం చేయకు'' అన్నాడు శ్రీహరి భాధగా.

దాంతో ఆమె ఇంకేం చెప్పలేనట్టు ఆగిపోయింది.

''సీతా! నువ్వింకేం చెప్పద్దు. నా మాట విను, ఒప్పుకో''

''ఏరు దాటేసిన తరువాత నిన్ను ''మీరూ గీరూ'' అని పిలవమంటే పిలవను జాగ్రత్త. గుర్తుంచుకో, మళ్ళీ చెప్పలేదనకు''

''వద్దు... నువ్వు పిల్చినా నేను పలకను. సహజంగా బతుకుదాం''

''నేను చేసే పనిమానను, షాపు అలాగే నడుపుతాను''

''నడుపు... అప్పుడప్పుడు అవసరమొచ్చినప్పుడు డబ్బు అప్పుఇస్తుండు''

''నా గత జీవితం నాకెప్పుడూ గుర్తుచేయద్దు''

''నాకు తెలియని గతం నీకులేదు. అది నీకు గుర్తుచేయాల్సిన పనిలేదు''

సీత ఇంకా ఆలోచిస్తోంది.

''పిల్లవాడికి నన్ను 'నాన్నా' అని పిలవడంనేర్పుతాను. వాడికి తండ్రి లేకుండా బతకాల్సిన అవసరం లేదు'' అన్నాడు శ్రీహరి.

ఆమె ఇంకా ఆలోచనలోనే వుంది. ఆమె నడుంమీద చెయ్యేసి దగ్గరికి లాక్కున్నాడు శ్రీహరి. ''ఆగు హరీ... ఆగు హరీ!'' అందామె అభ్యంతరపెడుతూ.

"ఇంతకాలం ఆగినందుకే నా నుండి తప్పించుకుపారిపోతున్నావు నువ్వు... నేనెప్పు డో సాహసించి వుండాల్సింది" అన్నాడు శ్రీహరి.

"ఔను... ఇంతకాలానికి ధైర్యమొచ్చింది అయ్యగారికి"

"అయ్యో... నీమనసులో నేనున్నానని ఇంత కాలం తెలియక పోయెనే?" అన్నాడు శ్రీహరి.

"ఇప్పుడెలా తెలిసింది నీకు?"

"ఇప్పుడే అంటివిగా, ఇంతకాలానికి ధైర్య మొచ్చిందని"

"అయ్యగారికి కవిత్వం వస్తోంది"

"ఇప్పుడు కాదు, నిన్ను చూసినప్పటినుండీ వస్తోంది కవిత్వం. నేనోసారి నా డైరీలో రాసుకు న్నానో కవిత- చెప్పేదా?"

"ఊ చెప్పు" అంది సీత.

"ఏడు మల్లెల ఎత్తు నా రాణి
ఎదలోని మాట ఎరుక యేలే నాకు
మాటాడునా మురిపెమ్ము లేక
నవ్వునా హృదయతంత్రుల తాళము లేక"

"మరీ కవిత్వానికి కాళ్ళు లేనట్టున్నాయి. ఏడుమల్లెల ఎత్తానేను? ఏభైకేజీల బరువైనా వుంటాను"

"మోసేవాడికి తెలుస్తుంది బరువు"

"అదిగో, ఆ మాటలు మాట్లాడొద్దు. నువ్వూ నన్ను మోయద్దు, నేనూ నిన్ను మోయను"

"భార్యా భర్తా అనవద్దంటావు. పెళ్ళాం, మొగుడు అనాలా?"

"అవే బాగున్నాయేమో"

"కానీ కొంచెం పరుషంగా ధ్వనిస్తున్నాయి"

"వాస్తవం పరుషంగానే వుంటుంది"

"అబ్బా... ఆకాశంలో పయనించేవాణ్ణి కిందికి తెచ్చావు"

"భూమ్మీద హాయిగా చూసి నడవడం మంచిదిలే"

"శుక పికముల రవళి కన్న
చెలిపలుకులె నాకు మిన్న
పొన్నలు, వెన్నెల సైతము చిన్నబోయె
ఈ కన్నియ చిరునవ్వు ముందు"

"ఇవాళ్టి మాటేనా, రేపటిక్కూడా వుంటుందా ఈ ఆలోచన?"

"ఇది ఇప్పటి మాటకాదు. ముచ్చటగా మూడు మూళ్ళుతొమ్మిదేళ్ళు కాపురం చేసిన మాట.

"వేవేల తారల గూడి
నెలరాజు వెలవెలబోయే
చక్కని చుక్కా! నీపక్కన
నేనుండి రారాజై వెలిగితిపో"

"చక్కని చుక్క లేకపోతే రేరాజేగానీ రారాజు కాదన్నమాట"

"చుక్కలేకపోతే రేరాజు కాదు, రారాజు కాదు, తరాజు"

"చుక్కదే గొప్ప అయితే"

"అదేగా నేనూ అనేది" అని ఆమెని గాఢంగా కౌగిలించుకుని ముద్దుపెట్టుకున్నా డు. సీత ఇక వారించలేదు.

"హరీ! ఇంక నా జీవితం మరుభూమి అనుకున్నాను. నువ్వొచ్చి మళ్ళీ నాలో ఆశలు రేపావు"

"ఇంక నువ్వేం భయపడకు. ఎరువేసి, విత్తనాలు నాటి, నీరుపోసి, మరునాటికి నంద నవనం చేయనూ చూస్తాండు"

అతని మాటలకు కిలకిలా నవ్వింది సీత.

"ఎంతమంది పిల్లలు కావాలి నీకు?" అడి గిందామె.

"ఓ గంపెడు కావాలి" అన్నాడు శ్రీహరి.

అలా మాట్లాడుకుంటూ, ఎప్పటి ఊసులో గుర్తుచేసుకుంటూ వుండిపోయారు వాళ్ళిద్ద రూ. ఎంత పొద్దుపోయిందీ గమనించలేదు వాళ్ళు.

తెల్లవారుఝామయింది. వేగుచుక్క మొలి చింది. మాట్లాడుకుంటూ బయటికి వెళ్ళిన ఇద్దరికీ కన్పించింది. శుక్ర తార.

"చూశావా, మాటల్లోపడి నిద్రే మర్చిపో యాం. అప్పుడే తెల్లవారబోతోంది" అంది సీత.

"ఔను... ఇహ నిద్రపోవద్దు. వే గు చుక్క ఉదయించింది.ఆవెలుగులో ఉషోదయతీరం దగ్గర్లోనేవుంది, వెళ్దాం పద"— అన్నాడు శ్రీహరి.








# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. "సమీక్ష" అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **'చతుర' సమీక్షకు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

### ఆగస్ట్ 'చతుర' నవల వేగుచుక్క



సమీక్షకుని పేరు: ..............................



చిరునామా: ..............................

..............................

..............................

..............................

# చతుర కతలు

## పారిన్! ఫారిన్!

ఎమ్.ఎల్.ఏ. ఏడుకొండలుగారు తను ఏ అమెరికాలోనో, జపాన్‌లోనో పుట్టకుండా వెధవ ఇండియాలో పుట్టినందుకు తెగబాధపడిపోతూ ఉంటారు. పుడితే పుట్టాడు కనీసం తనకు పద్మశ్రీ, పద్మభూషణ్, విభూషణ్‌లాంటి నాజూకయిన పేరయినా పెట్టకుండా ఏడుకొండలనే పేరును తనమెడకో గుదిబండలా తగిలించిన అమ్మానాన్నని తిట్టుకోనిరోజుండదు. ఏడుకొండలుగారెప్పుడూ అన్నీ ఫారిన్ వస్తువులే వాడతారు. తప్పనిసరయి కొన్ని ఇండియాలోనే తయారయిన వస్తువులను వాడవలసివచ్చినప్పుడు అవి ఎంతచెత్తగా ఉన్నాయో అదే ఫారిన్ సరుకయితే ఇంకెంత బాగుండేవో చుట్టుపక్కల అందరికీ ఓ లెక్చర్ దంచుతారు. ఆయనగారు ఎమ్.ఎల్.ఏ. కావడానికిముందే తన మేనమామ కూతురు సుబ్బులక్ష్మితో పెళ్లి జరిగిపోయిందిగానీ, లేకపోతే ఖచ్చితంగా ఓ ఫారినర్‌ని పెళ్లాడేవారే.

అలాంటి యమ్.యల్.ఏ. ఏడుకొండలుగారు వరదబాధితులను పరామర్శించడానికని వెళ్లి గోదావరి జిల్లాలోని ఓ చిన్నఊళ్లో మూడురోజులపాటు చిక్కుకుపోయారు. అక్కడ ఫారిన్ వస్తువుల మాట అలావుంచి, స్వదేశీ వస్తువులకే కటకటగా ఉంది. అది చాలదన్నట్టు మరో



ఉపద్రవం వచ్చిపడింది. ఉన్నట్టుండి ఆయన కుడికన్ను సలపడం మొదలుపెట్టింది. క్షణక్షణానికి బాధపెరిగిపోతోంది. డాక్టర్‌ను పిలవాలన్నారు. కానీ అక్కడ ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టర్ ఎవరూలేరు. పైగా 'అసలిక్కడ కంటి డాక్టర్‌కాదుగదా యం.బి.బి.యస్. డాక్టర్ దొరకడమే గొప్ప!' అన్నారు అక్కడివాళ్లు. తక్షణం రాజధానికి వెళ్లి ఫారిన్ డాక్టరుకు చూపించుకోవాలని ఉన్నా ఆ నొప్పి అంతదాకా భరించడం ఏడుకొండలుగారివల్ల కాలేదు. చివరికి ఎలాగోలా వెతికిపట్టుకున్న ఓ లోకల్ డాక్టరునే రప్పించారు. సీదాసాదాగా ఉన్న ఆ 'స్వదేశీ డాక్టర్'ను చూడగానే ఏడుకొండలుగారు మొహం చిట్లించి "చూడండి- నేనేమాత్రం నొప్పి భరించలేను. కాస్త తొందరగా నయమయ్యేలా చూడండి" అన్నారు.

డాక్టరు కన్ను పరీక్షించి- "లోకల్ ఎనస్తీపియా ఇస్తానులెండి, నొప్పితెలీకుండా..." అంటూ సిరంజి తీసుకోబోయాడు.

"ఏమిటి! నేను పల్లెటూరి వెధవనను కుంటున్నారా- ఏదో 'లోకల్'ది ఇచ్చేస్తానంటున్నారే! నాకు లోకల్‌వి పనికిరావు. ఫారిన్‌దే ఇవ్వండి. ఎంత ఖర్చయినా ఫరవాలేదు" అన్నారు ధీమాగా.

డాక్టర్ ఓనిముషం తెల్లబోయి తరువాత సర్దుకొని- "అదికాదండీ... మీకంట్లో ఏదో, ఫారిన్ పార్టికల్‌ఉంది. దీన్ని తీయాలంటే నొప్పి. తెలీకుండా..." అంటూ ఏదో చెప్పబోయాడు.

ఏడుకొండలుగారు డాక్టరుచేతిని తోసేసి లేచినిలబడి, "చాల్చాల్లేవయ్యా- నాకంట్లో ఫారిన్ సరుకేదో ఉంటే తీసేస్తానంటావా' అది అలాగే ఉంచు. ఇంకా నయం, చెప్పకుండా తీసేశావు కాదు. అందుకే నాకసలు ఇండియన్ డాక్టర్లమీద నమ్మకంలేదు" అంటూ విసురుగా గదిలోకెళ్లి ధడాల్న తలుపేసుకున్నారు.

పాపం... ఆ ఇండియన్ డాక్టర్ నోట మాట రాక నిలువుగుడ్లేసుకొని చూస్తుండిపోయాడు.

— స్వర్ణలత

# స్వంత ఇల్లు

"రేపట్నుంచి అద్దె వంద పెంచుతున్నా. మీకిష్టమైతే వుండండి... లేదంటే ఆపై ఫస్టుకల్లా ఖాళీచెయ్యండి" అని వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు ఇంటి ఓనరు.

రాజు హృదయానికి గాయమయింది. మరీ ఇంత అన్యాయమా? రాజుకి వైరాగ్యం ముంచుకొచ్చింది. "ఈ ఇల్లేకాదు ఈ శరీరమే పెద్ద అద్దెఇల్లు. ఈ ప్రపంచమే ఓ అద్దెఇల్లు" వగైరా వేదాంతవాక్యాలు మాట్లాడి భార్య మాలతిని బెంబేలుపరిచాడు.

మాలతి స్థిరంగా ఆలోచించి రాజుకి వుపదేశంచేసింది.

"ఈ అద్దెఇళ్ళ బాధలు మనం ఇకపడలేం. ఊళ్లో నా పేర నున్నపొలం మీ పేరున్నపొలం అమ్మేసి ఈ భాగ్యనగర సరిహద్దుల్లో ఎక్కడో ఓచోట ఓ చిన్న ఇల్లు కట్టుకుందాం" అంది. తర్వాత వత్తిడిచేసింది. అలాగేసని స్థలం కొన్నాడు రాజు. అందరిలాగాక స్థలం కొనగానే ముందు ప్రహరీగోడ కట్టించి, లోన నేలంతా బాగుచేయించి ప్రహరీచుట్టూ కొబ్బరిమొక్కలు వగైరా పెట్టించింది మాలతి. ఓ పద్ధతిగా నిమ్మ, దానిమ్మ, జామ, మామిడీ అంట్లు తెప్పించిపెట్టింది.

తర్వాత ప్రావిడెంటుఫండు లోనూ, ఇన్సూరెన్సు లోనూ తీసుకుని మరో రెండు సంవత్సరాలకి ఇల్లు కట్టుకుని దానిలోకి ప్రవేశించేసరికి ఆ ఇల్లు చుట్టూ పూలమొక్కల్తో పచ్చగా, చల్లగా, హాయిగా, అందంగా ఉంది.

గృహప్రవేశపు తతంగం, విందూ అన్నీ ఘనంగా చేశారు. ఆఫీసులోను, బైటా తనకి కావల్సినవాళ్ళందర్నీ పిలిచాడు రాజు. కుటుంబసమేతంగా వచ్చిన మేనేజరుగారికి స్పెషల్‌గా మర్యాదలు చేశారు భార్యాభర్తలు. దగ్గరుండి అన్నీ చూపించారు.

మేనేజరుగారి భార్యగారి అడుగులకు మడుగులొత్తింది మాలతి.

మేనేజరుగారి పిల్లల్ని యువరాజుల్లాగా, యువరాణుల్లాగా చూశారు రాజుగారి పిల్లలు.




అంతా బాగానే జరిగింది. అందరూ తృప్తి పడ్డారు.

ఆ రాత్రి డాబామీద కూర్చుని భార్యాపిల్లల్తో సంతోషంగా కబుర్లుచెప్తూ, కొబ్బరిచెట్లు వెన్నెల్లో తడుస్తూ గాలిమేస్తూ చేస్తున్న శబ్దాల్ని వింటూ జామ, మామిడిపూతల వాసనల్ని పూలవాసనల్తో కలిపి పీలుస్తూ రాజుగారు "నా జీవితంలో ఎన్నడూ ఇంత ఆనందంగాలేను" అన్నాడు. అతని కన్నులనిండా వింతకాంతి, మనసు నిండా అలలు అలలుగా తృప్తి.

మాలతికూడా "అవునండీ... నా మనసు కూడా ఇవ్వాళ హాయిగా ఉంది. మనకి అద్దె కొంపలపీడ వదిలింది" అంది.

మర్నాడు కొత్త వుత్సాహంతో ఆఫీసులో కడుగుపెడుతున్న రాజుని మేనేజరుగారు పిలుస్తున్నారని చెప్పాడు ఆఫీస్‌బాయ్.

సంతోషంగా మేనేజరు రూంలోకడుగుపెట్టాడు రాజు.

మేనేజరుగారు ఏమీ మాట్లాడకుండా ఓ టైపుచేసిన ఆర్డర్ కాగితం రాజు కిచ్చి రాజు ముఖంలో మారుతున్న కళని పరికిస్తూ అణిచి పెట్టుకుంటున్న సంతోషంతో-

"మన వైజాగ్‌బ్రాంచిలో జరుగుతున్న అస్తవ్యస్తాన్ని అరికట్టాలంటే అది మీవల్లే అవుతుందని నేనే మన ఎమ్.డి.గారికి చెప్పాను. మీరు ఈ వారంలోనే అక్కడిఆఫీస్‌లో చేరిపోవాలి" అన్నాడు.

రాజుకి కళ్ళు తిరుగుతున్నట్టుగా ఉంది.

"అన్నట్టు అక్కడ మన స్టాఫ్‌కి రాత్రే ఫోన్ చేసి చెప్పాను- మీకు ఇల్లొకటి అద్దెకి చూసిపెట్టమని. మీరు ఏకంగా సామానుతోసహా వెళ్ళిపోవచ్చు" అన్నాడు మేనేజర్.

— ఎ.కె. రావ్

# టెలిగ్రామ్

ఆనందరావ్‌కి ఎయిర్‌ఫోర్స్‌లో ఉద్యోగం. ఏడాదికి ఒకేఒక్కసారి తప్పిస్తే మధ్యలో సెలవు పెట్టుకునే అవకాశం లేదతనికి. అయినా ఎలాగేనా ఊరికెళ్ళాలని మహా ఇదైపోతున్నాడు ఆనందరావు. క్రితంసారి సెలవుల్లో వెళ్ళినపుడు తమ ఊళ్ళోనే ఓ పిల్లను చూసి వచ్చాడు. ఆ అమ్మాయిని చూడగానే అప్పటికప్పుడే పెళ్లిచేసేసికోవాలనిపించిందికూడా. కానీ మంచి ముహూర్తాల్లేవని పెళ్లి వాయిదాపడింది.

ఊరినుంచి వచ్చాక కూడా ఆ అమ్మాయి రూపమే కళ్ళముందు మెదులుతోందనికి. ఆ అమ్మాయితో పొలంగట్ల వెంట షికార్లు కొడుతున్నట్టు కలలు కంటున్నాడు. మళ్ళా ఓసారి ఊరికి వెళ్ళాలని, మళ్ళీమళ్లీ ఆ అమ్మాయిని చూడాలనే తపన ఆనందరావులో రోజురోజుకీ ఎక్కువవుతోంది. కానీ, ఆఫీసరు సెలవు పెట్టుకోడానికి ఒప్పుకోడు. ఏంచేయాలో అర్థంకాక, తనతోపాటు పనిచేస్తున్న మధుకి తన బాధనంతా చెప్పుకున్నాడు. "దీనికి ఒక్కటే ఉపాయం. అమ్మకో నాన్నకో ఒంట్లోబాగాలేదని మీవాళ్ళచేత టెలిగ్రామ్ ఇప్పించుకో. మరుక్షణమే నీకు లీవ్‌శాంక్షన్ అవుతుంది" అని సలహాఇచ్చాడతను. పాతదే అయినా తనకా ఐడియా రానందుకు ఒక్కసారి తనని తిట్టుకున్నాడు ఆనందరావు. వెంటనే, ఊళ్ళో తన స్నేహితుడైన రమేశ్‌కి అంతా వివరిస్తూ ఉత్తరంరాశాడు, టెలిగ్రామ్ తొందరగా ఇవ్వమని.

వారంరోజులుగడిచినా స్నేహితుడి నుంచి ఏ సమాచారమూ రాలేదు. ఆనందరావు కోరిక అంతకంతకూ ఎక్కువవుతోందేగానీ చల్లారడంలేదు.

ఓ రోజు ఆనందరావ్, అతని పైఆఫీసరూ ఇద్దరూ ఆఫీసుమెట్లు దిగి వస్తుండగా పోస్ట్‌మేన్ "సార్" అంటూ ఆనందరావు చేతిలో టెలిగ్రామ్‌కాగితంపెట్టి సంతకం చేయించుకుని వెళ్ళాడు. లోలోన సంతోషపడుతూ, ఆఫీసరును ఆందోళనగాచూస్తూ టెలిగ్రామ్‌విప్పాడు ఆనందరావ్. చదివినవెంటనే భూమి గుండ్రంగా తిరుగుతున్నట్టు అనిపించిందతనికి.



"ఏంటోయ్ ఆనందరావ్! ఏమైనా శాడ్ న్యూసా" అంటూ... ఆ టెలిగ్రామ్ తీసుకొని చూసాడు ఆఫీసరు.

విషయం అర్థంఅయిపోయిందతనికి. అగ్గి రాముడైపోయి "మళ్ళీ వచ్చే సంవత్సరమే నీకు సెలవు. ఈలోగా శాంక్షన్ చేసేదిలేదు ఏకంగా పెళ్ళిలోనే కలుసుకో, నీ కాబోయే భార్యని" అంటూ కోపంగా టెలిగ్రామ్‌ని ఆనంద్‌రావ్ ముఖాన్న విసిరి వెళ్ళిపోయాడు, ఆఫీసరు.

ఇంతకీ ఆ టెలిగ్రామ్‌లో "మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియట్లీ విత్ ప్రెషర్‌కుక్కర్," అని ఉంది.

ఆర్మీవాళ్ళకి వస్తువులు చౌకలో దొరుకుతాయని, పనిలోపనిగా కుక్కర్ తెప్పించుకోవచ్చని ఆ మిత్రుడు ఆశపడ్డాడుగానీ కథ అడ్డంతిరుగుతుందని అనుకోలేదు, పాపం!

— వీణ

## బామ్మగారి కోరిక

ఆధునికతకు ఆమడదూరం ఉండే బామ్మగారు పట్నం వచ్చారు.

రిసీవ్ చేసుకోవటానికి స్టేషన్‌కు వచ్చిన మనవడు రామారావు తెచ్చిన గుడిసెలాంటి కొత్తకారును చూడగానే ఆవిడకి వణుకు పుట్టుకొచ్చింది. చెమట్లు కూడా పట్టాయిగానీ తప్పనిసరై ఎలాగో ఇరుక్కుని కూర్చుంది.

కారు పోతున్నంతసేపూ మనవడు హారన్ మోగించినప్పుడల్లా అదేమిటో తెలియక—

"అదేమిట్రా అబ్బి... వూరికే కుయ్ కయ్యిమంటూ అరుస్తుందేవిటిది? ఓసారి బావుచేయించుకోరాదూ- దాని అరుపులు చూసి దారినపోయేవాళ్లు దడుచుకుంటారు కూడాను" అని సలహా ఇచ్చింది. రామారావు లోలోపల నవ్వుకొన్నాడు.



బామ్మగారు ఇంటికొచ్చి కాసేపు సేదదీరింది. రామారావు కొడుకు రేడియో ఆన్‌చేశాడు.

"రామనీల మేఘశ్యామా... కోదండ రామా..." పాట మొదలవగానే కసిగా రేడియో కట్టేశాడు.

"అదేమిట్రా అబ్బీ... అలా కట్టేశావు? ఈ పాటల పెట్టెలో వరమచండాలపు. విషయాలు వస్తాయని అందరూ అంటుంటే నిజమే కాబోలు అనుకొన్నాను. అంతచక్కటి పాట వస్తుంటే కట్టేశావేమిటీ..." దీర్ఘంతీసింది బామ్మగారు.

మునిమనుమడు మళ్లీ రేడియో ఆన్‌చేసి వెళ్లిపోయాడు.

పట్నంలో ఎలా గడపాలోననుకొన్న బామ్మగారికి వారంరోజులూ రేడియో భక్తిపాటలతో క్షణాల్లా గడిచిపోయింది. రేడియోపై సదభిప్రాయం కూడా ఏర్పడింది.

కాని చిత్రంగా ఎనిమిదోరోజున ముదనష్టపు పాటలు మొదలవడంతో బోల్డు ఆశ్చర్యపోయి రామారావును ఆరాతీసింది- "ఇదేంట్రా... నిన్నటిదాకా అంత మంచిపాటలు వేసి ఈరోజిలా..." అంటూ!

"నువ్వు వచ్చినరోజునే ఓ మంత్రిగారు టపా కట్టేశారు. అందుకని ఈ వారంరోజులూ ఆయన ఆత్మశాంతికోసం భక్తిపాటలు వేశారు" అన్నాడు రామారావు.

"అంటే ఇహ మళ్లీ మంచిపాటలు రావటరా...?"

"మంచిపాటలంటే భక్తిపాటలే అయితే ఇహ రావే బామ్మా..."

"అయినా ఆ మంత్రి ఎవడోగానీ ఒక్కడే ఉంటాడేమిట్రా రావుడూ?"

"ఒక్కడేమిటి బామ్మా... డజన్లకొద్దీ ఉంటారనుకో- అక్కడ ఢిల్లీలో...!

"అలాగయితే వారానికొకడు పోతే ఎంత బావుండేదిరా రావుడు" నిట్టూర్చింది బామ్మ!

'మనకంత అదృష్టమా...' అనుకొంటూ రామారావు కూడా నిట్టూర్చాడు.

—భాను




★ ''చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక
కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక
పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచ
టంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా,
మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో వారి వారి
దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు
ప్లానువేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో,
అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని
జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.




“నాకు ఇలాంటి స్థితి వస్తుందనుకోలేదు విజయా” అన్నాడతను బాధతో విలవిలలాడిపోతూ. “మరి మేంకూడా ఇలాంటి పరిస్థితిలోనే ఉంటే నువ్వాదుకునే వాడివికాదా! ఈ మాత్రానికి నాదగ్గర కూడా అభిమానమా గౌరీశం” అంటున్న ఆమె స్వరం జీరబోయింది. గుండె లోతుల్లోంచి ఉప్పెనలా పొంగుకొస్తున్న ఆర్ద్రత జివ్వున పైకెగసింది. రెండు అరచేతులతో ముఖం కప్పుకుని బావురుమంది.

ఏమిటి అతనికొచ్చిన దుస్థితి? వీరిమధ్యగల బాంధవ్యం ఎలాంటిది? పరిస్థితులెవరెవరిని ఎలా మార్చాయి?

**వినయ్ రచన ‘దుప్పటి’ వచ్చేనెల ‘చతుర’ సమర్పించే కానుక.**

# సెప్టెంబర్ చతుర చదవండి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

